# శ్రీ చక్ర సర్వస్వము




మైసూరు అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు
I.C.C.T, మెంఫిస్, U.S.A ఆస్థాన విద్వాంసులు
కనకాభిషేకగ్రహీత, గండపెండేర సన్మానిత
సువర్ణఘంటాకంకణ, శ్రీవిద్యారత్నకర, శ్రీవిద్యావిశారద
డా॥ క్రోవి పార్థసారథి
(స్వామి పరమానందనాథ)

# విషయ సూచిక





ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీచక్ర సర్వస్వము

## 1. విశ్వ తత్త్వం

"నమస్కారం గురువుగారు"

దీర్ఘాలోచనలో ఉన్న రత్నాకరుడు ఒక్కసారిగా ఉలిక్కిపడి చూశాడు. తన శిష్యులిద్దరూ పాదాభివందనం చేస్తున్నారు.

అది కృష్ణాతీరాన ఉన్న విజయవాటిక నగరం. అక్కడ ప్రశాంత వాతావరణంలో చిన్న ఆశ్రమం నిర్మించుకుని ఏకాంతవాసం సాగిస్తున్నాడు రత్నాకరుడు. [illegible] పండితుడు. తెలిసినంతవరకూ క్షుణ్ణంగా చెప్పగలిగినవాడు. శ్రీవిద్యోపాసకుడు. శ్రీవిద్యను గురించి వివరించగల అతికొద్దిమందిలో రత్నాకరుడు ఒకడు. నారాయణభట్టు, కృష్ణశర్మ అనే వారిద్దరూ చాలాకాలం రత్నాకరుణ్ణి సేవించి శ్రీవిద్యను గ్రహించారు. ఆ ఇద్దరు శిష్యులూ చాలాకాలం తరువాత గురువుగారి దగ్గరకు వచ్చి పాదాభివందనం చేశారు.

ఇంత కాలం తరువాత వచ్చిన శిష్యుల్ని చూసి అమితానందం పొందాడు రత్నాకరుడు. కుశలప్రశ్నలు అయిన తరువాత వచ్చిన సందేహం ఏమిటి ? అని అడిగాడు రత్నాకరుడు. శ్రీవిద్యను శిష్యులకు ఉపదేశించిన తరువాత, వారు సెలవు తీసుకుంటున్నప్పుడు "ఎప్పుడు ఏ విధమైన సందేహం వచ్చినా వెంటనే ఇక్కడకు రండి" అని మరీ మరీ చెప్పాడు గురువుగారు. ఆ ప్రకారంగానే శిష్యులు వచ్చి సందేహ నివృత్తి చేసుకుంటున్నారు. అందుచేతనే ఇప్పుడు "మీ సందేహం ఏమిటి ?" అన్నాడు రత్నాకరుడు. గురువుగారి నోటి వెంట ఆ మాట విన్న మరుక్షణమే మొదలుపెట్టాడు నారాయణ భట్టు.

"గురువరేణ్యా ! మీ దయవల్ల శ్రీవిద్యను గురించి పూర్తిగా తెలుసుకున్నాము. ఇప్పుడు మాకు చిన్న సందేహం వచ్చింది. శ్రీచక్రంలో ఉన్న దేవతకు రూపము ఉన్నదా ? ఆ రూపమే లలితాత్రిపురసుందరా ? లేక శ్రీచక్రంలో ఉన్నది సృష్టిస్థితిలయాలకు అతీతమైన పరమేశ్వరా? శ్రీచక్రంలో ఉన్న దేవత పరిధి పరిమితమైనదా ? ఆమె కొంతమంది చేత మాత్రమే

పూజింపదగినదా ? మాకు సవిస్తరంగా చెప్పవలసినది" అన్నాడు. ఆ మాటలు విని రత్నాకరుడు పరమానందభరితుడై ......

"నారాయణ భట్టారకా! శ్రీవిద్యను గురించి ఇంతవరకూ ఎంతో మందికి వివరించాను. కాని ఒక్కరు కూడా ఈ ప్రశ్న నన్నడగలేదు. ఇప్పుడు నువ్వడిగిన ప్రశ్న చాలా ఉత్కృష్టమైనది. అయినప్పటికీ నా శక్తి మేరకు వివరిస్తాను. సావధానుడవై వినవలసినది" అంటూ చెప్పటానికి ఉపక్రమించాడు రత్నాకరుడు.

ఈ జగత్తు చాలా విశాలమైనది. ఇందులో పశువులు, పక్షులు, క్రిమికీటకాలు, మృగాలు, ఇలా అనేక రకాల ప్రాణులు నివశిస్తున్నాయి. ఈ ప్రాణులన్నీ అవి చేసుకున్న కర్మనుబట్టి మళ్ళీ జన్మపొందుతుంటాయి. ఆహార నిద్రామైథునాలు వీటిన్నింటికీ సమానము. వీటిలో ఉన్నతమైనది మానవ జన్మ. మానవుడికి ఆలోచించే శక్తి ఉంది. మిగిలిన వాటికి అది లేదు. అందుచేతనే మానవుడు మిగిలిన జీవరాసిని తన అవసరాలకు వినియోగించుకోగలిగాడు. విజ్ఞానాన్ని అభివృద్ధి చెయ్యగలిగాడు. విశాలమైన విశ్వాన్ని గురించి ఆలోచనలు చేశాడు. పరీక్షలు నిర్వహించాడు. తద్వారా విజ్ఞాన శాస్త్రాన్ని పెంపొందింపచేశాడు.

మానవుడి ఆలోచనా సరళి రెండు రకాలుగా సాగింది. 1) భౌతికము 2) ఆధ్యాత్మికము. భౌతికాభివృద్ధి విజ్ఞాన శాస్త్రం. దీనితో తృప్తి చెందనివారు ఆధ్యాత్మిక చింతన మొదలుపెట్టారు. అసలు మానవుడు ఎక్కడ నుంచి వచ్చాడు ? మరణానంతరము ఎక్కడికి పోతున్నాడు ? ఈ రకమైన ఆలోచనలు చేశాడు. ఈ ఆలోచనల పర్యవసానమే వివిధమతాలు.

ఈ భూగోళం ఏ రకంగా ఏర్పడింది? గ్రహాల గతులేమిటి ? జీవరాసులు ఏ విధంగా ఉద్భవించాయి? ఈ సృష్టికి మూలకారణం ఎవరు ? ఇత్యాది ప్రశ్నలకు సమాధానాల కోసం శాస్త్రవేత్తలు అహర్నిశలు శ్రమించారు. ఆధ్యాత్మిక చింతనాపరులుకూడా వీటికోసం పరిశ్రమించారు. వీరిద్దరి ఆలోచనా విధానము కొన్ని చోట్ల కలిసినట్లున్నా, కొన్ని చోట్ల భిన్నకోణాలలో ప్రయాణం చేసింది. శాస్త్రవేత్తలకు సాక్ష్యాధారాలున్నాయి. కాని ఆధ్యాత్మికులకు సాక్షి వేదశాస్త్రాలు. అందుచేతనే ఆధ్యాత్మికుల వాదనను శాస్త్రవేత్తలు అంగీకరించటం లేదు.

భౌతికమైన సుఖాలన్నీ నశించేవే! కాబట్టి మానవుడికి శాశ్వతమైన సుఖము కావాలి అనేది ఆధ్యాత్మికులవాదన. దీనికోసం భిన్న మతాలు తీవ్రంగా అన్వేషించి కొన్ని మార్గాలు చూపాయి. ప్రపంచంలో అనేక మతాలున్నాయి. వీటిలో ఎవరి ధర్మము వారిది. ఎవరి ఆచారము వారిది. ఒక్క భారతదేశంలోనే అనేక మతాలున్నాయి. వీటిలో ఏ రెండు మతాలూ ఒకటిగా ఉండవు. ఇక ప్రపంచం మొత్తం మీద ఉన్న మతాలలో ప్రసిద్ధి చెందినవి క్రైస్తవ

మతము. ఇస్లాం మతము. ఇక్కడ కూడా ఎవరి దారి వారిదే. సృష్టి రహస్యము ఆయా మత గ్రంథాలలో వివరించబడింది. ఈ మతాలన్నీ ఒక్క మాట మాత్రం ఒప్పుకుంటున్నాయి. "పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు, సర్వాంతర్యామి. ఆద్యంతములు లేనివాడు. అతడే ఈ లోకాలను సృష్టిస్తున్నాడు. లోకంలోని జీవులన్నింటిలోనూ తానే ఉన్నాడు. ఈ సృష్టి అంతా పరబ్రహ్మ మయం."

ఆధ్యాత్మిక చింతన ఇతర మతాల కన్న భారతదేశంలో చాలా ఎక్కువగా జరిగింది. ఇక్కడిది వైదిక సంప్రదాయం. వైష్ణవము, శైవము, శాక్తేయము, గాణాపత్యము అంటూ భిన్న మతాలున్నప్పటికీ, వేదాలనే ప్రామాణికంగా అంగీకరించారు. మన దేశంలో పూజించే ఒక చిన్న యంత్రం సృష్టి రహస్యాన్ని విపులీకరించటమనేది అద్భుతమైన విషయం. ఈ రకమైన పని ప్రపంచంలో ఇంకెక్కడా జరగలేదు. సృష్టి ప్రణాళిక మొత్తం ఆ యంత్రంలో నిక్షిప్తమైంది. సృష్టికి కారణమైన పరమాత్మ అందులోనే ఉన్నాడు. ఆ యంత్రమే శ్రీచక్రము.

**శ్రీచక్రం - విశ్వరూపం :**

*శ్రీచక్రం త్రిపురసుందర్యా । బ్రహ్మాండాకారమీశ్వరీ !*

ఓ త్రిపురసుందరీ ! శ్రీచక్రం అంటే ఏమిటనుకుంటున్నావు . అది సామాన్యమైనది కాదు. అది చరాచర జగత్తుకూ ప్రతీక. ఎందుకంటే జగన్నిర్మాణానికి అవసరమైన పంచభూతాల, తన్మాత్రల యొక్క తత్త్వాలన్నీ శ్రీచక్రంలోనే ఉన్నాయి. అలాగే శ్రీచక్రం విశ్వమానవాళికి ప్రతీక ఎంచేతనంటే మానవదేహంలో ఉండే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనబడే పదకొండు ఇంద్రియాల తత్త్వాలు శ్రీచక్రంలోనే ఉన్నాయి. అందుచేత ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రం అనేది సాధకుల కోరికలు తీర్చే యంత్రం మాత్రమేకాదు. అలా అని ఏదో ఒక దేవత నివాసస్థానం అంతకన్నా కాదు. అది చరాచర జగత్తుకూ, విశ్వ మానవాళికీ ప్రతీక. అంటే ఈ బ్రహ్మాండమంతా అందులో ఇమిడి ఉన్నది. అలాగే ఈ విశాల విశ్వంలో గల మానవాళి అంతా అందులోనే ఉన్నది.

భైరవ యామళంలో శ్రీచక్రాన్ని గురించి పరమేశ్వరికి వివరిస్తూ, సాక్షాత్తూ పరమేశ్వరుడే చెప్పిన మాటలివి. శ్రీచక్రం అంటే కేవలం భారతదేశంలో పూజించబడే యంత్రం మాత్రమేకాదు. ప్రపంచంలోని అన్ని దేశాల, రాష్ట్రాల, ప్రజలందరూ కులమత భేదాలు లేకుండా శ్రీచక్రంలో ప్రతిబింబిస్తున్నారు. సృష్టిలో లౌకిక, అలౌకిక భావాలు అనేకమున్నాయి. అవన్నీ శ్రీచక్రంలో ఉన్నాయి. భూగోళము యొక్క భౌతిక స్వరూపమే శ్రీచక్రం. మానవులలో

గల విభిన్న భావాలవల్ల, దృక్పధాల వల్ల అనేక మతాలు ఏర్పడ్డాయి. ఈ మతాలన్నీ మానవునిలో నైతిక విలువలు పెంపొందించి తద్వారా సమాజ శ్రేయస్సుకు దోహదం చేస్తాయి. మతాలెన్నయినా మార్గాలు ఒకటే. వీటి గమ్యం సాయుజ్యం. అదే మోక్షసాధన.

మానవునిలో ఆధ్యాత్మిక చింతన పెంపొందించి తద్వారా సమాజ శ్రేయస్సును సాధించటమే మతాల ధ్యేయం. మతమనేది భగవంతుని చేరేటందుకు ఒక మార్గము. భగవంతుడు సర్వవ్యాపి. ఆది అంతము లేనటువంటివాడు. ఈ జగత్తు అంతా ఆవరించి పిపీలికాది బ్రహ్మపర్యంతమూ తానే అయి ఉన్నాడు. ప్రపంచంలోని ఏ కులస్థుడైనా, ఏ మతస్థుడైనా సరే అర్చించే సర్వవ్యాపి అయిన భగవంతుడే ఈ శ్రీచక్రంలో ఉన్నాడు. అందుకే శ్రీచక్రం యావత్ప్రపంచానికీ పూజనీయమైనది.

మానవుల కన్న అతీతమైన శక్తులు గల వారు దేవతలు. యక్షులు, గంధర్వులు కిన్నెరలు మొదలైన వారంతా దేవతలకన్న తక్కువ స్థాయివారు. అందుకే మానవుడు తనకు సాధ్యంకాని పనులను చేయటానికి దేవతలను అర్చిస్తాడు. దేవతలను ఆరాధించటానికి ప్రతి దేవతకూ ఒక మంత్రమున్నది. ఆ మంత్రంలో ఆ దేవత పేరు తప్పనిసరిగా ఉంటుంది. ఆ మంత్రాన్ని ఏకాగ్రతతో పునశ్చరణ చేసినట్లైతే ఆ మంత్రం సిద్ధించి సంకల్పసిద్ధి జరుగుతుంది. అయితే దేవతానుగ్రహం పొందటానికి సాధకుడు మంత్రము, యంత్రము రెండూ స్వీకరిస్తాడు. మంత్రము జపం చెయ్యటానికి, యంత్రం అర్చన చెయ్యటానికి. కొన్నిచోట్ల దేవత స్థూలరూపాన్ని ఆరాధిస్తుంటారు. అంటే దేవత ఏ రూపంలో ఉంటే మనకు ఇష్టార్థసిద్ధి కలుగుతుందనుకుంటామో, ఆ రూపమే దేవతకు ఆపాదిస్తాము. అందుచేతనే **"సాధకానాంహితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా"** సాధకుల కోరికలు తీర్చటం కోసమే పరమేశ్వరుడికి రూపం కల్పించబడింది. ఆ దేవతకు కూడా మానవాకారం కల్పించి, అశేష శక్తిసంపన్నుడు అని చెప్పటానికిగాను నాలుగు దగ్గర నుంచీ సామాన్యంగా పదహారు దాకా చేతులు ఏర్పాటు చేసి వాటిలో రకరకాల ఆయుధాలు, వరద అభయ ముద్రలు, శంఖపద్మ నిధులు, పుస్తకము, వీణ, అక్షమాల మొ॥వి ఉంచుతాము. ఆ దేవతను గనక ప్రార్థిస్తే తన దగ్గర ఉన్న ఆయుధాలతో మనకి రక్షణ కల్పిస్తుందని, అభయమిస్తుందని, సంగీతసాహిత్యాలు, అంతులేని ధనరాసులు ఇస్తుందని మంత్రశాస్త్రం చెబుతోంది. అందుకే పరమేశ్వరుని ప్రతిమలను ఎక్కువగా పూజించటం జరుగుతుంది. ఇంతకన్న ఉపాసనలో ముందుకు వెళ్ళినవాళ్ళు దేవతయొక్క యంత్రాన్ని అర్చిస్తారు. దానికే అన్ని రకాల అభిషేకాలు,

పూజలు నిర్వహిస్తారు. మంత్ర జపంచేసి ధారపోస్తారు. ఆ యంత్రానికి ఎంత జపం చేస్తే అంత బలం పెరుగుతుంది. సాధకుడి కోరిక సిద్ధిస్తుంది.

యంత్రాలన్నీ రేఖా నిర్మితాలు. చతుష్కోణము, అష్టకోణము, షట్కోణము, త్రికోణము, వృత్తము మొదలైన రూపాల్లో ఇవి ఉంటాయి. ప్రతి యంత్రంలోనూ ఆ దేవతపేరూ, మంత్రమూ తప్పనిసరిగా ఉంటాయి. కాబట్టి ఆ యంత్రం చూడగానే అది ఏ దేవతకు సంబంధించిందో తేలికగా చెప్పవచ్చు.

ఇక శ్రీచక్రాన్ని చూసినట్లైతే నేలమీదగాని, కాగితం మీదగాని గీసినప్పుడు ఇది చతురస్రంగా ఉంటుంది. మధ్యలో రేఖలు, ఆవరణలు, కోణాలు, పద్మాలు, బిందువు ఉంటాయి. ఇందులో ఏ దేవత పేరుగాని, మంత్రంగాని ఉండవు. కేవలం ఇది రేఖా నిర్మితము. కొన్ని చోట్ల శ్రీచక్రంలో అక్షరాలు కనిపిస్తాయి. అవి కేవలం బీజాక్షరాలు. మంత్రం మాత్రం కాదు. ఇలా శ్రీచక్రంలో బీజాక్షరాలు ఉండటమనేది సంప్రదాయ భేదము.

మన దేశంలోచాలామంది శ్రీచక్రాన్ని అర్చిస్తారు. వారి లెక్క ప్రకారం శ్రీచక్రంలో లలితాపరాభట్టారిక లేదా రాజరాజేశ్వరి ఉంటుంది. అంచేత పంచదశి, షోడశి ఆపైన మంత్రం చెప్పుకున్న వాళ్ళు మాత్రమే శ్రీచక్రాన్ని అర్చిస్తారు. శ్రీచక్రంలో ఉండే దేవత అసలు రూపం ఏమిటి ? అని ఒక్కసారి ఆలోచిస్తే, దేవతకు రెండు రూపాలు చెప్పబడ్డాయి.

1) ఇప్పటిదాకా మనం చెప్పుకున్న స్థూలరూపం. సాధకులందరూ ఈ రూపాన్నే ఉపాసిస్తారు. ఇదే లలిత, లేదా రాజరాజేశ్వరి.

2) పరమేశ్వరి యొక్క అసలు రూపం. చరాచర జగత్తు. విశ్వమానవాళి. అదే విశ్వ రూపం.

లౌకిక లంపటంలో కూరుకుపోయి, కోర్కెల సాధనకు పరమేశ్వరిని ఉపాశించేవారు మొదటి రూపాన్ని ఆరాధిస్తారు. జ్ఞానులు రెండవ రూపాన్ని ఆరాధిస్తారు. అంతకన్న ఉన్నత స్థితిలో ఉన్న మహాజ్ఞానులు నిరాకారుడైన పరమేశ్వరుణ్ణి ఉపాసిస్తారు. అక్కడ భగవత్సాక్షాత్కారం జరగదు. ఆత్మసాక్షాత్కారం జరుగుతుంది. వారికి అర్చనా విధానం లేదు.

భగవంతుడికి రూపం లేదు. ఉన్నది మనం కల్పించిందే. అందుకనే ఇన్ని సంప్రదాయాలు, మతాలు వచ్చాయి. ఇందరు దేవుళ్ళు వచ్చారు. పరమేశ్వరుడికి ఉన్నది ఒకే రూపం. అదే చరాచర జగత్తు. విశ్వమానవాళి. అదే శ్రీచక్రంలో ఉన్న దేవత. అంటే శ్రీచక్రం కేవలం ఒక

మతం వారి కోసమో లేక ఒక సంప్రదాయం వారి కోసమో మాత్రమే కాదు. అన్ని మతాల వారు, అన్ని కులాల వారు, అన్ని దేశాల ప్రజలు అంగీకరించే పరబ్రహ్మ స్వరూపమే చరాచర జగత్తు రూపంలో, విశ్వమానవాళి రూపంలో శ్రీచక్రంలో ఉన్నది. కాబట్టి శ్రీచక్రం ప్రపంచంలో ఉన్న అన్ని జాతుల వారికి, అన్ని దేశాల వారికీ కూడా వందనీయము అని నిరూపించటమే ఈ గ్రంథ రచనలో ముఖ్యోద్దేశ్యము కాబట్టి ముందుగా గురువందనం చేసి, బిందు స్వరూపుడైన పరబ్రహ్మకు, అతని ప్రతిరూపమైన పరమేశ్వరికి నమస్కరించి, ధర్మరక్షణ కోసం ఏర్పాటయిన శృంగేరీ, కంచి, పుష్పగిరి, కుర్తాళం, పీఠాధిపతులకు సాష్టాంగ దండ ప్రణామాలాచరించి, విశాఖపట్నం శారదా పీఠాధి పతులకు, విశాఖపట్నం మహాశాక్త ధార్మిక సంస్థ అధిపతి శ్రీశ్రీశ్రీ భైరవానంద మహాస్వామి వారికి, అవధూత దత్త పీఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానందస్వామివారికి, శ్రీ శ్రీ శ్రీ వాసుదేవానందగిరిస్వామి వారికి, క్రైమోడ్పులిడి క్రైస్తవ మతాధిపతి అయిన శ్రీ శ్రీ శ్రీ పోప్ జాన్‌పాల్ గారికి, ఇస్లాం మతాధి పతులకు, ఇతర మతాల అధిపతులకు ప్రత్యేక నమస్కారాలర్పించి పండితులకు, శ్రీవిద్యోపాసకులకు, జ్ఞానులకు అందరకు నమస్కరించి హరితస గోత్రీకుడనైన క్రోవిపార్థసారధి అను నేను ఈ గ్రంథ రచనకు పూనుకొంటున్నాను. నా యీ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురు గాక.



# 2. శ్రీ చక్రావిర్భావము

గురువుగారూ ! ముందుగా శ్రీచక్రము ఏ రకంగా ఆవిర్భవించింది ? కాలచక్రంలో సంవత్సరానికి మూడువందల అరవై రోజులు ఏ విధంగా వచ్చినాయి ? ఈ సందేహాలు తీర్చండి. అంటూ వినమ్రుడై అడిగాడు కృష్ణశర్మ.

శిష్యుని ప్రశ్న వింటూనే గంభీరంగా తలపంకించినవాడై, కొద్దిసేపు మౌనం వహించి చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

శ్రీచక్రము సృష్టితోపాటే అంటే ఎప్పుడైతే సృష్టి ప్రారంభమైందో అప్పుడే శ్రీచక్రం ఆవిర్భవించింది. సృష్టి ఆరంభానికి ముందు అంతా శూన్యం. అందులో నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడైన పరబ్రహ్మ బిందురూపంలో ఉండేవాడు. ఈ బిందువు తేజోమయమైన కాంతి పుంజము. దానికాంతుల వల్లనే త్రికోణము ఏర్పడింది. సృష్టి చెయ్యాలని సంకల్పించిన పరబ్రహ్మ తనలో అంతర్గతంగా ఉన్న శక్తిని బయటకు పంపాడు. అదే త్రికోణము. దీని నుంచే నామరూపాత్మకమైన జగత్తు వచ్చింది. ముందుగా రూపాత్మకము. ఇందులో భాగంగానే పంచభూతాల గుణాలయిన తన్మాత్రలు ఏర్పడ్డాయి. పంచభూతాలు ఆవిర్భవించాయి. శూన్యం నుంచి ఆకాశం పుట్టింది. ఆకాశము అన్నా శూన్యమే **"ఆకాశాత్ గగనం శూన్యం"**. ఆకాశము శూన్యమైనది కాబట్టే ఇతర ప్రాణులు ఎదగటానికి అవకాశము కల్పిస్తోంది. దాన్నుంచి మిగిలిన భూతాలు ఉద్భవించాయి. ఆ తరువాత ఇంద్రియాలు. ఆ తరువాత జీవరాసి ఉత్పన్నమైంది. ఇది రూపాత్మకమైన జగత్తు. అలాగే త్రికోణం నుంచి ఓంకారము వచ్చింది. దాని నుంచి అచ్చులు, హల్లులు, పదాలు, మంత్రాలు, వేదాశాస్త్రాలు, పురాణాలు వచ్చినాయి. ఇదే నామాత్మకమైన జగత్తు. ఈరకంగా నామరూపాత్మకమైన జగత్తు శ్రీచక్రం నుంచే పుట్టింది. మరి శ్రీచక్రం ఎప్పుడు ఆవిర్భవించింది? పరమేశ్వరుడికి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలగగానే తన నుండి విమర్శరూపిణి అయిన శక్తిని బయటకు పంపాడు. అదే త్రికోణము. దీని నుంచే జగత్తు ఉద్భవించింది. శ్రీచక్ర రాజనిలయా, శ్రీచక్ర నగర స్మామ్రాజ్ఞీ, శ్రీచక్ర సంచారిణీ అని ఆ పరమేశ్వరి చెప్పబడుతున్నది. అనగా ఆ దేవి శ్రీచక్రమునందు నివసిస్తుంది. శ్రీచక్రము అనే సామ్రాజ్యానికి ఆవిడే సామ్రాజ్ఞి, పరమేశ్వరి సంచారమంతా కూడా శ్రీచక్రమునందే ఉంటుంది. కాబట్టి ఆవిధంగా చెప్పబడింది. మరి ఆ శ్రీచకము ఎలా ఆవిర్భవించిందో ఒకసారి చూద్దాం. శ్రీచక్రావతరణము గురించి యోగినీ హృదయంలో చెప్పబడింది.

**తచ్ఛక్తి పంచకం సృష్ట్యాలయేనాగ్ని చతుష్టయమ్ ।**
**పంచశక్తి చ్చతుర్వహ్ని సంయోగాచ్చక్ర సంభవః ।**
**ఏతచ్చక్రావతారస్తు కథయామి తవానఘే ॥**

"యోగినీ హృదయము" అనే గ్రంథమంతా భైరవీ, భైరవుల సంవాదము. భైరవుడు భైరవికి చెబుతున్నాడు. "పాపరహితమైన ఓ దేవీ ! శ్రీచక్రము అవతరించిన విధానము వివరిస్తున్నాను. శ్రీచక్రంలో మొత్తం తొమ్మిది కోణాలున్నాయి. అందులో ఊర్ధ్వ ముఖంగా ఉండే ఐదు కోణాలు సృష్టి రూపమైన శక్తికోణాలు. అధోముఖంగా ఉండే నాలుగూ సంహారరూపమైన శివకోణాలు. వీటి కలయికయే శ్రీచక్రము.

**యదాసా పరమాశక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ ।**
**స్ఫురత్తా మాత్మనః పశ్యేత్తధా చక్రస్య సంభవః ॥**

విశ్వరూపిణి అయిన పరమేశ్వరి స్వేచ్ఛగా తనను తాను చూసినప్పుడు శ్రీచక్రము ఉద్భవించింది.

ప్రళయం సంభవించినప్పుడు జగత్తులోని జీవరాశి అంతా నాశనమై పోతుంది. ఈ జీవులలో అన్నీ ముక్తిపొందవు. కొన్నిటికి ప్రారబ్ధ కర్మ ఇంకా మిగిలి ఉంటుంది. అటువంటి జీవులు తమ ప్రారబ్ధ విశేషాలతో కలిసి మాయతో కలిసిపోతాయి. ఆమాయ చిచ్ఛక్తిగా మారి మిగిలిన జీవులతో కలిసి పరబ్రహ్మయందు సామరస్యము పొందుతుంది. అటువంటిస్థితిలో పరబ్రహ్మ పూర్ణబిందు స్వరూపుడై ఉన్నాడు. అట్టి పరబ్రహ్మకు సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది.

పరబ్రహ్మ స్వయం ప్రకాశముగలవాడు. జ్ఞాన స్వరూపుడు. ఇచ్ఛా రహితుడు. తన యందు కలిసిపోయి విడదీయటానికి వీలులేకుండా ఉన్నటువంటి మాయాశక్తితోనూ, ప్రళయ కాలంలో తనలో కలిసిపోయి, ఇంకా ప్రారబ్ధము తీరనటువంటి జీవుల కోరికలవల్ల మళ్ళీ సృష్టి చెయ్యాలనే కోరిక గలవాడవుతున్నాడు. అప్పుడు తన నుండి విమర్శాంశను బయటకు పంపాడు. ఆ తరువాత 'స్ఫురణ'తో సృష్టి జరిగింది. శివాది క్షితిపర్యంతము ముప్పైఆరు తత్త్వముల మయమైనది, తన యందు ఇంత వరకు అవిభక్తముగా ఉన్నటువంటిది, విమర్శాంశ అయిన క్రియాశక్తిని పరబ్రహ్మ ఒకసారి వీక్షించటమే "స్ఫురణ" అనబడుతుంది. అంటే మాయాశక్తి, జ్ఞానశక్తితో కలిసినట్లైతే సృష్టి జరుగుతుంది. ఈ కాలంలోనే ముప్పైఆరు తత్త్వములతో కూడిన జగత్తూ, దానితోపాటుగా శ్రీచక్రము ఉద్భవించాయి.

సంప్రదాయ ప్రకరణం ప్రకారము శివాది క్షితిపర్యంతము తత్త్వాలు ముప్పైఆరు.

**తత్త్వాని శివశ్శక్తిశ్చ సదాశివ మహేశ్వరౌ ।**
**విద్యేతి పంచశుద్ధాని శుద్ధాశుద్ధాని సప్తచ ॥**

**మాయా కళా విద్యారాగః కాలో నియతి రేవచ ।**
**పురుషశ్చా థా శుద్ధాని ప్రకృతి ర్బుద్ధ్యహంకృతీ ॥**
**మనశ్చేంద్రియ దశకం తన్మాత్రా భూతపంచకమ్ ॥**

| | | |
|---|---|---|
| శివుడు, శక్తి | - | 2 |
| సదాశివుడు, మహేశ్వరుడు | - | 2 |
| శుద్ధవిద్య, మాయ | - | 2 |
| కళా, విద్య, రాగము, కాలము, నియతి | - | 5 |
| పురుషుడు, ప్రకృతి | - | 2 |
| బుద్ధి, అహంకారము | - | 2 |
| మనస్సు | - | 1 |
| ఇంద్రియాలు | - | 10 |
| తన్మాత్రలు | - | 5 |
| పంచభూతాలు | - | 5 |
| మొత్తం తత్త్వాలు | - | 36 |

శంకరభగవత్పాదులవారు ఈ తత్త్వాలు 36 కాదు 25 అని ప్రతిపాదించారు. ఆ తత్త్వాలకు అతీతమైన 26వ తత్త్వమే షోడశీకళ. అదే పరబ్రహ్మము. ఇక్కడ శివుడు అంటే పరబ్రహ్మ. అన్ని తత్త్వాలకు అతీతమైనది. క్షితి అంటే భూమి. పంచభూతాలలో ఆఖరుది. ఈ తత్త్వాలలో మొదటిది అయిన శివతత్త్వమే శూన్యాకారము. అదే బిందువు. ఇది అవ్యక్తము. నిర్గుణము అనగా పరబ్రహ్మకు రూపం లేదు, ఆకారంలేదు, గుణం లేదు. రంగులేదు, పాపపుణ్యాలకూ, ధర్మాధర్మాలకూ, సృష్టిస్థితిలయాలకూ అతీతమైనది. అది ఒక తేజోమయమైన కాంతిపుంజము. సాధకుడు నేను, నాది, అనే మమకారములు వీడినట్లైతే పరబ్రహ్మ సాక్షాత్కారమవుతుంది. అరిషడ్వర్గాలను జయించి, చరాచర జగత్తులోని ప్రతి జీవినీ తన యందు చూడగలిగినవాడు, తనతో సమానంగా చూడగలిగినవాడు

మాత్రమే జ్ఞాని. అట్టి జ్ఞానికి మాత్రమే పరబ్రహ్మ సాక్షాత్కారమవుతుంది. అతడే మోక్షానికి అర్హుడు.

**కాలచక్రము :** పరబ్రహ్మ బిందురూపం అనగా వృత్తరూపంలో ఉంటుంది. ఆ బిందువు నుండి అన్ని వైపులకూ తేజోమయమైన కాంతి కిరణాలు ప్రసరిస్తూ ఉంటాయి.ఆ వృత్తానికి లేదా బిందువుకు 360 డిగ్రీలుంటాయి. ఇదే కాలపురుషుడు -

దీన్ని గురించి "సుభగోదయస్తుతి"లో గౌడపాదులవారు.

***త్రిఖండం తే చక్రం శుచిరవి శశాంకాత్మకతయా***
***మయూఖైః షట్త్రింశద్దశయుతతయా ఖండకలితైః ।***
***పృథివ్యాదౌ తత్త్వే పృథ గుదితవద్భిః పరివృతం***
***భవేన్మూలాధారా ప్రభృతి తవ షట్చక్ర సదనమ్ ॥***

***శతం చాష్టావహ్నేః శతమపికలా షోడశ:రవేః***
***శతం షట్త్రింశత్సితమయ మయూఖా శ్చరణః ।***
***య ఏతే షష్టిశ్చ త్రిశతమభవం స్త్వచ్చరణజాః***
***మహాకాళై స్తస్మా న్నహి తవ శివే కాలకలనా ॥***

శ్రీచక్రము సోమసూర్య అనలాత్మకమైనది. ఇది మూడు ఖండాలుగా ఉంటుంది. ఇందులో అగ్నికి 108 జ్వాలలు, చంద్రునికి 136 కళలు, సూర్యునికి 116కిరణములు ఉన్నాయి. ఈ మొత్తం కలిపి 360, ఈ రకంగా సోమసూర్యాగ్నులు పిండాండ బ్రహ్మాండముల నావరించి తిరుగుతున్నారు. పిండాండ బ్రహ్మాండముల ఏకత్వము వలన, పిండాండము యొక్క ఆవృత్తే బ్రహ్మాండము యొక్క ఆవృత్తి అవుతున్నది. ఇది పరమరహస్యము.

మానవ శరీరంలోని షట్చక్రాలను గనక చూసినట్లైతే ఆధార చక్రంలో 56, మణిపూరంలో 52 వెరసి 108 అగ్ని జ్వాలలు. స్వాధిష్ఠానంలో 62, అనాహతంలో 54 వెరసి 116 సూర్యకిరణాలు. విశుద్ధి చక్రంలో 72, ఆజ్ఞా చక్రంలో 64 వెరసి 136 చంద్రకళలు. మొత్తం కలిపి 360 కిరణములు. ఇదే కాలాత్మకమైన సంవత్సరము. అయితే కౌళమతంలో ఆధారస్వాధిష్ఠానాలే పూజనీయాలు కాబట్టి కాలనిర్ణయము వారికి లేదు.

శ్రీవిద్య అనేది చంద్రవిద్య. చంద్రుని యొక్క కళలు తిథుల రూపంలో ఉన్నాయి.

*దర్శాద్యా: పూర్ణిమాంతశ్చకళా పంచదశైవతు ।*
*షోడశీతుకళాజ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥*

పాడ్యమి నుండి పూర్ణిమ వరకూ తిథులు పదిహేను. పదహారవకళ సాక్షాత్తూ ఆ పరమేశ్వరి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| పదిహేను తిథులు | - | ఒక పక్షము |
| రెండు పక్షములు | - | ఒక మాసము |
| రెండు మాసములు | - | ఒక ఋతువు |
| మూడు ఋతువుల | - | ఒక ఆయనము |
| రెండు ఆయనములు | - | ఒక సంవత్సరము |
| సంవత్సరము అంటే | - | 360 రోజులు |

అందుచేతనే శ్రీవిద్యోపాసన చంద్రుని యొక్క వృద్ధి క్షయాల ననుసరించి మాత్రమే చెయ్యాలి.

జగత్తు అంతా చంద్ర సూర్యాగ్నుల కిరణముల చేత ప్రకాశింపబడుతున్నది. భైరవయామళంలో చెప్పినట్లుగా

*అష్టోత్తరశతం వహ్నే: షోడశోత్తర శతం రవే: ।*
*షట్త్రింశ దుత్తరశతం చంద్రస్య చ వినిర్ణయ: ॥*

అగ్నికి 108 జ్వాలలు, సూర్యునికి 116 కిరణాలు, చంద్రునికి 136 కళలు ఉన్నాయి. ఈ విధంగా సోమ సూర్యాగ్నులు పిండాండ బ్రహ్మాండములనావరించి వర్తించుచున్నారు. భైరవ యామళంలోని చంద్రజ్ఞాన విద్యలో మహేశ్వరుడు గౌరీదేవికీ ఈ విధంగా చెబుతున్నాడు.

*సాధు సాధు మహాభాగే పృష్టం త్రైలోక్యసుందరి ।*
*గుహ్యాద్గుహ్యతమం జ్ఞానం న కుత్రాపి ప్రకాశితమ్ ॥*
*కలావిద్యా పరాశక్తే: శ్రీచక్రాకార రూపిణీ ।*
*తన్మధ్యే బైందవస్థానం తత్రాస్తే పరమేశ్వరీ ॥*
*సదాశివేన సంపృక్తా సర్వతత్త్వాత్మికాసతీ ।*
*శ్రీచక్రంత్రిపురసుందర్యా: బ్రహ్మాండాకారమీశ్వరీ ॥*

**పంచభూతాత్మకంచైవ తన్మాత్రాత్మకమేవచ ।**
**ఇంద్రియాత్మకమేవంచ మనస్తత్త్వాత్మకం తథా ॥**
**మాయాది తత్త్వరూపంచ తత్త్వాతీతంచ బైందవమ్**
**బైందవే జగదుత్పత్తి స్థితి సంహారకారిణీ ॥**
**సదాశివేనసంపృక్తా తత్త్వాతీతా మహేశ్వరీ ।**
**జ్యోతిరూపా పరాకారా యస్యాదేహోద్భవాశ్శివే ॥**
**కిరణాశ్చ సహస్రంచ ద్విసహస్రంచ లక్షకమ్ ।**
**కోటి రర్బుదమేతేషాం పరా సంఖ్యా న విద్యతే ॥**

ఓ పరమేశ్వరీ । మహాభాగా । మంచి ప్రశ్నవేశావు. ఇది రహస్యాతి రహస్యమైనది. లోకమందెక్కడా ఇంతవరకూ ఇది చెప్పబడలేదు.

పరాశక్తి యొక్క కలావిద్య శ్రీచక్రాకారరూపమున ఉన్నది. ఆ శ్రీచక్రము మధ్యన బైందవ స్థానమున్నది. అక్కడ పరమేశ్వరి ఉంటుంది.

ఆమె సదాశివునితో కూడిన సర్వతత్త్వాత్మిక అవుతున్నది. త్రిపురసుందరి అయిన శ్రీదేవి చక్రము బ్రహ్మాండాకారము.

ఆ చక్రము పంచభూతాత్మకము, తన్మాత్రల స్వరూపము, ఇంద్రియాల స్వరూపము, మనస్సు యొక్క రూపము, మాయాదితత్త్వముల రూపము, అన్ని తత్త్వములకు అతీతమైన బిందువుకూడా అదే. ఆబిందువునందే సృష్టి స్థితిలయకారిణి అయిన పరమేశ్వరి ఉన్నది.

సదాశివునితో కూడి సకల తత్త్వాతీతమైన మహేశ్వరి జ్యోతిరూపమై, పరాశక్తి రూపంగా ప్రకాశిస్తున్నది. ఆమె దేహము నుండి ఉద్భవించిన కిరణములు వేయి, రెండు వేలు, లక్ష, కోటి, అర్బుదము ఈ రకంగా అసంఖ్యాకములు, అనంతములై ఉన్నవి.

**తామేవానుప్రవిశ్యైవ భాతి లోకం చరాచరమ్ ।**
**యస్యాదేవ్యా మహేశాని భాసా సర్వం విభాసతే ॥**
**తద్భాసా రహితం కించిత్ నచయచ్చ ప్రకాశతే ।**
**తస్యాశ్చ శివశక్తేశ్చ చిద్రూపాయాశ్రితం వినా ॥**
**అంధ్య మాపద్యతే నూనం జగదేతచ్చరాచరమ్ ।**
**తేషాం అనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరి ॥**

మధ్యేషష్ట్యుత్తరంతేఽ మీ త్రిశతం కిరణాశ్శివే ।
బ్రహ్మాండం వ్యశ్నువానాస్తే సోమసూర్యానలాత్మనా ॥
అగ్నేరష్టోత్తరశతం, షోడశోత్తరశతంరవే ।
షట్త్రింశ దుత్తరశతం చంద్రస్య కిరణాఃశివే ॥

ఆ కిరణ సముదాయమును చేతనే చరాచర జగత్తు అంతా ప్రకాశిస్తున్నది. పరమేశ్వరి ప్రకాశముచేతనే సర్వమూ ప్రకాశిస్తున్నది. ఆమె కాంతులు ప్రసరించక పోతే ఏ వస్తువూ ప్రకాశించదు. చరాచర జగత్తు అంతా అంధకారంలో మునిగి పోతుంది. కొన్ని వేలకోట్ల సంఖ్య గల ఆ కిరణములలో కొన్ని, అనగా అగ్నికి 108, సూర్యునకు 116, చంద్రునకు 136 మొత్తం మీద 360 కిరణములు బ్రహ్మాండమును వ్యాపించి ఉన్నాయి.

బ్రహ్మాండం భాసయన్త్యస్తే పిండాండమపి శాంకరి ।
దివాసూర్యా స్తథా రాత్రౌసోమో వహ్నిశ్చసంధ్యయోః ॥
ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకస్త్రయః ।
షష్ట్యుత్తరంచ త్రిశతం దినాన్యేవచ హాయనమ్ ॥
హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి శ్రుతిః ।
ప్రజాపతి ర్లోకకర్తా మరీచి ప్రముఖాన్ మునీన్ ॥
సృజంత్యేతే లోకపాలాన్ తే సర్వే లోకరక్షకాః ।
సంహారశ్చ హరాయత్తః ఉత్పత్తిర్భవ నిర్మితా ॥
రక్షాతు మృడసంలగ్నా సృష్టిస్థితిలయే శివః ।
నియుక్తః పరమేశాన్యా జగదేవం ప్రవర్తతే ॥

ఓ శాంకరీ । ఆ కిరణాలు పిండాండ బ్రహ్మాండాలను ప్రకాశింప చేస్తున్నాయి. పగటి పూట సూర్యుడు, రాత్రులందు చంద్రుడు, సంధ్య వేళలయందు అగ్ని ఆయా కాలములను ప్రకాశింపచేస్తున్నారు. 360 రోజులు ఒక సంవత్సము. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే మరిచి మొదలైన మునులను సృష్టించాడు. వీరంతా లోక రక్షకులు. జగత్తు యొక్క సృష్టిని భవుడు, రక్షణ మృడుడు, లయము హరుడు చేస్తున్నారు. వీరందరినీ పరమేశ్వరి ఆయా పనులకు నియమించింది.

సౌందర్యలహరిలో శంక భగవత్పాదుల వారు కాలచక్రాన్ని గురించి ఈ విధంగా అన్నారు.

**క్షితౌ షట్పంచాశ ద్విసమధిక పంచాశ దుదకే**
**హుతాశే ద్వాషష్టి శ్చతురధిక పంచాశ దనిలే ।**
**దివి ద్విషట్త్రింశ న్మనశి చ చతుష్షష్టి రతి యే ।**
**మయూఖాస్తేషా మప్యపురి తవపాదాంబుజయుగమ్ ॥**

ఓ దేవీ ! పృథివీతత్త్వాత్మకమైన మూలాధారమందు 56, జలతత్త్వాత్మకమైన మణి పూరమందు 52, వెరసి అగ్ని జ్వాలలు 108. అగ్ని తత్త్వాత్మకమైన స్వాధిష్ఠానమునందు 62, వాయుతత్త్వాత్మకమైన అనాహతమందు 54, వెరసి సూర్య కిరణాలు 116. ఆకాశతత్త్వాత్మకమైన విశుద్ధి చక్రమందు 72, మనస్తత్త్వాత్మకమైన ఆజ్ఞా చక్రమందు 64 వెరసి చంద్ర కళలు 136 ఈ మొత్తం కలిసి 360 కిరణాలు. ఇవి పరమేశ్వరి పాదపద్మముల నుండి వెలువడి లోకములను ప్రకాశింప చేస్తున్నాయి. ఈ కిరణాలే సంవత్సరానికి ప్రతీక.

ఈ కిరణాలను గురించి సౌభాగ్యవర్ధని, ఆనందలహరి వ్యాఖ్యలలో వివరించబడింది. **కుబ్జికాతంత్రంలో** ఈ విధంగా ఉన్నది.

1. క్షితి యందు కిరణాలు 28. ఇవి పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతః కరణ చతుష్టయము. (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) కాలము, ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వము, ఇవి శివ శక్తి భేదముచేత రెండు విధాలై, మొత్తం 56 అవుతున్నాయి.

2. జలతత్త్వాలు 26. అవి పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, సార్థములు 10. మనస్సు 1, మొత్తం 26. శివశక్తి భేదము చేత రెండు విధాలై మొత్తం 52 అవుతున్నాయి.

3. అగ్ని తత్త్వాలు 31. అవి పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలు, సార్థములు 10, మనస్సు, శివశక్తి భేదము చేత రెండు విధాలై మొత్తం 62 అవుతున్నాయి.

4. వాయు తత్త్వాలు 27. అవి పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము, కాలము, ప్రకృతి, పురుషుడు. ఇవి శివశక్తి భేదము చేత రెండు విధాలై 54 అవుతున్నాయి.

5. ఆకాశ తత్త్వములు 36. శివాది క్షితిపర్యంతము తత్త్వాలు 36. అవి శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్యా, మాయా, కలా, విద్యా, రాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, అహంకారము, బుద్ధి, మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, తన్మాత్రలు, పంచభూతాలు. శివశక్తి విభాగములై 72 అవుతున్నాయి.

6. మనస్తత్త్వములు 32 అవి.

1) పరా ఇవి నాలుగు : పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరి.

2) ఇచ్ఛాశక్తి. ఐదు రకాలు : కర్తుం, కారయితుం, ఉపకర్తుం ప్రతికర్తుం, ఉదాసితుం.

3) జ్ఞానశక్తి 4 విధాలు : జ్ఞానము, త్వమహం, త్వదీయం, మదీయం.

4) క్రియా శక్తి 7 విధాలు. ఇష్టం, పూర్తం, స్వాధ్యాయం, జపం, పూజా, తపం, దానం.

5) కుండలిని 4 విధాలు : ఉన్నయ, లయ, ప్రత్య గ్వృత్తి, విశ్రాంతి.

6) మాతృకావర్గులు 8 అవి : అ, క, చ, ట, ప, య, శ, వెరసి 32. శివశక్తి భేదముచే 64 అవుతున్నాయి.

సౌభాగ్య వర్ధని వ్యాఖ్యలో షట్చక్రాలలో ఉన్న రశ్మిలను వివరించటం జరిగింది.

**I. మూలాధారము, (పృథివీతత్త్వాత్మకము) 56 రశ్ములు :**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ఉడ్డీశ్వర | 2. | ఉడ్డీశ్వరి | 3. | జలేశ్వర | 4. | జలేశ్వరి |
| 5. | పూర్ణేశ్వర | 6. | పూర్ణేశ్వరి | 7. | కామేశ్వర | 8. | కామేశ్వరి |
| 9. | శ్రీకంఠ | 10. | గగనా | 11. | అనంత | 12. | స్వరసా |
| 13. | శంకర | 14. | మతి | 15. | పింగళ | 16. | పాతాద దేవి |
| 17. | నారదాఖ్య | 18. | నాదా | 19. | ఆనంద | 20. | హాకినీ |
| 21. | ఆలస్య | 22. | డాకినీ | 23. | మహానంది | 24. | లాకినీ |
| 25. | యోగ్య | 26. | లౌకినీ | 27. | అతీత | 28. | శాకినీ |
| 29. | పాదం | 30. | హాకినీ | 31. | ఆధారేశ | 32. | రక్త |
| 33. | చక్రేసి | 34. | చండా | 35. | కురంగేశ | 36. | కరాళా |
| 37. | మదద్రీశ | 38. | మహేచ్ఛుష్మా | 39. | అనాదివిమల | 40 | మాతంగీ |
| 41.. | సవర్ణావిమల | 42. | పులింద | 43. | యోగవిమల | 44. | శాంభరీ |
| 45. | సిద్ధవిమల | 46. | వాచాపరా | 47. | సమయవిమలా | 48. | కులాలికా |
| 49. | మిత్రేశ | 50. | కుబ్జా | 51. | ఉడ్డీశ | 52. | లక్ష్మీ |
| 53. | షష్ఠీశ | 54. | కులేశ్వరి | 55. | చర్యాధీశ | 56. | అజా |

ఇవి ఆధార చక్రంలోని నాలుగు దళాల యందు దళానికి ఏడుచొప్పున రెండు ఆవృత్తులుగా ఉంటాయి. "క్షితౌషట్ పంచాశత్" అనే దానికి ఇది వ్యాఖ్యానము.

**2 మణిపూరము, (జలతత్త్వాత్మకము) 52 రశ్మలు :**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1, | సద్యోజాత | 2. | మాయా | 3. | వామదేవ | 4. | శ్రీః |
| 5. | అఘోర | 6. | పద్మా | 7. | తత్పురుష | 8. | అంబికా |
| 9. | అనంత | 10. | నివృత్తి | 11. | అనాథ | 12. | ప్రతిష్ఠా |
| 13. | జనశ్రిత | 14. | విద్యా | 15. | అచింత్య | 16. | శాంతా |
| 17. | శశిరేఖ | 18. | ఉమా | 19. | తీవ్ర | 20. | గంగా |
| 21. | మణివాహ | 22. | సరస్వతీ | 23. | అంబువాహ | 24. | కమలా |
| 25. | తేజో ఽధీశ | 26. | పార్వతీ | 27. | విద్యావాగీశ్వర | 28. | చిత్రా |
| 29. | చతుర్విధేశ్వర | 30. | సుకమలా | 31. | ఉమాంగేశ్వర | 32. | మన్మథా |
| 33. | కృష్ణేశ్వర | 34. | క్రియా | 35. | శ్రీకంఠ | 36. | లయా |
| 37. | అనంత | 38. | సతీ | 39. | శంకర | 40. | రత్నమేఖలా |
| 41. | పింగళ | 42. | యశోవతీ | 43. | సాధ్యాఖ్య | 44. | హింసానంద |
| 45. | పరదివ్యేషు | 46. | వామా | 47. | మారదివ్యేషు | 48. | జ్యేష్ఠా |
| 49. | పీఠేషు | 50. | రౌద్రి | 51. | సర్వేశ్వర | 52. | సర్వమయీ |

ఈ రశ్మలు మణిపూరంలోని షడ్దళాలలోను వరుసగా 4,4,6, 4,5,3, చొప్పున రెండు ఆవృత్తులుగా ఉంటాయి. "ద్విశమధిక పంచాశ దుదకే" అనే దానికి వాఖ్య

**గమనిక :** స్వాధిష్ఠాన మణిపూరాలకు పేర్లు కొన్ని గ్రంథాలలో అటూ, ఇటూ మారుతున్నాయి. పాఠకులు గమనించగలరని మనవి :

**3) స్వాధిష్ఠానము (అగ్ని తత్త్వాత్మకము) రశ్మలు 62 :**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | పరాపర | 2. | చండీశ్వర | 3. | పరమ | 4. | చతుష్మతీ |
| 5. | తత్పర | 6. | గృహ్యకాళి | 7. | అపర | 8. | సంవర్తా |
| 9. | చిదానంద | 10. | నీలకుబ్జా | 11. | అఘోర | 12. | గంధా |
| 13. | సమరస | 14. | రసా | 15. | లలిత | 16. | స్మరా |
| 17. | స్వచ్ఛ | 18. | స్పర్శ | 19. | భూతేశ్వర | 20. | శబ్ద |

| | | | |
|---|---|---|---|
| 21. ఆనంద | 22. డాకిని | 23. ఆలస్య | 24. రత్న డాకిని |
| 25 ప్రభానంద | 26. చక్రఢాకిని | 27. యోగానంద | 28. పద్మడాకినీ |
| 29. అతీత | 30. కుబ్జడాకిని | 31. స్వాద | 32. ప్రచండ డాకిని |
| 33. యోగేశ్వర | 34. చండా | 35. పీఠేశ్వర | 36. కోశలా |
| 37. కులకోలేశ్వర | 38. పావని | 39. కుక్షీశ్వర | 40. సమయా |
| 41. శ్రీకంఠ | 42. కామా | 43. అనంత | 44. రేవతి |
| 45. శంకర | 46. జ్వాలా | 47. పింగళా | 48. కరాలా |
| 49. సదాఖ్య | 50. కుబ్జికా | 51. కాళరాత్రీ గురు | 52. పరా |
| 53. సిద్ధగురు | 54. శాంతాతీతా | 55. రత్నగురు | 56. శాంతా |
| 57. శివగురు | 58. విద్యా | 59. మేలగురు | 60. ప్రతిష్ఠా |
| 61. సమయగురు | 62. నివృత్తి | | |

ఇక్కడ పది దళాలున్నాయి. రశ్మిలు 9 దళాలలో 3 చొప్పున 9 × 3 = 27 పదవ దళమందు 4. ఈ రకంగా రెండు ఆవృత్తులుగా ఉంటాయి. "హుతాసే ద్వాషష్టి" అనే దానికి వ్యాఖ్య ఇది.

**4. అనాహతము (వాయుతత్వాత్మకము) రశ్మిలు 54 :**

| | | | |
|---|---|---|---|
| 1. ఖగేశ్వర | 2. భద్రా | 3. కూర్మ | 4. ఆధారా |
| 5. మేష | 6. కోశా | 7. మీనా | 8. మల్లికా |
| 9. జ్ఞానా | 10. విమలా | 11. మహానందా | 12 శర్వరి |
| 13. తీవ్ర | 14. లీలా | 15. ప్రియ | 16. కుముద |
| 17. కాళిక | 18. మేనకా | 19. డామర | 20. డాకినీ |
| 21. రామా | 22. రాకినీ | 23. లామర | 24. రాకినీ |
| 25. కామర | 26. కాకినీ | 27. సామర | 28. సాకినీ |
| 29. హామర | 30. హాకినీ | 31. ఆధారేశ | 32. రాక |
| 33. చక్రీశ | 34. బిందు | 35. కుకురా | 36. కులా |
| 37. మయశ్రీశ | 38. కుబ్జికా | 39. హృదీశ | 40. కామకల |
| 41. శిరస | 42. కులదీపికా | 43. శిఖేశ | 44. సర్వేశా |
| 45. వర్మా | 46. బహురూపా | 47. అస్త్రేశ | 48. మహత్తరీ |

| | | | |
|---|---|---|---|
| 49. పరగురు | 50. మంగళా | 51. పరాధిగురు | 52. కోశటి |
| 53. పూజ్యగురు | 54 రామా | | |

ఇక్కడ 12 దళాల్నుయి.

ఈ రశ్మలు 3, 6, 9 దళములందు మూడు చొప్పున, మిగిలిన 9 దళాలయందు రెండు చొప్పున, రెండు ఆ వృలుగా ఉంటాయి. "చతురధిక పంశాత్" అనే దానికి వ్యాఖ్య)

**5) విశుద్ధి చక్రము, (ఆకాశ తత్త్వాత్మకము) రశ్మలు : 72**

| | | | |
|---|---|---|---|
| 1. హృదయ | 2. కాలికి | 3. ధర | 4. కాంతా |
| 5. భోగ | 6. విశ్వా | 7. మయ | 8. యోగిని |
| 9. మహః | 10. బ్రహ్మసారా | 11. శన | 12. శబరీ |
| 13. ద్రవ | 14. కాళికా | 15. రస | 16. జుష్టచండాలీ |
| 17. మోహ | 18. అఘోరేశి | 19. మనోభయ | 20. హేలా |
| 21. కోక | 22. మహారక్తా | 23. జ్ఞానగుహ్యా | 24. కుబ్జికా |
| 25. స్వర | 26. డాకినీ | 27. జ్వలన | 28. శాకినీ |
| 29. మహాకుల | 30. లాకినీ | 31. మహోజ్వల | 32. కాకినీ |
| 33. తేజః | 34. శాకినీ | 35. మూర్ధా | 36. హాకినీ |
| 37. వాము | 38. ణఫఘ్ని | 39. కుల | 40. సింహ |
| 41. సంహార | 42. కులాంబికా | 43. విశ్వంభర | 44. కామా |
| 45. కోటిలా | 46. కూనమాతా | 47. గాలవ | 48. కంకాళీ |
| 49. వ్యోమ | 50. వ్యోమా | 51. శ్వసన | 52. నాదా |
| 53. ఖేచర | 54. మహాదేవీ | 55. బహుళ | 56. మహత్తరీ |
| 57. తాత | 58. కుండలినీ | 59. కులాతీత | 60. కులేశీ |
| 61. అజ | 62. ఈధికా | 63. శనంత | 64. దీపికా |
| 65. ఏష | 66. రోచికా | 67. శిఖ | 68. మెచికా |
| 69. పరమ | 70. పరా | 71. పర | 72. చిత్ |

ఇందులో 16 దళాలున్నాయి. వీటిలో మొదటి రెండు దళాలలోను, చివరి రెండు దళాలలోనూ మూడు మూడు చొప్పున 4 × 3 = 12, మిగిలిన 12 దళాలలోనూ రెండు రెండు చొప్పున 12 × 2 = 24. రెండు ఆవృత్తులుగా ఉంటాయి.

6. ఆజ్ఞా చక్రము (మనస్తత్త్వాత్మకము) రశ్మిలు 64 :

| | | | |
|---|---|---|---|
| 1. పట | 2. పరా | 3. భర | 4. భరా |
| 5. చిత్ | 6. చిత్పరా | 7. మహామాయా | 8. మహామాయాపరా |
| 9. సృష్టి | 10. సృష్టిపరా | 11. ఇచ్ఛా | 12. ఇచ్ఛాపరా |
| 13. స్థితి | 14. స్థితిపరా | 15. నిరోధ | 16. నిరోధపరా |
| 17. ముక్తి | 18. ముక్తిపరా | 19. జ్ఞాన | 20 జ్ఞాన పరా |
| 21. సత్య | 22. సతీపరా | 23. అసత్య | 24. అసతీపరా |
| 25. సదసత్ | 26. సదసత్పరా | 27. క్రియా | 28. క్రియాపరా |
| 29. ఆత్మ | 30. ఆత్మపరా | 31. ఇంద్రియాంశ్రయ | 32. ఇంద్రియా శ్రయపరా |
| 33. గోచర | 34. గోచర పరా | 35. లోకముఖ్య | 36. లోకముఖ్యపరా |
| 37. వేదవత్ | 38. వేదవత్పరా | 39. సంవిత్ | 40. సంవిత్పరా |
| 41. కుండలినీ | 42. కుండలినీపరా | 43. సౌషుమ్నా | 44. సౌషుమ్నాపరా |
| 45. ప్రణసూత్ర | 46. ప్రణసూత్రపరా | 47. స్యంధ | 48. స్యందపరా |
| 49. మాతృక | 50. మాతృకపరా | 51. స్వరోద్భవ | 52. స్వరోద్భవపరా |
| 53. వర్ణజ | 54. వర్ణజపరా | 55. శబ్దజ | 56. శబ్దజపరా |
| 57. వర్ణజ్ఞాత | 58. వర్ణజ్ఞాతపరా | 59. వర్గజ | 60. వర్గజపరా |
| 61. సంయోగ | 62. సంయోగపరా | 63. మంత్ర విగ్రహ | 64. మంత్ర విగ్రహ పరా |

ఆజ్ఞా చక్రంలో రెండు దళాలున్నాయి. ఇవి ఒక్కొక్క దానిలోనూ నాలుగు నాలుగు చొప్పున ఎనిమిది ఆవృత్తులుగా ఉంటాయి. "మనః చతుష్షి" అన్న దానికి ఇది వ్యాఖ్య.

ఈ కిరణములన్నింటి పైన దేవి యొక్క పాద యుగళమున్నది. అదే ఈ కిరణములకు ఆధారము.

**సర్వతత్త్వాత్మ తేజోబిరిద్ధం తవ పదాంబుజమ్ ।**
**ధ్యాయచ్ఛివవరారోహ సాక్షాత్తేజోమయే భవేత్ ॥**

ఈ కిరణములన్నిటిపైన, శిరోభాగమందు దేవిచరణ యుగమున్నది. అది ఆనంద రూపము, సాక్షాత్తు శివపదము అని మానసోల్లాసమునందు చెప్పబడింది.

కాలచక్రానికి 360 కిరణాలున్నాయి. పైన చెప్పిన విధంగా చాంద్రమానంలో తిథుల సంఖ్య సంవత్సరానికి 360, వృత్తము లేదా బిందువులో ఉండే డిగ్రీలు 360. అదే పరమేశ్వరి పాదాబ్జము నుండి వచ్చే కాంతి పుంజము, లేదా పరమేశ్వరి చుట్టూ ఉండే తేజో పుంజము. ఆ కాంతి పుంజమే 360 రోజులు గల కాలచక్రము. అదే సంవత్సరము.

**బిందువు :** సమయ మతానుసారము శ్రీచక్ర లేఖనంలో ముందుగా బిందువును ఉంచుతారు. దాని ఆధారంగానే మిగిలిన చక్రాలు గీయటం జరుగుతుంది. కాబట్టి శ్రీ చక్రంలోని బిందువే మిగిలిన అన్ని చక్రాలకూ ఆధారము. అదే పరమాత్మ స్వరూపము.

**ఋతమాత్మా పరంబ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః**
**కల్పితా వ్యవహారార్థం యస్య సంజ్ఞా మహాత్మనః ॥**

బ్రహ్మజ్ఞానులు ఈ బిందువును ఋతమని, ఆత్మ అని, పరబ్రహ్మ అని, సచ్చిదానంద స్వరూపము అని అంటారు. అసలు బిందువుకు నామరూపాలు లేవు. కాని దానిని గురించి చెప్పటానికి, కేవలం వ్యవహారం కోసమే ఈ విధంగా చెబుతారు. ఈ బిందువునే సుధాసింధువు, చంద్రలోకము, సహస్రారము అని కూడా అంటారు. ఈ బిందువు యొక్క తేజస్సు వల్లనే త్రికోణము పుట్టింది.

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. బిందురూపంలో ఉన్న అతడికి సృష్టి చెయ్యాలనే కోరిక కలిగి తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. ఈ సమయంలో బిందువు నుండి బయటకు వచ్చిన భాగమే విమర్శాంశ, శక్తి స్వరూపము. దీని వల్లనే చరాచరజగత్తు అంతా సృష్టించబడింది. ఈ రకంగా పూర్ణబిందువు నుండి కొంత భాగము బయటకు వచ్చినప్పుడు, ఆ బిందువు అసంపూర్ణంగా ఉంటుంది కదా ? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దానికి -

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥**

ఆ కనిపించని బిందువు అనంతమైనది. దాని నుండే అనంతమైన ఈ జగత్తు బహిర్గత మైంది. అయినప్పటికీ, అనంతం అనంతంగానే ఉంటుంది. బిందువు నుండి బయటికి వచ్చినది విమర్శాంశ. బిందువు ప్రకాశాంశ. జ్ఞాన స్వరూపం. విమర్శాంశ శక్తి స్వరూపము. పూర్ణబిందువు నుండి విమర్శాంశ బయటకు వచ్చినప్పటికీ బిందువు పూర్ణంగానే ఉంటుంది. ఈ రకంగా బిందువు నుండి బయటకు వచ్చిన శక్తి వల్లనే ఈ జగత్తు సృష్టించబడుతున్నది.

***మధ్యం చక్రస్య స్యాత్పరామయం బిందు తత్వమే వేదం ।***
***ఉచ్చూనం తచ్చ యదా త్రికోణ రూపేణ పరిణతం స్పష్టం ॥***

ఈ చక్రము మధ్య ఉన్న బిందువు పరాశక్తి స్వరూపము. ఆ బిందువే శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలకూ, మాతృకలకు, సర్వానికీ కారణమవుతున్నది.

అసలు పరబ్రహ్మకు రూపం లేదు. కాని మనం గుర్తించటం కోసమని దాన్ని బిందువు అంటున్నాము. నిరాకారమైన పరబ్రహ్మకు ఆరు అవయవాలున్నాయి. అవి.

1. సర్వజ్ఞశక్తి 2. అనాది బోధ 3. స్వతంత్రత
4. నిత్యత్వము 5. సంపూర్ణ శక్తి 6. అనంతత్వము

అందుకనే పరబ్రహ్మ ఆది, అనాది లేనివాడు, సర్వజ్ఞుడు, సర్వస్వతంత్రుడు, సంపూర్ణుడు నిత్యము సత్యమైనవాడు. అతడికి లింగ భేదం లేదు. అతడితో సమానమైన వారు కాని, అతడి కన్న అధికులు గాని ఎవరూలేరు. అటువంటి పరమాత్మ సృష్టికి ముందు బిందురూపంలో ఉండేవాడు. ఇదే ప్రకాశ బిందువు. సృష్టికి ఆది వస్తువు. సర్వ కారణము.

**త్రికోణము :** ఈ బిందువు నుండి బయటకు వచ్చిన భాగమే విమర్శశక్తి లేదా విమర్శాంశ. ఈ శక్తి మూడు రేఖలుగా అయి త్రికోణంగా ఏర్పడింది. ఇప్పుడు త్రికోణము శక్తి కాగా బిందువే పరమేశ్వరుడు.

***త్రికోణ రూపిణీ శక్తి: బిందు రూప పరశ్శివ: ॥***

ఈ రెండింటికీ భేదం లేదు. ఇవి ఎప్పుడూ కలిసే ఉంటాయి. శక్తికి ఆధారం బిందువు అందుచేతనే బిందువు త్రికోణంలోనే ఉంటుంది.

***"త్రికోణే బైందవంస్లిష్టం "***

ఈ బిందువు తేజోవంతమైన కాంతి పుంజము, కొన్ని వేలకోట్ల సూర్యచంద్రుల కాంతులతో ప్రకాశిస్తుంటుంది. ఆ కాంతి పుంజములోని కొన్ని (360) కిరణములను మాత్రమే సోమ సూర్యాగ్నులు గ్రహించ గలిగారు. వాటి వల్లనే చరాచరజగత్తు అంతా ప్రకాశిస్తున్నది. ఆ కాంతి పుంజము నుంచే విమర్శాంశ, శక్తి స్వరూపము అయిన త్రికోణము ఉద్భవించింది.

ప్రకాశ బిందువు, అకార స్వరూపము, చంద్రమండలము విమర్శ బిందువు, శక్తి స్వరూపము, అగ్ని మండలము దీని బీజం హకారము. వీరిద్దరి సామరస్యమే 'అహం' అనే

శబ్దము. ఇదే పరబ్రహ్మ స్వరూపము. శివశక్తుల సంయోగం లేనిదే ఈ సృష్టి జరగదు. అలాగే స్వరూపజ్ఞానం కూడా కలగదు. అందుచేతనే శివశక్తులనబడే కామేశ్వరీ కామేశ్వరుల వల్లనే ఈ జగత్తు సృష్టించబడుతోంది. **"కామకలావిలాసము"** లో చెప్పినట్లుగా

***స్ఫుటితాదరుణాద్బిందోర్నాద బ్రహ్మాందకురో రవో వ్యక్తః ।***
***తస్మా దగ్గన సమీరణ దహనోదక భూమి వర్ణ సంభూతిః ॥***

వికసనము పొందిన రక్తబిందువు వలన నాదబ్రహ్మమమే అంకురముగా గల శబ్దబ్రహ్మమము ఆవిర్భవించింది. దాని నుంచి పంచభూతాలు, యాభై అక్షరాలూ ఉత్పన్నమైనాయి.

| | | |
|---|---|---|
| రక్త బిందువు వలన | - | నాదము |
| నాదము నుంచి | - | శబ్దము |
| శబ్దము నుంచి | - | ఆకాశము |
| ఆకాశము నుంచి | - | వాయువు |
| వాయువు నుంచి | - | అగ్ని |
| అగ్ని నుంచి | - | జలము |
| జలము నుంచి | - | భూమి |

ఈ రకంగా పంచభూతాలు ఉద్భవించినాయి. అలాగే అ కారము శివస్వరూపము కాగా హ కారము శక్తి స్వరూపము. ఈ రెండు అక్షరములు చెప్పటం వలన, వీటి మధ్యన ఉన్న అక్షరములన్నీ చెప్పినట్లే. అందుచేత అ నుండి హ వరకు వర్ణములన్నీ ఉత్పత్తి అయినాయి. క్ష కారము క, ష ల మిశ్రమము.

***అథ విశదాదపి బిందోర్గగనానిలవహ్ని వారి భూమి జనిః ।***
***ఏతత్పంచక వికృతిర్జగదిద మణ్వాద్యజాండ పర్యంతమ్ ॥***

పైన చెప్పిన విధంగా శబ్దముత్పన్నమైన తరువాత నామ రూపాత్మక శాఖలు ఏర్పడ్డాయి.

**ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం పాహురవ్యయం**

అశ్వత్థవృక్షము మొదలు పైకి, దాని కొమ్మలు క్రిందికీ ఉంటాయి. ఇది పరబ్రహ్మ స్వరూపము. దీనిలో సకల లోకాలు ఇమిడి ఉన్నాయి. దీనితో సంబంధం లేని వస్తువు ఏదీ లేదు. ఇది నామరూపాత్మకమైన సృష్టిక్రమాన్ని బోధిస్తుంది.

ఈ జగత్తు అంతా నామరూపాత్మకమైనది. అందుచేతనే ఈ వృక్షానికి రెండు కొమ్మలున్నాయి. వృక్షానికి మూలము ప్రత్యగాత్మ. అదే పరమాత్మ. సహస్రారమందుంటాడు. ఇదే సృష్టికి మొదటి స్థానము. దీని నుంచి శుక్ల, రక్త, మిశ్రమ బిందువులతో కూడిన త్రికోణం ఏర్పడుతున్నది. ఇది అవ్యక్తము. మూల ప్రకృతి. మానవ శరీరంలో ఇది ఆజ్ఞా చక్రము. ఈ బిందువు వలన నామరూపాలనే రెండు శాఖలు ఏర్పడ్డాయి. త్రికోణము నుంచి నామశాఖ ఏర్పడింది. దాని నుండి అ కారాది స్వరములు, వాటి నుండి హల్లులు, పదాలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, ఏర్పడ్డాయి. అలాగే త్రికోణం నుంచి రెండవదైన రూపాత్మకశాఖ ఏర్పడింది. పరబ్రహ్మకు సృష్టి చెయ్యాలనే కోరిక కలిగినప్పుడు ఇచ్ఛాశక్తి ఆవిర్భవించింది, ఇది అవ్యక్తము.

| | | |
|---|---|---|
| అవ్యక్తము నుంచి | - | మహత్తత్త్వము |
| మహత్తత్త్వము నుంచి | - | అహంకారము |
| అహంకారము నుంచి | - | మనస్తత్త్వము |
| మనస్తత్త్వము నుంచి | - | ఆకాశము |
| ఆకాశము నుంచి | - | వాయువు |
| వాయువు నుంచి | - | అగ్ని |
| అగ్ని నుంచి | - | నీరు |
| నీటి నుంచి | - | భూమి |

ఏర్పడ్డాయి. పంచభూతాల ధర్మాలే తన్మాత్రలు. పంచభూతాల వల్లనే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఉద్భవించినాయి. ఈ రకంగా రూపాత్మకమైన శాఖ ఏర్పడింది.

బిందువు శివశక్తి సమ్మేళనము. అన్ని తత్త్వాలకూ అతీతము. ఈ తత్త్వాలే అంతటా వ్యాపించి పధ్నాలుగు లోకాలయినాయి. ఇక్కడ పైనున్న బిందువు శివుడు. అదే పరబ్రహ్మ స్వరూపము. ఇదే అన్నింటికీ కారణము కాగా చివరి బిందువు (క్షితి) కార్యమవుతున్నది. పైది బింబమైతే, చివరిది ప్రతిబింబము అందుకే పై బిందువు కన్న చివరిబిందువునకు శక్తి తగ్గుతుంది.

మానవ శరీరమే అశ్వత్థ వృక్షము. శరీరంలోని షట్చక్రాలకూ ఆధారము సహస్రారము.

| | | |
|---|---|---|
| సహస్రారము నుంచి | - | ఆజ్ఞా చక్రము |
| ఆజ్ఞా చక్రము నుంచి | - | విశుద్ధి చక్రము |
| విశుద్ధి చక్రము నుంచి | - | అనాహతము |

| | | |
|---|---|---|
| అనాహతము నుంచి | - | మణిపూరము |
| మణిపూరం నుంచి | - | స్వాధిష్ఠానము |
| స్వాధిష్ఠానము నుంచి | - | మూలాధార చక్రము. |

ఉద్భవించినాయి. ఈ షట్చక్రాలలో నామరూపాత్మకాలైన రెండు శాఖలూ ఉన్నాయి. ఇది రూపాత్మక శాఖ. ఇక్కడ ప్రతి చక్రంలో కొన్ని అక్షరాలుంటాయి. అవి.

| | | | |
|---|---|---|---|
| విశుద్ధి చక్రము | - | అ నుంచి అః వరకు | (16) |
| అనాహతము | - | క నుంచి ఠ వరకు | (12) |
| మణి పూరము | - | డ నుంచి ఫ వరకు | (10) |
| స్వాధిష్ఠానమ | - | బ నుంచి ల వరకు | (6) |
| ఆధార చక్రంలో | - | వ,శ,ష, స | (4) |
| ఆజ్ఞా చక్రంలో | - | హ కార, క్ష కారాలు | (2) ఏర్పడ్డాయి. |

ఈ రకంగా నామ రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఎప్పుడైతే నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడిందో, అప్పుడే శ్రీచక్రం ఆవిర్భవించింది.

బిందువు యొక్క తేజస్సు నుండి వచ్చిన మూడు రేఖలు త్రికోణంగా ఏర్పడ్డాయి. త్రికోణానికి మూడు వైపులా ప్రకాశ, విమర్శ, మిశ్రమ బిందువులున్నాయి. త్రికోణం మధ్యన ఉన్నది సంవిద్బిందువు. దీనికి మూడు వైపులా ఉన్న రేఖలు అవ్యక్తస్వరూపము, తేజోమయమైన మాతృకలు. అక్షరాలను మూడు భాగాలుగా, ఒక్కొక్క భాగానికి పదహారు చొప్పున విభజించగా

| | | | | |
|---|---|---|---|---|
| 1. | అ నుండి | అః వరకు | - | పదహారు (అచ్చులు) |
| 2. | క నుంచి | త వరకు | - | పదహారు (స్పర్శలు) |
| 3. | థ నుంచి | స వరకు | - | పదహారు (వ్యాపకాలు) |

ఈ అక్షరాలన్నీ త్రికోణంలోని మూడు రేఖల యందు ఉంటాయి. త్రికోణంలోని మూడు రేఖలూ పంచదశీ మహామంత్రంలోని వాగ్భవ కామరాజ శక్తి కూటములు త్రికోణంలోని ఉత్తర కోణంలో జాలంధర పీఠమున్నది. దానిలో శక్తి బీజాధిపతులైన ఉమామహేశ్వరులుంటారు.

త్రికోణంలోని దక్షిణ కోణంలో పూర్ణగిరి పీఠమున్నది. దానిలో కామరాజ బీజాధిపతులైన లక్ష్మీ నారాయణులుంటారు.

త్రికోణంలోని అగ్రకోణంలో కామగిరి పీఠమున్నది. దానిలో వాగ్భవ బీజాధిపతులైన వాణీ హిరణ్యగర్భులుంటారు.

త్రికోణం మధ్యన బిందు మండలమునందు ఓఢ్యాణ పీఠమున్నది. దాని యందు శివశక్తులు, లేదా పరమేశ్వరీ పరమేశ్వరులుంటారు.

ఈ విషయాన్ని వివరిస్తూ **లలితా సహస్రంలో**

***ఓఢ్యాణ పీఠ నిలయా బిందుమండలవాసినీ***

అని చెప్పటం జరిగింది. ఇక త్రికోణంలోని మూడు కోణములయందు

1. మండలత్రయము - సోమసూర్యాగ్ని మండలాలు
2. గుణత్రయము - సత్వరజస్తమో గుణాలు
3. బీజ త్రయము - వాగ్భవ కామరాజ శక్తి బీజాలు
4. శక్తి త్రయము - ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు
5. మూర్తిత్రయము - బ్రహ్మ విష్ణు మహేశ్వరులు
6. త్రిపుటి - జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాలు

ఉన్నాయి. ఈ రకంగా త్రికోణము ఏర్పడగా, దాని నుండి నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

**అష్టకోణము :**

***బైందవాసన సంరూఢ సంవర్తానల చిత్కలం ।***
***అంబికారూప మేవేద మష్టారస్థం స్వరావృతం ॥***

త్రికోణము మధ్య ఉండే బిందువు సంవిద్బిందువు. ఈ బిందువే సంవర్తానలము. అంటే ప్రళయాగ్నిని ఆసనముగా చేసుకున్నది. ఈ బిందువునందు ప్రళయాగ్ని ఉన్నది. ప్రళయ కాలంలో ప్రకాశ విమర్శాంశలు రెండూ కలిసి తురీయ బిందువుగా ఏర్పడ్డాయి. అందుచేత ప్రళయాగ్ని అనేది తురీయ బిందువులోని ప్రకాశాంశయే. ఆ తురీయ బిందువులోని విమర్శాంశమే చిత్కళ. త్రికోణము స్వరములచే చుట్టబడి ఉంటుంది. కాగా అష్టకోణము అష్టవర్గలచేత (అ క చ ట త ప య శ) చుట్టబడి ఉంటుంది. వాక్స్వరూపాలు నాలుగు. పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ, అష్టకోణము, మధ్యమా వాక్స్వరూపము గలది. అందుచేత

మాతృకలన్నీ అంటే అ నుంచి క్ష వరకూ అష్టకోణ మందున్నాయి. కాని ప ఫ బ భ మ, శ ష స అనే ఎనిమిది అక్షరాలూ ఎనిమిది కోణాల యందున్నాయనీ, త్రికోణం నుంచే అష్టకోణం పుట్టిందనీ కామకలావిలాసములో చెప్పబడింది.

**నవయోన్యాత్మకం చక్రం చిదానంద ఘనం మహత్ ।**
**చక్రం నవాత్మక మిదం నవధా భిన్నమంత్రకమ్ ॥**

నవయోని చక్రము చిదానందములచే ఘనమైనది. శ్రీచక్రాన్ని గీసేటప్పుడు ముందుగా బిందువు, త్రికోణము ఆ తరువాత అష్టకోణము గీస్తారు. అష్టకోణంలో ఎనిమిది, త్రికోణములో మూడు మొత్తం పదకొండు కోణాలుంటాయి. కాని శ్రీచక్రాన్ని గీసేటప్పుడు త్రికోణంలోని క్రింది వైపు రెండు కోణాలు అష్టకోణంలో కలిసిపోతాయి. అందుచేత అష్టకోణం గీసిన తరువాత లెక్కపెడితే పదకొండుకు బదులుగా తొమ్మిది కోణాలే ఉంటాయి. ఈ రకంగా బిందువు, త్రికోణము, అష్టకోణములతో ఉన్న చక్రాన్నే నవయోని చక్రము అంటారు. దీనిలోని తొమ్మిది కోణములందు అ క చ ట త ప య శ క్ష అను తొమ్మిది వర్గులు ఉంటాయి. దీనినే సంహార చక్రం అంటారు.

**అంతర్దశారము :** బిందు చక్రం నుంచి నవయోని చక్రం వచ్చింది. బిందువు యొక్క కాంతులు చిత్, అచిత్, కలా, అవిద్యా, రాగము, కాలము, నియతి వీటి రూపమే అంతర్దశారము. ఈ పదికోణములందు మ య ర ల వ శ ష స హ క్ష వర్ణాలు ఉంటాయని భాస్కరరాయలవారన్నారు. కాని ఇంకొక సంప్రదాయ ప్రకారము ఇక్కడ మ కారము ఉండదు. కాబట్టి య ర ల వ శ ష స హ ళ క్ష వర్ణాలుంటాయి. అమృతానందుల వారు కూడా దీనినే సమర్ధించారు.

**బహిర్దశారము :** పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు యొక్క ప్రకాశము సృష్టమైనది. పంచభూతాల, తన్మాత్రల ప్రకటిత రూపమే బహిర్ద శారము. సంహార చక్రము (నవయోని చక్రము) నుండి వెలువడ్డ తేజస్సు అప్రకటితముగా అంతర్దశారమందు, ప్రకటితముగా బహిర్దశారమందు ఉంటుంది. ఈ రకంగా దశారద్వయము నవయోని చక్రం నుంచే ఏర్పడింది. కామకలా విలాసములో దశార యుగ్మము గురించి 30వ సూత్రములో ఈ విధంగా ఉంది.

**తచ్ఛా యా ద్వితయ మిదం దశార చక్ర ద్వయాత్మనా వితతం ।**
**తటచక వర్ణ చతుష్టయ విలసన విస్పష్ట కోణ విస్తారమ్ ॥**

బిందువు నుండి త్రికోణము, దాని నుండి అష్టకోణము వచ్చినాయి కాగా ఈ మూడింటి తేజస్సు వల్ల దశార ద్వయము వచ్చింది. ఇందులో ట, త వర్గులు అంతర్దశారము నందు, క చ వర్గులు బహిర్దశారమందు ఉంటాయి.

**చతుర్దశారము :**

***చతుశ్చక్ర ప్రభారూప సంయుక్త పరిణామత: ।***
***చతుర్దశార రూపేణ సంవిత్తి కరణాత్మనా ॥***

బిందువు త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము అను నాలుగు చక్రముల యొక్క కాంతి పుంజములతో మన్వస్రము అనబడే చతుర్దశారము ఏర్పడింది. జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, అంతఃకరణ చతుష్టయము (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) మొత్తం పధ్నాలుగు ఇంద్రియాలతో చతుర్దశారము ఏర్పడింది.

అకారాది పధ్నాలుగు అక్షరాలు అచ్చులూ దీని పధ్నాలుగు కోణాలలో ఉంటాయి. త్రికోణంలో అంకురంగా ఉన్న వాక్కు ఇక్కడ స్పష్టవైఖరీ రూపం పొందుతుంది.

**అష్టదళ షోడశదళ పద్మాలు :**

***కాదిభి రష్టభి రుపచిత మష్టదళాబ్జం చ వైఖరీ వర్ణై: ।***
***స్వరగణ సముదిత మేతద్వష్ట దళాంభోరుహంచ సంచింత్యమ్ ॥***

అష్టదళము అష్టవర్గులచేత, షోడశదళము పదహారు స్వరములచేత కూడి ఉన్నది.

బిందువు నుంచి చతుర్దశారము వరకు ఉన్న చక్రాలన్నీ వాక్స్వరూపాలు. అంటే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపాలు. శ్రీచక్రంలోని కోణాలన్నీ విమర్శ రూపాలవుతున్నాయి. కాగా అష్టదళ, షోడశ దళాలు ప్రకాశాంశలు. వీటిలో అష్టదళమందు అ క చ ట త ప య శ వర్గులుండగా షోడశ దళంలో అ నుంచి అః వరకు స్వరాలుంటాయి.

**వృత్త భూపురాలు :**

***బిందుత్రయమయతేజ స్త్రితయ వికారస్థితాని వృత్తాని ।***
***భూబింబత్రయ మేత త్పశ్యంత్యాది త్రిమాతృ విశ్రాంతి ॥***

శ్రీచక్రమందున్న మూడు వృత్తాలూ రక్త, శుక్ల, మిశ్రమ బిందుమయమైన సోమ సూర్యాగ్నుల తేజస్సు వాక్స్వరూపమైన పశ్యంతీ, మధ్యమా, వైఖరీ శక్తుల స్వరూపమే భూపురత్రయము.

ఈ రకంగా సృష్టి ఎప్పుడైతే జరిగిందో, అప్పుడే శ్రీచక్ర ఆవిర్భావం కూడా జరిగింది.

**శ్రీచక్రము - షట్చక్రాలు :**

శ్రీచక్రము మానవ దేహంలోని షట్చక్రాలూ రెండూ ఒక్కటే. గౌడపాదాచార్యుల వారు తమ **సుభగోదయస్తుతిలో** ఈ విషయాన్ని వివరించారు.

**త్రికోణం చాధారం త్రిపురవినుతే ష్టారమనఘే**
**భవేత్స్వాధిష్ఠానమ్ పునరపి దశారం మణిపురమ్ ।**
**దశారంతే సంవిత్కమల మథ మన్వస్రకమమే ।**
**విశుద్ధం స్వాదాజ్ఞాశివ ఇతి తతో బైందవ గృహమ్ ॥**

1. ఆధార చక్రానికి - త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి - అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి - అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి - బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధి చక్రానికి - చతుర్దశ కోణంతో ఐక్యత
6. ఆజ్ఞా చక్రానికి - అష్టదళము, షోడశదళములతో ఐక్యత
7. సహస్రారానికి - బిందువుతో ఐక్యత

వాక్స్వరూపాలు గుర్తించటానికి గాను ఈ వివరణ ఇవ్వబడింది. వాక్కు నాలుగు రూపాలుగా ఉంటుంది. అవే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ.

పరావాక్కు బిందు స్థానమైన సహస్రారంలో ప్రారంభమవుతుంది. పశ్యంతీ వాక్కు ఆధార చక్రంలో ఉంటుంది. ఇది అవ్యక్తమైనది. ఆ తరువాత మధ్యమా వాక్కు. ఇది రెండు రకాలు 1) సూక్ష్మ మధ్యమ 2) స్థూల మధ్యమ. వీటిలో సూక్ష్మ మధ్యమ నవనాదములు గలది. స్థూల మధ్యమ నవవర్గులు గలది. ఈ స్థితిలో వాక్కుకు ఒక రూపు వస్తుంది. ఇది అనాహతంలో ఉంటుంది. అందుకే శ్రీచక్రంలోని దశారద్వయంలో మధ్యమా వాక్కు చెప్పబడింది. అక్కడి నుండి ఊర్ధ్వ ముఖ్యంగా బయలుదేరి విశుద్ధి చక్రం చేరుతుంది. విశుద్ధి చక్రంలోని పదహారు దళాలలోనూ అచ్చులు ఉంటాయి. స్పష్టంగా లేని ఈవాక్కు ఎప్పుడైతే విశుద్ధి చక్రంలోని అచ్చులతో కలిసిందో అప్పుడు స్పష్టవైఖరి అవుతుంది.

ఈ రకంగా శ్రీచక్రం ఆవిర్భవించింది. శ్రీచక్రంలోని వివిధ ఆవరణలే మానవ శరీరంలోని వివిధ భాగాలు. అలాగే బిందు స్వరూపుడైన పరమేశ్వరుని శరీరం నుంచి అనేక వేల కోట్ల కాంతి కిరణాలు వస్తున్నాయి. వాటిలో 360 మాత్రమే చంద్ర సూర్యాగ్నులు గ్రహించగలిగారు. ఆ 360 కిరణములే 360 రోజులు. సంవత్సరానికి ప్రతీక. అంటూ కృష్ణశర్మ అనుమానం నివృత్తి చేశాడు రత్నాకరుడు.



# 3. ఆవరణ దేవతలు

గురువరేణ్యా! పరమేశ్వరుడి నుండి వచ్చే కాంతి పుంజమే కాలచక్రము అన్నారు. అయితే బిందువునుంచే శ్రీచక్రంలోని వివిధ ఆవరణలు ఆవిర్భవించినాయి అని కూడా అన్నారు కదా. మరి ఆ ఆవరణలలో ఉండే దేవతలెవరు ?' అన్నాడు నారాయణభట్టు. ఆ మాట విన్న రత్నాకరుడు శ్రీచక్రంలోని వివిధ ఆవరణలను, వాటిలో ఉండే దేవతలను వివరించటం మొదలుపెట్టాడు.

శ్రీచక్రంలో శివచక్రాలు నాలుగు, శక్తి చక్రాలు ఐదు, వెరసి తొమ్మిది చక్రాలున్నాయి. వీటినే నవావరణలు అంటారు. అవి వరుసగా

| | | |
|---|---|---|
| 1. భూపురము | - | త్రైలోక్య మోహన చక్రము |
| 2. షోడశ దళము | - | సర్వాశా పరిపూరక చక్రము |
| 3. అష్టదళము | - | సర్వ సంక్షోభిణీ చక్రము |
| 4. చతుర్దశారము | - | సర్వ సౌభాగ్యదాయక చక్రము |
| 5. బహిర్దశారము | - | సర్వార్థ సాధక చక్రము |
| 6. అంతర్దశారము | - | సర్వ రక్షాకర చక్రము |
| 7. అష్టకోణము | - | సర్వ రోగహర చక్రము |
| 8. త్రికోణము | - | సర్వ సిద్ధిప్రద చక్రము |
| 9. బిందువు | - | సర్వానందమయ చక్రము |

ఈ తొమ్మిది చక్రాలు లేదా ఆవరణలలో విడివిడిగా దేవతలున్నారు. వారి వివరాలు. రత్నాయర్ని వ్రాసిన **ఆవరణ దేవతా స్తుతి**లోనూ వామకేశ్వరతంత్రంలోని **ఖడ్గమాల**లోనూ ఇవ్వబడ్డాయి.

**ప్రథమావరణ :** ఇది భూపురము. ఇందులో మూడు రేఖలుంటాయి. ఇవి భూలోక, భువర్లోక, సువర్లోకాలకు ప్రతీకలు .

**ప్రథమ రేఖలో ఆవరణ దేవతాస్తుతి :**

***గరిమాణం లఘిమానం వశిత్వ మీశత్వమణి మహిమానౌ***
***ప్రాకమ్యం భక్త్యాహం వందే ప్రాప్తించ సర్వకామార్థమ్***

**ఖడ్గమాల :**

అణిమాసిద్ధి, లఘిమాసిద్ధి, మహిమాసిద్ధి, ఈశిత్వసిద్ధి, వశిత్వసిద్ధి, ప్రాకామ్య సిద్ధి, భుక్తి సిద్ధి, ఇచ్ఛాసిద్ధి, ప్రాప్తిసిద్ధి, సర్వకామసిద్ధి.

ప్రథమ రేఖలో సిద్ధి దేవతలుంటారు. వారు

| | | | |
|---|---|---|---|
| 1. అణిమ | 2. లఘిమ | 3. మహిమ | 4. ఈశిత్వ |
| 5. వశిత్వ | 6. ప్రాకామ్య | 7. భుక్తి | 8. ఇచ్ఛా |
| 9. ప్రాప్తి | 10. సర్వకామ | | |

**ద్వితీయ రేఖలో దేవతలు ఆవరణ దేవతాస్తుతి :**

**బ్రాహ్మీ మాహేశ్వర్యా కౌమారీ వైష్ణవీ చ వారాహీ**
**ఇంద్రాణీ చాముండా లక్ష్మీః పాండూ ద్వితీయ భూగృహాః ॥**

**ఖడ్గమాల :**

బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ. మాహేంద్రీ, చాముండా, మహాలక్ష్మీ

ద్వితీయ రేఖలో అష్టమాతృకలుంటాయి. అవి.

| | | | |
|---|---|---|---|
| 1. బ్రాహ్మి | 2. మాహేశ్వరి | 3. కౌమారి | 4. వైష్ణవి |
| 5. వారాహి | 6. మాహేంద్రి | 7. చాముండా | 8. మహాలక్ష్మి |

**తృతీయ రేఖలో దేవతలు ఆవరణ దేవతాస్తుతిః**

**సంక్షోభద్రావణ కాకర్షణ కావేశ కోన్మదాదీంశ్చ ।**
**ఖేచరీ బీజ యోన్యాఖ్యాః స్మృతయశ్చ గృహే భజే ॥**

**ఖడ్గమాల :**

సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వవశంకరీ, సర్వోన్మాదినీ, సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోని, సర్వత్రిఖండే,

ఈ రేఖలో దశ ముద్రలు శక్తుల రూపంలో ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| 1. సర్వసంక్షోభిణీ | 2. సర్వవిద్రావిణీ | 3. సర్వాకర్షిణీ | 4. సర్వ వశంకరీ |
| 5. సర్వోన్మాదినీ | 6. సర్వమహాంకుశ | 7. సర్వ ఖేచరి | 8. సర్వబీజ |
| 9. సర్వయోని | 10. సర్వత్రిఖండ | | |

**ద్వితీయావరణ :** ఇది పదహారు దళాల పద్మము. చంద్రకళా స్వరూపము. ఇందులోని దేవతలు.

**ఆవరణ దేవతాస్తుతి :**

**కామాకర్షిణికా నిత్యా బుధ్యాకర్షిణికా కళా**
**అహంకారా కర్షిణికా నిత్యా శబ్దాకర్షిణ కాకళా**
**స్పర్శా కర్షిణి కానిత్యా రూపాకర్షిణి కాకళా**
**రసాకర్షిణి కానిత్యా గంధాకర్షిణి కాకళా**
**చిత్తాకర్షిణి కానిత్యా ధైర్యాకర్షిణి కాకళా**
**స్మృత్యాకర్షిణి కానిత్యా నామాకర్షిణి కాకళా**
**బీజాకర్షిణి కానిత్యా చాత్మాకర్షిణి కాకళా**
**అమృతాకర్షిణి కానిత్యా శరీరాకర్షిణి కాకళా**

**ఖడ్గమాల :**

కామాకర్షిణి, బుధ్యాకర్షిణి, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి, నామాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి, అమృతాకర్షిణీ, శరీరాకర్షిణి.

ఇక్కడ ఉండేవి ఆకర్షణ దేవతలు. అవి వరుసగా

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | కామాకర్షిణి | 2. | బుధ్యాకర్షిణి | 3. | అహంకారాకర్షిణి | 4. | శబ్దాకర్షిణి |
| 5. | స్పర్శాకర్షిణి | 6. | రూపాకర్షిణి | 7. | రసాకర్షిణి | 8. | గంధాకర్షిణి |
| 9. | చిత్తాకర్షిణి | 10. | ధైర్యాకర్షిణి | 11 | స్మృత్యాకర్షిణి | 12. | నామాకర్షిణి |
| 13. | బీజాకర్షిణి | 14. | ఆత్మాకర్షిణి | 15. | అమృతాకర్షిణి | 16. | శరీరాకర్షిణి |

**తృతీయావరణ :** ఇది అష్టదళము. అష్టమూర్త్యాత్యకము. ఇందులో ఉండే దేవతలు.

**ఆవరణ దేవతాస్తుతి :**

**అనంగ కుసుమా ఽనంగమేఖలాచ ద్వితీయకా**
**అనంగమదనా ఽనంగమ దనాతురయా సహ**
**అనంగరేఖా చానంగవేగానంగాంకుశాపిచ**
**అనంగ మాలినీ పాండూనాగవ్రతస్థితా ఇమాః**

**ఖడ్గమాల :** అనంగకుసుమే, అనంగమేఖలే, అనంగ మదనే, అనంగ మదనాతరే, అనంగరేఖే, అనంగవేగినీ, అనంగాంకుశే, అనంగ మాలినీ.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | అనంగకుసుమ | 2. | అనంగమేఖలా | 3. | అనంగమదనా | 4. | అనంగ మదనాతురా |
| 5. | అనంగ రేఖా | 6. | అనంగవేగినీ | 7. | అనంగాంకుశా | 8. | అనంగ మాలిని |

**చతుర్థావరణ :** ఇది చతుర్దశారము. పధ్నాలుగు కోణములు గల చక్రము. చతుర్దశ భువనాత్మకము. వీటిలో పధ్నాలుగు శక్తులుంటాయి. ఆ శక్తులు వరుసగా

**ఆవరణ దేవతాస్తుతి :**

***సర్వసంక్షోభిణీ శక్తి సర్వవిద్రావిణీ తథా***
***సర్వాకర్షిణీ శక్తి సర్వాహ్లాదినీతథా***
***సర్వ సమ్మోహినీ శక్తిశ్చ సర్వస్తంభిని కాతాథా***
***సర్వ జృంభిణీ శక్తిశ్చ సర్వవశంకరీతథా***
***సర్వరంజనీశక్తిశ్చ సర్వోన్మాదినికా తథా***
***సర్వార్థసాధికాశక్తిశ్చ సర్వ సంపత్తి పూరిణీ***
***సర్వమంత్రమయీ శక్తిశ్చ సర్వ ద్వంద్వక్షయంకరీ***

**ఖడ్గమాల :** సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వహాదినీ, సర్వ సమ్మోహినీ, సర్వస్తంభినీ, సర్వజృంబిణీ, సర్వవశంకరీ, సర్వరంజనీ, సర్వోన్మాదినీ, సర్వార్థసాధిక, సర్వసంపత్తి పూరిణి, సర్వమంత్రమయి, సర్వ ద్వంద్వక్షయంకరి.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | సర్వసంక్షోభిణీ | 2. | సర్వ విద్రావిణీ | 3. | సర్వాకర్షిణీ | 4. | సర్వాహ్లాదినీ |
| 5. | సర్వసమ్మోహినీ | 6. | సర్వస్తంభినీ | 7. | సర్వజృంభిణీ | 8. | సర్వవశంకరి |
| 9. | సర్వరంజని | 10. | సర్వోన్మాదిని | 11. | సర్వార్థసాధిక | 12. | సర్వసంపత్తిపూరిణి |
| 13. | సర్వమంత్రమయి | 14. | సర్వద్వంద్వక్షయంకరి | | | | |

**పంచమావరణ :** ఇది బహిర్దశారము. పదికోణములు గల చక్రము. ఈ కోణాలలో వరుసగా.

**ఆవరణదేవతాస్తుతి :**

సర్వసిద్ధి ప్రదాదేవీ సర్వ సంపత్ప్రదాతథా
సర్వ ప్రియంకరీదేవీ సర్వమంగళకారిణీ
సర్వకామప్రదాదేవీ సర్వదుఃఖ విమోచనీ
సర్వ మృత్యు ప్రశమనీ సర్వ విఘ్న నివారిణీ
సర్వాంగసుందరీ దేవీ సర్వసౌభాగ్య దాయినీ

**ఖడ్గమాల :** సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే, సర్వప్రియంకరీ, స్వమంగళకారిణీ, సర్వకామప్రదే, సర్వదుఃఖ విమోచనీ, సర్వమృత్యు ప్రశమనీ, సర్వ విఘ్ననివారిణీ, సర్వాంగ సుందరీ, సర్వ సౌభాగ్యదాయినీ ॥

1. సర్వసిద్ధిప్రదా 2. సర్వసంపత్ప్రదా 3. సర్వప్రియంకరీ 4. సర్వమంగళకారిణీ
5. సర్వ కామప్రదా 6. సర్వ దుఃఖ విమోచనీ 7. సర్వమృత్యుపశమనీ 8. సర్వవిఘ్ననివారిణీ
9. సర్వాంగ సుందరీ 10. సర్వ సౌభాగ్య దాయినీ.

**షష్ఠావరణ :** ఇది అంతర్ద శారం. పది కోణములు గల చక్రం. ఇందులో

**ఆవరణ దేవతా స్తుతి :**

సర్వజ్ఞా సర్వశక్తిశ్చ సర్వైశ్వర్యప్రదాయినీ
సర్వజ్ఞానమయీ దేవీ సర్వవ్యాధివినాశినీ
సర్వాధార స్వరూపాచ సర్వపాపహరా తథా
సర్వానందమయీ దేవీ సర్వరక్షాస్వరూపిణీ
సర్వేప్సితప్రదాహ్యేతా యోగిన్యోగర్భ సంజ్ఞాకా॥

**ఖడ్గమాల :** సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్య ప్రదాయినీ, సర్వజ్ఞానమయి, సర్వవ్యాధి వినాశిని, సర్వాధార స్వరూపే, సర్వపాపహరే, సర్వానందమయి, సర్వరక్షా స్వరూపిణీ, సర్వేప్సిత ఫలప్రదే.

1. సర్వజ్ఞ 2. సర్వశక్తి 3. సర్వైశ్వర్యప్రదాయిని 4. సర్వజ్ఞానమయి
5. సర్వవ్యాధి వినాశిని 6. సర్వాధారస్వరూపా 7. సర్వపాపహరా 8. సర్వనందమయీ
9. సర్వ రక్షాస్వరూపిణీ 10. సర్వేప్సిత ఫలప్రదా

**సప్తమావరణ :** ఇది అష్టకోణము

**ఆవరణ దేవతాస్తుతి :**

**వశినీ కామేశ్వర్యో మోదిన్విమలారుణా జయన్యశ్చ ।**
**సర్వేశీ కౌళీన్యశ్చేతాస్తు రహస్యయోగినీ దేవ్యః ॥**

**ఖడ్గమాల :** వశిని, కామేశ్వరి, మోదిని, విమలే, అరుణే జయని, సర్వేశ్వరి, కౌళిని

| | | | |
|---|---|---|---|
| 1. వశిని | 2. కామేశ్వరి | 3. మోదిని | 4. విమలా |
| 5. అరుణా | 6. జయనీ | 7. సర్వేశ్వరీ | 8. కౌళినీ |

**అష్టమావరణ :** ఇది త్రికోణము. సృష్టిస్థితి లయాలకు, సత్వరజస్తమో గుణాలకూ ప్రతీక.

**ఆవరణ దేవతాస్తుతి :**

**సర్వజనజంభనే షూన్వం దేఽఖిల జన విమోహనాధనః**
**పాశం వశీకృతికరం స్తంభన మంకుశ మపీహ లలితాయాః**
**కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలిన్యోఽపి పాయాస్తుః కోణత్రయ వాస్తవ్యా**

**ఖడ్గమాల :** బాణిని, చాపిని, పాశిని, అంకుశని, మహాకామేశ్వరి, మహావజ్రేశ్వరి, మహాభగమాలిని

ఈ ఆవరణలో ముందుగా దేవి ఆయుధములైన బాణము, చాపము, పాశము, అంకుశములను చెప్పిన తరువాత దేవతలను చెబుతారు. వారు 1) కామేశ్వరీ 2) వజ్రేశ్వరి 3) భగమాలినీ.

**నవమావరణ :** ఇది బిందువు. ఇక్కడ ఆ పరమేశ్వరి ఉంటుంది.

**ఖడ్గమాల : శ్రీ శ్రీ శ్రీ పరాభట్టారికే**

ఆవిడే లలితాపరా భట్టారిక

ఈ రకంగా తొమ్మిది ఆవరణలలోనూ వివిధ దేవతలుంటారు. అంటూ ముగించాడు రత్నాకరుడు.

# 4. పరమేశ్వరి రూపము

"శ్రీచక్రంలోని వివిధ ఆవరణలలోనూ వివిధ దేవతలున్నారు కదా! అసలు శ్రీచక్రానికి అధిదేవత ఎవరు ? శ్రీచక్రంలో ఉండే దేవత సాకార అయితే ఏ విధంగా ఉంటుంది ? ఆవిడ అసలుస్వరూపం ఏది ?" అన్నాడు కృష్ణ శర్మ. అతడి అనుమానం నివృత్తి చెయ్యటానికి ఉపక్రమించాడు రత్నాకరుడు.

అసలు పరమేశ్వరి రూపం ఏమిటి ? ఆవిడ ఏవిధంగా ఉంటుంది ? అని ఆలోచిస్తే..... సాధకులను రెండు రకాలుగా విభజించవచ్చు. 1) ఐహిక వాంఛాపరులు 2) మోక్షవాదులు వీరిలో మొదటి వారికి పరమేశ్వరి స్థూల రూపంతో కనిపిస్తుంది. దీన్నే సాకారము అంటారు. ఈ రూపంతో సాధకులకు అర్థకామాలను తీరుస్తుంది. రెండవ రకం వారికి పరమేశ్వరి నిరాకార, నిర్గుణస్వరూప, వారి దృష్టిలో చరాచరజగత్తే పరబ్రహ్మ. అదే పరమేశ్వరి విశ్వరూపము.

**సాకారము :**

సాధకుడు గనక పరమేశ్వరిని నియమనిష్టలతో అర్చించినట్లైతే దేవి సాక్షాత్కారం జరుగుతుంది. ఆ దేవి రూపం ఏ రకంగా ఉంటుంది ? అంటే చతుర్వ్యైక్య సంధానము చేసిన వారికి దేవి చతుర్భుజగానూ, షడ్వ్యైక్యాను సంధానము చేసిన వారికి దశభుజ గాను దర్శనమిస్తుంది. ఈ అనుసంధానాల మీద వివరణకు నేను వ్రాసిన **'శ్రీవిద్యా దర్పణము'** చూడండి.

కౌళాచారులకు భగవస్సాక్షాత్కారంతో పనిలేదు. వారికి కావలసినది కార్యసిద్ధి. వారు ఆధార స్వాధిష్ఠానాలను అనుసంధానం చేసి పరమేశ్వరి అర్చన చేస్తారు. ఇక సమయాచారులు మణిపూరం దగ్గర నుండి దేవిని ఆరాధిస్తారు. గౌడపాదులవారు చెప్పినట్లుగా

***సూర్యమండల మధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం***
***పాశాంకుశ ధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥***

సూర్యమండలము అంటే మణిపూరచక్రము. సమయాచారులు మణిపూరమందున్న పాశము అంకుశము, బాణము, చాపము (ధనుస్సు) ధరించిన దేవిని మాత్రమే పూజించాలి. ఈ రకంగా అర్చించినట్లైతే పరమేశ్వరి చతుర్భుజగా దర్శనమిస్తుంది. కాళిదాసు అనట్లుగా,

**చతుర్భుజే చంద్రకళా వతంసే ।**

**కుచోన్నతే కుంకుమరాగ శోణే**

**పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణహస్తే**

నాలుగు భుజములతో, పాశము, అంకుశము, ధనుర్బాణములు ధరించి దర్శనమిస్తుంది. సౌందర్యలహరిలో శంకర భగవత్పాదులవారు చెప్పినట్లుగా దర్శనమిస్తుంది.

**క్వణత్కాంచీదామా । కరికలభకుంభస్తవనతా**

**పరిక్షీణామధ్యే పరిణత శరశ్చంద్రవదనా ।**

**ధనుర్బాణాన్ పాశం సృణమపి దధానా కరతలై:**

పరమేశ్వరి చతుర్భుజ అన్నప్పుడు ఆమె చేతిలో బాణము, చాపము, పాశము, అంకుశము ఉంటాయనేది ప్రసిద్ధము లలితా సహస్రంలోకూడా

**రాగస్వరూపపాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్జ్వలా ।**

**మనోరూపేక్షు కోదండ, పంచతన్మాత్రసాయకా ।**

అనే చెప్పటం జరిగింది. వామకేశ్వర తంత్రంలో

**పాశాంకు శౌత దీయాతు, రాగద్వేషాత్మకౌస్మృతౌ**

**శబ్ద స్పర్శాదయో బాణా:, మనస్త స్యాభవద్ధను: ।**

అని చెప్పబడింది. ఆమె చేతిలో బాణము చాపము. పాశము అంకుశము ఉంటాయనేది ప్రసిద్ధము.

అయితే షడ్విధైక్య సంధానము గనక చేసినట్లైతే భగవతి దశభుజగా దర్శనమిస్తుందని గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలో అన్నారు.

**భవాని శ్రీహస్తై: ర్వహసి ఫణిపాశం సృణిమథో**

**ధను: పౌండ్రం పౌష్పం శరమథ జపస్రక్ శుకవమ్ ।**

**అథ ద్వాభ్యాం ముద్రా మభయ వరదానైక రపికే**

**క్వణద్వీణాం ద్వాభ్యా మురసి కరాభ్యాం చ భిభ్యషే ॥**

భగవతి సర్పరూపపాశము, అంకుశము, చాపము, పుష్పబాణము, జపమాల, శుకవరము, అభయ, వరదముద్రలు, మరి రెండు చేతులయందు వీణతో అలరారుతుంటుంది.

దేవికి ఎన్ని చేతులుంటాయి? అన్నప్పుడు చతుర్విధైక్య సంధానము చేసిన వారికి చతుర్భుజగా, షడ్విధైక్య సంధానము చేసిన వారికి దశభుజగా దర్శనమిస్తుంది. సాధకులు ఏ రకమైన అనుసంధానము చేసినా మాకు ఆమోదమే అని గౌడ పాదులు, శంకర భగవత్పాదులు, లొల్లాలక్ష్మీధరులు, భాస్కరాచార్యులు మన్నగువారన్నారు. దేవీభాగవతంలోని సప్తనుస్కందములోని 31వ అధ్యాయంలో ఈ విధంగా ఉంది.

దితికశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. మరుత్తులు పుట్టిన తరువాత ఇతడు జన్మించాడు. దేవతలను బాధించటమే ఇతడి ధ్యేయం. ఇతడి భార్య వరాంగి. వీరి కుమారుడు తారకాసురుడు. ఇతడు బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై, ఏం వరం కావాలో కోరుకోమన్నాడు. చావులేకుండా వరమియ్యమన్నాడు తారకాసురుడు. పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక మానదు. భూమి మీద జన్మించినదేదీ శాశ్వతం కాదు. అంతదాకా ఎందుకు ? నేనే శాశ్వతం కాదు. బ్రహ్మకల్పం పూర్తికాగానే నేనూ వెళ్ళిపోతాను అలాంటప్పుడు, నాకు లేనిది నీకెలా ఇవ్వగలను ? అందుచేతన ఇంకేదైనా వరంకోరుకో అన్నాడు బ్రహ్మ. ఆలోచించాడు రాక్షసుడు. ఈ సృష్టిలో ఉన్న దేనితోనూ కూడా తనకు మరణం సంభవించ కూడదు. అని వరం కోరితే? అనుకున్నదే తడవుగా అడిగేశాడు. తనతో సమానమైన బలం కలవాళ్ళు, బ్రహ్మయొక్క సృష్టిలో ఇంతవరకూ ఉన్నటువంటి వాళ్ళ వల్ల మరణం రాకుండా ఉండేట్టు అనుగ్రహించు విధాతా! అన్నాడు 'తథాస్తు' అన్నాడు. బ్రహ్మ తారకుడు.

ఈ రకంగా బ్రహ్మవరప్రసాది అయిన తారకాసురుడు లోకాలను బాధించటం మొదలుపెట్టాడు. తారకాసురుని బాధలు భరించలేక దేవతలంతా శ్రీమహావిష్ణువు దగ్గరకు పోయి మొరపెట్టుకున్నారు. దేవతల మొర ఆలకించిన విష్ణువు "ఓ దేవతలారా! తారకాసురుడు బ్రహ్మవరప్రసాది. అతణ్ణి నిర్జించటము ఎవరివల్లా కాదు. ఇప్పుడు ఆ పరమేశ్వరియే మిమ్మల్ని రక్షించగలదు. కాబట్టి మీరంతా హిమాలయలకు వెళ్ళి ఆమెను ప్రార్థించండి. మీతో పాటు నేను కూడా వస్తాను" అన్నాడు. విష్ణువుతో కలిసి దేవతలంతా హిమాలయాలకు చేరారు.

**అభవంశ్చసురాః సర్వే పునశ్చరణ కర్మిణః॥**
**అంబాయజ్ఞ విధానజ్ఞా అంబాయజ్ఞంచ చక్రిరే ।**
**తృతీయాది వ్రతన్యాశు చక్రుః సర్వే సురాన్నృపా ॥**

కేచిత్సమాధి నిష్ణాతాః కేచిన్నాద పరాయణాః ।
కేచిత్సూక్త పరాః కేచిన్నామ పారాయణోత్సుకాః ॥
మంత్ర పారాయణ పరాః కేచి చ్చాంద్రాధికారిణః ॥
అంతర్యాగ పరాః కేచి త్కేచిన్న్యాస పరాయణాః ॥
హృల్లేఖయా పరాశక్తేః పూజాం చక్రు రతంద్రితాః ।
ఇత్యేవం బహువర్షాణి కాలోఽగా జ్జనమేజయ॥
అకస్మాచ్చైత్రయాసీయ నవమ్యాం చ భృగోర్దినే ।
ప్రాదుర్బభూవ పురతస్తన్మహః శ్రుతి బోధితమ్ ॥

అక్కడ దేవతలంతా దేవీ మంత్ర పునశ్చరణ చెయ్యటం మొదలు పెట్టారు. విధి విధానము తెలిసినవారు అంబాయాగం చేస్తున్నారు. కొందరు తృతీయాది వ్రతము చేస్తున్నారు. మరికొందరు తపోసమాధిలో నిమగ్నమైనారు. కొందరు దేవీ నామ పారాయణ, ఇంకొందరు దేవీ సూక్త పఠనము చేస్తున్నారు. కొందరు నవార్ణవ మంత్ర జపం చేస్తున్నారు. మరికొందరు చాంద్రాయణ వ్రతం చేస్తున్నారు. కొందరు అంతర్యాగం చేస్తుండగా ఇంకొందరు న్యాసం చెబుతున్నారు. ఈ రకంగా దేవతలంతా నిశ్చలమైన భక్తితో పరాశక్తిని ధ్యానిస్తున్నారు. జనమేజయ మహారాజా। ఈ రకంగా అనేక సంవత్సరాలు గడిచిన తరువాత, ఒక రోజు చైత్ర శుద్ధ నవమి శుక్రవారం వేద సమ్మతమైన పరంజ్యోతి వారి ఎదుట ప్రత్యక్షమైంది.

చతుర్దిక్షు చతుర్వేదైమూర్తి మద్భిరభిష్టుతమ్ ।
కోటి సూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్ ॥
విద్యుత్కోటి సమానాభ మరుణం తత్పరం మహః ।
నైవచోర్ధ్వం నతిర్యక్చ నమధ్యే పరిజగ్రభత్ ॥
ఆద్యంతరహితం తత్తు నహస్తా ద్యంగ సంయుతమ్ ।
న చ స్త్రీ రూపమథవా నపుంరూప మథోభయమ్ ॥
దీప్యాపిధానం నేత్రాణాం తేషామాసీన్మహీపతే ।
పునశ్చధైర్య మాలంబ్య యావత్తే దదృశుః సురాః ॥

ఆ పరమేశ్వరి తేజము రూపుదార్చిన నాలుగు వేదములచే స్తుతించబడుతోంది. కోటి సూర్యకాంతులతో విరాజిల్లుతున్నది. కోటిచంద్రుల చల్లదనము కలిగి ఉన్నది. ఆ రూపము

కొన్ని కోట్ల మెరుపులు ఒకసారి వచ్చినట్లుగా తళుక్కున మెరుస్తోంది. అరుణారుణకాంతులు వెదజల్లుతున్నది. పైన, క్రింద, నడుమ, అడ్డము అనే తేడాలేకుండా కాంతులు ప్రసరింప చేస్తున్నది. దానికి ఆద్యంతాలు లేవు. కాళ్ళు చేతులు లేవు. స్త్రీ పురుష నపుంసక భేదాలు లేవు. ఆ తేజస్సు చూడలేక దేవతలంతా ఒక్క సారిగా కళ్ళు మూసుకున్నారు. కొంత సేపటికి ధైర్యం తెచ్చుకుని కళ్ళు తెరిచారు.

*తావత్త దేవ స్త్రీ రూపేణా భాద్దివ్యం మనోహరమ్ ।*
*అతీవ రమణీయాంగీం కుమారీం నవయవ్వనామ్ ॥*

*ఉద్యత్పీనకుచద్వంద్వ నిందితాంభోజ కుట్మలమ్ ।*
*రణత్కింకిణికాజాల శింజిన్మంజీర మేఖలామ్ ॥*

*కనకాంగద కేయూరగ్రైవేయక విభూషితమ్ ।*
*అనర్ఘ్యమణి సంభిన్న గల బంధ విరాజితామ్ ॥*

*తనుకేతక సంరాజ న్నీలభ్రమరకుంతలామ్ ।*
*నితంబ బింబ సుభగామ్ రోమరాజి విరాజితామ్ ॥*

*కర్పూర శకలోన్మిశ్ర తాంబూల పూరి తాననమ్ ।*
*కనత్కనక తాటంక విటంక వదనాం బుజామ్ ॥*

*అష్టమీచంద్ర బింబాభ లలాట మాయత భ్రువమ్ ।*
*రక్తారవింద నయనా మున్నసాం మధురా ధరామ్ ॥*

*కుందకుట్మలదంతాగ్రాం ముక్తాహార విరాజితామ్ ।*
*రత్న సంభిన్న మకుటా మింద్ర రేఖావతంసినీమ్ ॥*

*మల్లికామాలతీ మాలా కేశ పాశ విరాజితామ్ ।*
*కాశ్మీర బిందునిటలాం నేత్రత్రయ విలాసినీమ్ ॥*

*పాశాంకుశ వరాభీతి చతుర్బాహుం త్రిలోచనామ్ ।*
*రక్త వస్త్ర పరీధానామ్ దాడిమీ కుసుమప్రభామ్ ॥*

*సర్వశృంగార వేషాఢ్యాం సర్వదేవ నమస్కృతామ్ ।*
*సర్వాశాపరిపూరకాం సర్వమాతరం సర్వమోహినీమ్ ॥*

ప్రసాదాభిముఖీ మంబాం మందస్మిత ముఖాంబుజామ్ ।
అవ్యాజ కరుణామూర్తిం దదృశుః పురతః సురా ॥
దృష్ట్వా తాం కరుణామూర్తిం ప్రణేముః సకలాః సురాః

అంతలో ఆ దివ్యతేజోరాసి ఒక స్త్రీ రూపం దాల్చింది. ఆమె రమణీయాంగి, కుమారి, నవయవ్వనయై అలరారుతున్నది. కిణకిణమను కింకుణుల మంజులరావములు చేయు మంజీర మేఖలము గలిగి ఉన్నది. బంగారపు కేయూరములు గ్రైవేయములతో అలంకరించ బడినది. మెడలో మేలైన జాతి మణులతో కూర్చిన హారములు ధరించినది. తలలో ధరించిన కేతకీ మొదలైన పూలవాసనకు గండుతుమ్మెదలు ఝుంకారములు చేస్తున్నాయి. ఆమె కర్పూరపు తాంబూలము నములుచున్నది. అష్టమినాటి చంద్రుని వంటి ముఖము, వెడల్పైన కన్నుబొమ్మలు, ఎర్ర కమలములవంటి కనులు, ఎత్తైననాసిక, మధు రాధరములు గలది. ఆమె దంతముల చివరలు మల్లె మొగ్గలువలె ఉన్నాయి. మంచి ముత్యాల హారాలు, వజ్రాలు పొదిగిన కిరీటము ధరించింది. కేశపాశములు మల్లికా, మాలతీ కుసుమాల హారాలతో గుబాళిస్తున్నాయి. కస్తూరి తిలకము ధరించి ఉన్నది. మూడు కనులు గలది. ఎర్రని వస్త్రములు ధరించి దానిమ్మ పూలవలె ఎర్రని ప్రభలు విరజిమ్ముతున్నది. చేతుతులయందు పాశము, అంకుశము, వరద, అభయముద్రలు ధరించిన పరమేశ్వరి జగన్మోహనాకారముతో ప్రకాశిస్తున్నది.

ఆ దివ్యమంగళ విగ్రహాన్ని చూసి దేవతలంతా తరించారు. వారు ఆమెను పరిపరి విధాల కీర్తించారు.

దేవీ భాగవతంలోని పన్నెండవ స్కందములో మణిద్వీపాన్ని వర్ణిస్తూ మణిద్వీపము 18 ప్రాకారాలు కలిగి ఉంటుంది. దాని లోపల మహోజ్వల ప్రభలతో చింతామణి గృహం ప్రకాశిస్తుంటుంది. ఆ చింతామణి గృహంలో శక్తి తత్త్వాత్మకమైన పది మెట్ల వరుసతో దివ్యకాంతులతో ప్రకాశించే మంచమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దానికి పాదాలు కాగా సదాశివుడు దానిపై పలకగా ఉంటాడు. దానిపైన త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడుంటాడు. భువనేశ్వరియే తన లీలా విలాసార్థం రెండు రూపాలు ధరించింది. ఆ కామేశ్వరునికి

**వామాంకే సన్నిషణ్ణా స్యదేవీ శ్రీ భువనేశ్వరీ**
**నవరత్నగణాకీర్ణ కాంచీదామ విరాజితా ।**
**తప్తకాంచన సన్నద్ధ వైదూర్యాంగద భూషణా ॥**
**కనచ్ఛ్రీ చక్రతాటంక విటంక వదనాంబుజా ।**
**లలాటకాంతి విభవ విజితార్ధ సుధాకరా ॥**

ఎడమ వైపున నవరత్నములు పొదగబడిన మొలనూలుతోనూ, వైడూర్యములు పొదిగిన కంకణములతోనూ, శ్రీచక్రాకారముగల బంగారు తాటంకములతోనూ, దొండపండులాటి అధరము, కస్తూరికా తిలకములతో శోభిల్లుతున్న పరమేశ్వరి ఉంటుంది.

**వరపాశాంకుశాభీతి లసద్బాహు చతుష్టయా**

ఆమె నానాభరణములతోనూ విరాజిల్లుతూ ఉంటుంది. ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తులు ఆమెను సేవిస్తుంటారు. పాశము, అంకుశము, వరద అభయముద్రలతో ఆ దేవి చతుర్బాహువులతో, అందరికీ సౌభాగ్యమునిస్తుంటుంది. లజ్జ, తుష్టి, పుష్టి, కీర్తి, కాంతి, క్షమ, దయ, బుద్ధి, మేధ, స్మృతి, లక్ష్మి మొ॥వారు ఆమెను సేవిస్తుంటారు.

**జయా చ విజయా చైవా । హ్యజితా చాపరాజితా ॥**
**నిత్యావిలాసినీ దోగ్ర్గీ త్వఘోరా మంగళానవా ।**
**పీఠ శక్తయ ఏతాస్తు । సేవంతే యాం పరాంబికామ్ ॥**

జయ, విజయ, అజిత, అపరాజిత, నిత్య, విలాసినీ, దోగ్ధ్రీ, అఘోర, మంగళ అను తొమ్మిది మంది శక్తులు ఆ దేవిని సేవిస్తుంటాయి.

**యస్యాస్తు పార్శ్వ భాగేస్తు నిధీతౌ శంఖపద్మకౌ ।**
**నవరత్న మహానద్య స్తథావై కాంచన స్రవాః ।**

దేవికి ఇరు ప్రక్కలా శంఖ పద్మ నిధులుంటాయి. బంగారము, రత్నములతో కూడిన నదులు ప్రవహిస్తుంటాయి. అక్కడ నవరత్నాల రాసులుంటాయి.

ఈ విషయాలను పరిశీలించినట్లైతే పరమేశ్వరి సాకారమైనప్పుడు భక్తులకు వాంచితార్థ సిద్ధి కలుగుతుంది. సాకారమైన దేవికి నాలుగు లేదా పదిచేతులుంటాయి. ఆమె నానావిధాభరణములు ధరించి కోటి సూర్యప్రభలతో ప్రకాశిస్తుంటుంది. శంఖ, పద్మ

నిధులు అక్షయాలు. వాటి నుండి ఎంత ధనం తీసినా అవి తరిగిపోవు. అలాంటి నిధులతో దేవి సాధకుల కోర్కెలు తీరుస్తుంటుంది.

పరమేశ్వరి యొక్క అసలు స్వరూపం ఇదేనా అంటే ఇది కాదు. సృష్టి ఆరంభానికి ముందు బిందురూపుడుగా ఉన్న పరబ్రహ్మ సృష్టి చెయ్యాలనే సంకల్పంతో విమర్శ రూపిణి అయిన శక్తిని సృష్టించాడు. ఈ శక్తి పరమేశ్వరుడికి ప్రతిరూపం. ఆ ఇద్దరూ ఒక్కటే కాని వేరుకాదు. అందుచేతనే పరమేశ్వరి విరాడ్రూపము అని దేవీ భాగవతములో వర్ణించబడింది. విరాడ్రూపమే విశ్వరూపం. అంటే ఈ సువిశాల విశ్వము యొక్క రూపము. అదే దేవి స్వరూపము. అదే విశ్వరూపము.

**పరమేశ్వరి విశ్వరూపం :**

విశ్వరూపము అంటే విశ్వము యొక్క రూపము అని అర్థం. దేవీ భాగవతంలోని సప్తమ స్కంధములో పరమేశ్వరి విశ్వరూపాన్ని వివరించటం జరిగింది.

తారకాసురునిచే పీడితులైన దేవతలు విష్ణువు యొక్క సలహా మేరకు హిమాలయ ప్రాంతానికి వెళ్ళి అక్కడ ఆ పరమేశ్వరిని గురించి పరి పరి విధాల ప్రార్థించారు. ఆ దేవి సాకారంగా వారికి దర్శన మిచ్చింది. అప్పుడు హిమవంతుడు "ఓ పరమేశ్వరీ ! నీ యొక్క దివ్య స్వరూపాన్ని చూడాలి అనుకుంటున్నాము. కాబట్టి ఓ తల్లీ ! మా యందు దయ తలచి ఆ రూపాన్ని మాకు చూపవలసినది" అని కోరాడు. దేవతలంతా కూడా ఆ మాటలకు ఆమోదము తెలియ చేశారు. అంతట ఆ పరమేశ్వరి తన భక్తులకోరిక తీర్చటం కోసం వారికి తన విరాట్స్వరూపాన్ని చూపింది. ఆ రూపము ఏ విధంగా ఉన్నది అంటే -

***ద్యౌర్మస్తకం భవే ద్యస్య చంద్ర సూర్యౌచ చక్షుషీ ॥***
***దిశః శ్రోత్రో వచోవేదాః ప్రాణోవాయు ప్రకీర్తితః ।***
***విశ్వం హృదయ మిత్యాహుః పృథివీజఘనం స్మృతం॥***
***నభస్థలం నాభిసరో జ్యోతిశ్చక్రమురః స్థలం ।***
***మహర్లోకస్తు గ్రీవాస్యా జ్జనోలోకో ముఖం స్మృతం॥***
***తపోలోకో లలాటస్తు సత్యలోకాదధః స్థితః***
***ఇంద్రాదయో బాహవః స్యుశబ్దః శ్రోత్రం మహేశితుః ॥***

నాసత్య దస్రౌ నాసేస్తో గంధో ఘ్రాణం స్మృతో బధైః ।
ముఖమగ్నిః సమాఖ్యాతో దివారాత్రీ చ పక్ష్మణీ ॥
బ్రహ్మస్థానం భ్రూవిజృంభోఽస్యాపస్తాలుః ప్రకీర్తితా ।
రసాజిహ్వా సమాఖ్యాతా యామోః దంష్ట్రా ప్రకీర్తితా ॥
దంతాః స్నేహకలా యస్యహాసో మాయా ప్రకీర్తితా ।
స్వర్గ స్త్వపాంగ మోక్షః స్యాద్రీడోర్ధ్వోష్ఠా మ బేశితుః ॥
లోభస్యాదధరోష్ఠోఽస్యా ధర్మ మార్గస్తు పృష్ఠభూః ।
ప్రజాపతిశ్చ మేఢ్రం స్యా ధః స్రష్టా జగతీతలే ॥
కుక్షి సముద్రా గిరయోఽస్థీని దేవ్యా మహేశితుః ।
నద్యోనాడ్యః సమాఖ్యాతా వృక్షా కేశాః ప్రకీర్తితాః ॥
కౌమార యవ్వనజరావయోఽస్య గతిరుత్త మా ।
బలాహకాస్తు కేశాః స్యుః సంధ్యేతే వాసవీ విభో ॥

| | | |
|---|---|---|
| సత్యలోకము | - | శిరస్సు |
| సూర్యచంద్రులు | - | కనులు |
| దిక్కులు | - | చెవులు |
| వేదాలు | - | వాక్కు |
| వాయువు | - | ప్రాణము |
| ప్రపంచము | - | హృదయము |
| భూమి | - | కటి ప్రదేశము |
| ఆకాశము | - | నాభి |
| నక్షత్రగణము | - | రొమ్ము |
| మహర్లోకము | - | కంఠము |
| జనోలోకము | - | ముఖము |
| తపోలోకము | - | నుదురు |
| ఇంద్రాదులు | - | బాహువులు |
| అశ్వినులు | - | నాసికా రంధ్రాలు |

| | | |
|---|---|---|
| గంధం | - | నాసిక |
| రాత్రింపగళ్ళు | - | కను రెప్పలు |
| బ్రహ్మస్థానం | - | కనుబొమ్మలు |
| జలం | - | దవడలు |
| రసం | - | నాలుక |
| యముడు | - | దంష్ట్రలు |
| స్నేహం | - | దంతాలు |
| నవ్వు | - | మాయ |
| కడగంటి చూపు | - | సృష్టి |
| లజ్జ | - | పై పెదవి |
| లోభము | - | క్రింద పెదవి |
| సముద్రాలు | - | కడుపు |
| ధర్మము | - | వీపు |
| కొండలు | - | ఎముకలు |
| నదులు | - | నాడులు |
| చెట్లు | - | కేశాలు |
| చంద్రుడు | - | మనస్సు |
| రుద్రుడు | - | అంతఃకరణ |
| మేఘాలు | - | రోమాలు |
| విజ్ఞాన శక్తి | - | విష్ణువు |

ఈ రకంగా చరాచర జగత్తు అంతా తానే అయి దర్శనమిచ్చింది. దీన్ని బట్టి చూసినట్లైతే పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఆ దేవి అంతటా తానై ఉన్నది.

పై విషయాలను పరిశీలించినట్లైతే చరాచర జగత్తు అంతా పరమేశ్వరి రూపమే. ఆమె సర్వాంతర్యామి. పరమేశ్వరియే జగత్తు జగత్తే పరమేశ్వరి అని తెలుస్తున్నది అన్నాడు రత్నాకరుడు.



# 5. భావనోపనిషత్తు

"భావనోపనిషత్తులో 'మానవ దేహమే శ్రీచక్రము" అని, దేహంలోని వివిధ భాగాలే నవావరణలలోని దేవతలని విన్నాను. ఆ విషయం నాకు సవిస్తరంగా వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. ఆ మాటలు విన్న రత్నాకరుడు భావనోపనిసత్తును వివరించటం ప్రారంభించాడు.

**సాధకులు ముఖ్యంగా రెండు రకాలు :** 1) ఇహ లోకవాదులు 2) పరలోకవాదులు. ఇహ లోకంలో సుఖాలు కోరేవారు దేవి స్థూల రూపాన్ని అర్చిస్తారు. శాశ్వతసుఖం అంటే మోక్షం కోరేవారు పరమేశ్వరిని తమ యందే భావించి, అర్చిస్తారు. ఇదే అంతరారాధన అని ఉపనిషత్తులో చెప్పబడింది. దేవి స్వరూపాన్ని సాధకుడు తన శరీరంలో భావన చేస్తాడు కాబట్టి దీన్ని భావనోపనిషత్తు అన్నారు. దీనిలోని మొదటి పది సూత్రాలలోనూ మానవ దేహమే పరమేశ్వర స్వరూపమని చెప్పారు.

**పురుషార్థస్సాగరాః :**

సప్త సముద్రాలలో ఏడవది సుధా సముద్రము. శరీరంలోని ఏడు చక్రాలే, ఏడు సముద్రాలు.

| **చక్రాలు** | - | **సముద్రాలు** |
|---|---|---|
| ఆధార చక్రము | - | ఉప్పు సముద్రము |
| స్వాధిష్ఠానము | - | ఇక్షు సముద్రము |
| మణిపూరము | - | సురా సముద్రము |
| అనాహతము | - | సర్పి (నేయి) సముద్రము |
| విశుద్ధి చక్రము | - | దధి సముద్రము |
| ఆజ్ఞాచక్రము | - | జల సముద్రము |
| సహస్రారము | - | సుధా సింధువు |

**దేహోర్నవరత్న ద్వీపః**

మానవుని దేహమే నవరత్న ద్వీపము.

**త్వగాది సప్తధాతుభిరనేకై సంయుక్తాః సంకల్పాః కల్పతరువః**

త్వగాది సప్తధాతువులతో ఏర్పడిన ఈ శరీరంలోని సంకల్పాలే కల్పవృక్షసముదాయము.

**తేజః కల్పకోద్యానం**

శరీరంలోని జీవాత్మే పరమేశ్వరి. ఆమె నుంచి ప్రసరించే కాంతులు శరీరముంతా వ్యాపిస్తున్నాయి. ఆ కాంతులే కల్పకోద్యానము.

**రసనయా భావ్యమానా మధురామ్ల తిక్తకటు కషాయ లవణరసా షడృతవః**

నాలుకకు తెలిసే ఆరు రుచులే ఆరు ఋతువులు.

| **రుచులు** | | **రుతువులు** |
|---|---|---|
| 1. తీపి | - | వసంత ఋతువు |
| 2. ఉప్పు | - | గ్రీష్మ ఋతువు |
| 3. కారము | - | వర్ష ఋతువు |
| 4. పులుపు | - | శరదృతువు |
| 5. చేదు | - | హేమంత ఋతువు |
| 6. వగరు | - | శశిర ఋతువు |

**క్రియాశక్తి పీఠం కుండలినీ, జ్ఞానశక్తిర్గృహో, ఇచ్ఛాశక్తి ర్మహాత్రిపురసుందరీ**

మానవ శరీరంలోని

| | | |
|---|---|---|
| క్రియా శక్తి | - | పీఠము |
| జ్ఞాన శక్తి | - | మందిరము |
| ఇచ్ఛాశక్తి | - | పరమేశ్వరి రూపము (విశ్వరూపము) |

ఈ రకంగా మానవ శరీరమే పరమేశ్వరి రూపము. శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలున్నాయి. ఆ ఆవరణలలో వివిధ దేవతలున్నారు. వారందరూ మన శరీరంలోనే ఉన్నారు. అంటే మానవ శరీరమే శ్రీచక్రము అని చెప్పబడుతోంది.

**ప్రథమావరణ :**

**ప్రథమ రేఖ :**

**నియతి సహిత శృంగారాదయో నవరసా దణి మాదయః**

| **సాధకుని శరీరంలోని నవరసాలు** | | **ప్రథమ రేఖలోని దేవతలు** |
|---|---|---|
| 1. శృంగారము | - | అణిమాసిద్ధి |
| 2. హాస్యము | - | లఘిమాసిద్ధి |

3. కరుణ - గరిమాసిద్ధి
4. రౌద్రము - మహిమాసిద్ధి
5. వీరము - ఈశిత్వసిద్ధి
6. భయానకము - వశిత్వసిద్ధి
7. బీభత్సము - ప్రాకామ్యసిద్ధి
8. అద్భుతము - ప్రాప్తిసిద్ధి

**కామక్రోధ లోభ మోహ మద మాత్సర్య పుణ్యపాప మయీ బ్రాహ్మ్యాద్యష్ట శక్తయః**

| **మనోవికారాలు** | | **ద్వితీయ రేఖలో దేవతలు** |
|---|---|---|
| 1. కామము | - | బ్రాహ్మి |
| 2. క్రోధము | - | మహేశ్వరి |
| 3. లోభము | - | కౌమారి |
| 4. మోహము | - | వైష్ణవి |
| 5. మదము | - | వారాహి |
| 6. మాత్సర్యము | - | మాహేంద్రి |
| 7. పుణ్యము | - | చాముండా |
| 8. పాపము | - | మహాలక్ష్మి |

**తృతీయా రేఖ :**

**ఆధార నవకం ముద్రాశక్తయః**

| **సాధకుని శరీరంలో స్థానాలు** | | **తృతీయ రేఖలో దేవతలు** |
|---|---|---|
| 1. మూలాధారము | - | సర్వ సంక్షోభిణీ |
| 2. స్వాధిష్ఠానము | - | సర్వ విద్రావిణీ |
| 3. మణి పూరము | - | సర్వాకర్షిణీ |
| 4. అనాహతము | - | సర్వవశంకరీ |
| 5. విశుద్ధి చక్రము | - | సర్వోన్మాదినీ |
| 6. లంబికాగ్రము | - | సర్వమహాంకుశా |
| 7. ఆజ్ఞా చక్రము | - | సర్వఖేచరీ |
| 8. సహస్రారము | - | సర్వ బీజా |
| 9. ద్వాదశాంతము | - | సర్వయోనీ |

**ద్వితీయావరణ :**

పృధివ్యాపస్తేజోవాయ్వాకాశ శ్రోత్ర త్వక్ చక్షుర్జిహ్వా
ఘ్రాణ వాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశ శక్తయః

| పంచభూతాలు, ఇంద్రియాలు | | ద్వితీయ రేఖలోని దేవతలు |
|---|---|---|
| 1. పృథివి | - | కామాకర్షిణి |
| 2. జలము | - | బుద్ధ్యాకర్షిణి |
| 3. అగ్ని | - | అహంకారాకర్షిణి |
| 4. వాయువు | - | శబ్దాకర్షిణి |
| 5. ఆకాశము | - | స్పర్శాకర్షిణి |
| 6. చెవి | - | రూపాకర్షిణి |
| 7. చర్మము | - | రసాకర్షిణి |
| 8. కన్ను | - | గంధాకర్షిణి |
| 9. నాలుక | - | చిత్తాకర్షిణి |
| 10. ముక్కు | - | ధైర్యాకర్షిణీ |
| 11. వాక్కు | - | స్మృత్యాకర్షిణీ |
| 12. చేయి | - | నామాకర్షిణీ |
| 13. కాలు | - | బీజాకర్షిణీ |
| 14. గుదము | - | ఆత్మాకర్షిణీ |
| 15. ఉపస్థ | - | అమృతాకర్షిణీ |
| 16. మనస్సు | - | శరీరాకర్షిణీ |

**తృతీయావరణ :**

వచన దానాగమన విసర్గానంద హానో పాదానో పేక్షా
బుద్ధయోనంగ కుసుమాది శక్త యోష్టౌ

| ఇంద్రియా ధర్మాలు | | తృతీయావరణ దేవతలు |
|---|---|---|
| 1. వచనము | - | అనంగ కుసుమ |
| 2. దానము | - | అనంగ మేఖలా |

| | | |
|---|---|---|
| 3. గమనము | - | అనంగ మదనా |
| 4. విసర్గము (మలవిసర్జన) | - | అనంగ మదనాతురా |
| 5. సంభోగము | - | అనంగ రేఖా |
| 6. ప్రవృత్తి | - | అనంగ వేగినీ |
| 7. నివృత్తి | - | అనంగాంకుశా |
| 8. ఉపేక్ష | - | అనంగ మాలినీ |

**చతుర్థావరణ :**

**అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వనీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా, చేతి చతుర్దశనాడ్యః సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతాః**

| **శరీరంలోని నాడులు** | | **చతుర్థావరణలో దేవతలు** |
|---|---|---|
| 1. అలంబుసా | - | సర్వ సంక్షోభిణీ |
| 2. కుహూ | - | సర్వ విద్రావిణీ |
| 3. విశ్వోదరీ | - | సర్వాకర్షిణీ |
| 4. వరుణా | - | సర్వాహ్లాదినీ |
| 5. హస్తి జిహ్వా | - | సర్వసమ్మోహిని |
| 6. యశస్వతీ | - | సర్వ స్తంభిని |
| 7. అశ్వనీ | - | సర్వ జృంభిణీ |
| 8. గాంధారీ | - | సర్వ వశంకరీ |
| 9. పూషా | - | సర్వ రంజనీ |
| 10. శంఖినీ | - | సర్వోన్మాదినీ |
| 11. సరస్వతీ | - | సర్వార్థ సాధికా |
| 12. ఇడా | - | సర్వసంపత్తి పూరిణీ |
| 13. పింగళా | - | సర్వమంత్రమయి |
| 14. సుషుమ్నా | - | సర్వద్వంద్వ క్షయంకరీ |

**పంచమావరణ :**

*ప్రాణాపాన వ్యానో దాన సమాన నాగకూర్మ కృకర దేవ*
*దత్త ధనంజయా దశవాయువ: సర్వసిద్ధిప్రదాది దేవ్యోబహిర్దశారదేవతా:*

| శరీరంలోని వాయువులు | | పంచమావరణ దేవతలు |
|---|---|---|
| 1. ప్రాణ వాయువు | - | సర్వసిద్ధి ప్రదా |
| 2. అపాన వాయువు | - | సర్వ సంపత్ప్రదా |
| 3. వ్యాన వాయువు | - | సర్వ ప్రియంకరీ |
| 4. ఉదాన వాయువు | - | సర్వ మంగళకారిణీ |
| 5. సమాన వాయువు | - | సర్వకామప్రదా |
| 6. నాగ వాయువు | - | సర్వ దుఃఖ విమోచనీ |
| 7. కూర్మ వాయువు | - | సర్వ మృత్యు ప్రశమనీ |
| 8. కృకర వాయువు | - | సర్వ విఘ్న నివారిణీ |
| 9. దేవదత్తము | - | సర్వాంగ సుందరీ |
| 10. ధనుంజయము | - | సర్వ సౌభాగ్యదాయినీ |

**షష్ఠమావరణ :**

*ఏతాద్వాయుదశక సంసర్గో పాధి భేదేన రేచక పూరక*
*శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన*
*పంచవిధోస్తి మనుష్యాణాం మోహాకో దాహకోభక్ష్య*
*భోజ్య లేహ్యచోష్య ప్రేయాత్మకం చతుర్విధమన్నం పాచయం*
*త్యేతా: దశధనకలా సర్వజ్ఞత్వా ద్యంతర్దశార దేవతా:*

| దశవిధ వాయువుల గుణములు | | షష్ఠమావరణ దేవతలు |
|---|---|---|
| 1. రేచకము (ఊపిరి విడచుట) | - | సర్వజ్ఞ |
| 2. పూరకము (ఊపిరి పూరించుట) | - | సర్వశక్తి |
| 3. శోషకము (శోషిల్లుట) | - | సర్వైశ్వర్య ప్రదాయినీ |
| 4. దాహకము (దాహక గుణము) | - | సర్వ జ్ఞానమయి |
| 5. ప్లావకము (ప్లావక గుణము) | - | సర్వవ్యాధి నివారిణి |

6. భక్ష్యము (తిన దగినది) - సర్వాధార స్వరూపా
7. భోజ్యము (భుజింప దగినది) - సర్వ పాపహరా
8. లేహ్యము (నాకి భుజింప దగినది) - సర్వానందమయీ
9. చోష్యము (పీల్చ దగినది) - సర్వ రక్షా స్వరూపిణీ
10. పేయము (త్రాగ దగినది) - సర్వేప్సిత ఫలప్రదా

**సప్తమావరణ :**

***శీతోష్ణ సుఖదుఃఖేచ్ఛా సత్వరజస్తమోగుణా వశిన్యాది శక్త్యష్టాయో:***

| సాధకుని శరీరంలో గల లక్షణాలు | | సప్తమావరణ దేవతలు |
|---|---|---|
| 1. శీతము | - | వశినీ |
| 2. ఉష్ణము | - | కామేశ్వరీ |
| 3. సుఖము | - | మోదినీ |
| 4. దుఃఖము | - | విమలా |
| 5. ఇచ్ఛ | - | అరుణా |
| 6. సత్వ గుణము | - | జయనీ |
| 7. రజోగుణము | - | సర్వేశ్వరీ |
| 8. తమోగుణము | - | కౌళినీ |

**అష్టమావరణ :**

***శబ్ద స్పర్శ రూప రస గంధా: పంచతన్మాత్రా పంచ పుష్పబాణా:***

పరమేశ్వరి చేతిలో ఉన్న ఐదు పూలబాణాలూ శబ్ద స్పర్శ రూప రస గంధాలు, ఇవే పంచతన్మాత్రలు.

***మన ఇక్షుధను: వశ్యోబాణ: రాగ:పాశో ద్వేషాంకుశ:***

దేవిచేతిలో ఉన్న ఆయుధాలు సాధకునిలో గల రాగ ద్వేషాలు

| | | |
|---|---|---|
| చెరకు విల్లు | - | సాధకుని మనస్సు |
| బాణము | - | వశ్యత |
| పాశము | - | అనురాగము |
| అంకుశము | - | ద్వేషము |

**అవ్యక్త మహత్తత్త్వాహంకారాః కామేశ్వరీ వజ్రేశ్వరీ**
**భగమాలిన్యోంత స్త్రికోణ దేవతాః**

| | | | |
|---|---|---|---|
| త్రికోణంలో | అవ్యక్తము | - | కామేశ్వరి |
| | మహత్తత్త్వము | - | వజ్రేశ్వరి |
| | అహంకారము | - | భగమాలిని |

**పంచదశ తిథి రూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశ నిత్యా**

త్రికోణంలో మూడు రేఖలున్నాయి. ఆ రేఖల యందు వరుసగా ఒక్కొక్క రేఖకు ఐదు చొప్పున పదిహేను మంది నిత్యదేవతలు ఉంటారు. వీరు తిథుల స్వరూపాలు.

**నవమావరణ :**

**శ్రద్ధాను రూపాధీర్దేవతా తయోః కామేశ్వరీ సదానంద**
**ఘనాపూర్ణా స్వాత్మైకరూప దేవతా**

శ్రీ చక్రంలో తొమ్మిదవ ఆవరణ అయిన బిందువునందు కామేశ్వరీ కామేశ్వరులుంటారు. సాధకుడి శరీరంలోని ఆత్మ కామేశ్వరుడు, బుద్ధి కామేశ్వరి కాబట్టి సాధకుడి ఆత్మ, పరదేవతా రెండూ ఒక్కటే. ఏప్పుడైతే ఆత్మ పరమేశ్వర స్వరూపమయిందో అప్పుడు సాధకుడు పరబ్రహ్మ అవుతాడు. దీనినే బ్రహ్మైక్యానుసంధానమంటారు. ఇదే జీవన్ముక్తి. అంటూ భావనోపనిషత్తును వివరించాడు రత్నాకరుడు.



# 6. సప్త ద్వీపాలు

"స్వామీ ! పరమేశ్వరుని వల్లనే ఈ సృష్టి అంతా జరిగింది కదా ! సృష్టి ప్రారంభంలో ఒకటిగా ఉన్న భూమండలము ఏడు ఖండాలుగా ఎలా అయింది" అన్నాడు నారాయణ భట్టు. అది విన్న రత్నాకరుడు సప్త ద్వీపాల ఆవిర్భావం గురించి వివరించటం మొదలు పెట్టాడు.

మనువులలో మొదటివాడు స్వాయంభువ మనువు. ప్రజాపతి సలహా మీద పరమేశ్వరి గురించి తపస్సు చేసి తాను కూడా ప్రజాపతి అయ్యేటట్లుగా వరం పొంది తండ్రి దగ్గరకు వచ్చి "తండ్రీ ! ఏకాంత ప్రదేశం చూపిస్తే అక్కడ కూర్చుని సృష్టి చేస్తాను" అన్నాడు. అంతకు పూర్వమే హిరణ్యాక్షుడు భూమిని చాపలాచుట్టి సముద్రంలో పారేశాడు. అందుచేత స్వాయంభువు సృష్టి చెయ్యటానికి చోటులేదు. అప్పుడు ఆదివరాహము ఆవిర్భవించి, హిరణ్యాక్షుణ్ణి సంహరించి భూమిని రక్షించింది. ఈ రకంగా భూగోళము కనిపించగానే స్వాయంభువు తండ్రి ఆజ్ఞతో సృష్టి ప్రారంభించాడు. ఇతనికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను ఇద్దరు కుమారులు ఆహూతి, దేహహూతి, ప్రసూతి అను ముగ్గురు కుమార్తెలు కలిగారు.

| | | |
|---|---|---|
| ఆహూతిని | - | ఋచికి |
| దేవహూతిని | - | కర్దమునికి |
| ప్రసూతిని | - | దక్షునకు |

ఇచ్చి వివాహం చేశాడు స్వాయంభువు. ఈ రకంగా స్వాయంభువు సంతానం వల్లనే జగత్తులోని భూతములన్నీ ఉద్భవించినాయి.

స్వాయంభువు పెద్ద కుమారుడు ప్రియవ్రతుడు తండ్రి తరువాత లోక రక్షణ బాధ్యతను స్వీకరించాడు. ప్రియవ్రతుడు రాజ్యం చేస్తున్న కాలంలో ఒకరోజు అతడు ఈ రకంగా ఆలోచించాడు. "భూమి మీద ఎప్పుడూ అర్థ భాగమే సూర్యకాంతులతో నిండి ఉంటుంది. మిగిలిన భాగము చీకటిగా ఉంటుంది. నేను రాజ్యం చేస్తుండగా, నా పాలనలో ఈ తేడాలేమిటి ? నా యోగబలంతోభూమి మీద చీకట్లను తొలగిస్తాను." అని తలపోసినవాడై సూర్య ప్రభలు చిందించే దివ్య రథమొకటి నిర్మించి, ఏడుసార్లు భూమిమీద అటుఇటు తిరిగి భూమిని రాపాడించేశాడు. ఆ రథ చక్రముల ధాటికి భూమి ఏడుముక్కలుగా అయిపోయింది.

ఈ ముక్కల మధ్య నీళ్ళు చేరాయి. ఈ రకంగా అయిన ఏడుముక్కలే ఏడు ద్వీపాలు. వాటి మధ్య చేరిన నీరే సప్త సముద్రాలు. సప్త ద్వీపాల వివరాలు :

1. జంబూ ద్వీపము
2. ప్లక్ష ద్వీపము
3. కుశ ద్వీపము
4. క్రౌంచ ద్వీపము
5. శాక ద్వీపము
6. శాల్మలీ ద్వీపము
7. పుష్కర ద్వీపము

ఈ సప్త ద్వీపాలే ప్రస్తుతం ఉన్న ఆసియా, ఐరోపా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, అంటార్కిటికా అనబడే ఏడు ఖండాలు.

ప్రస్తుతం మనం నివసిస్తున్న ఆసియా ఖండమే జంబూ ద్వీపము. అలాగే ఉత్తర దక్షిణ ధృవాల మధ్య మేరు పర్వతం ఉన్నది. ఇది బంగారు పర్వతం. ప్రస్తుతం ఇది దక్షిణాఫ్రికాలో ఉన్నది. ఈ పర్వతాన్ని ఇరుసుగా చేసుకుని సూర్యుడు దానివి చుట్టూ తిరుగుతుంటాడు. సూర్యుడికి ఉదయా స్తమయాలు లేవు. అతడు తూర్పు దిక్కున బయలు దేరి మధ్యాహ్నం 12. గం॥కు దక్షిణ దిక్కుకు, సాయంత్రం 6 గం॥కు పడమర దిక్కుకు, రాత్రి 12 గం॥కు ఉత్తరానికి, మళ్ళీ ఉదయం 6 గం॥కు తూర్పుకు వస్తాడు. కాబట్టి రోజులో సగ భాగమే పగలు ఉంటుంది. అతడు కనిపించినప్పుడే సూర్యోదయం, కనుపించక పోవటమే సూర్యాస్తమయం. ఈ రకంగా రాత్రీ పగలూ ఏర్పడుతున్నాయి. ఈ కథ దేవీ భాగవతంలోని ఎనిమిదవ స్కంధములోని నాల్గవ అధ్యాయంలో ఉంది.

పై విషయాలను పరిశీలించినట్లైతే పూర్వకాలంలో భూమి అంతా ఒకటిగానే ఉండేది. ప్రియవ్రతుడు తన రథంతో భూమిని ఏడు సార్లు రపాడించటం వల్ల అది ఏడు ముక్కలైపోయింది. ఆ ముక్కలే ఏడు ద్వీపాలు. అవే ఏడు ఖండాలు. మేరు పర్వతాన్ని ఆధారంగా చేసుకుని సూర్యుడు ఆ పర్వతం చుట్టూ తిరుగుతుంటాడు. అతడికి ఉదయాస్తమయాలు లేవు. అతడు కనిపించనప్పుడు సూర్యోదయము, కనిపించకుండా పోయినప్పుడు సూర్యాస్తమయము. ఆసియా ఖండమే జంబూ ద్వీపము, మేరు పర్వతం దక్షిణాఫ్రికాలో ఉన్నది.

సప్త ద్వీపాలే ప్రస్తుతం ప్రపంచంలో ఉన్న సప్త ఖండాలు అని వివరించాడు రత్నాకరుడు.



# 7. తత్త్వాలు

"శ్రీచక్రంలో చరా చర జగత్తే కాదు విశ్వమానవాళి అంతా ఇమిడి ఉన్నది అని విన్నాం. అది ఏ రకంగా ఉన్నదో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. శిష్యుడి సందేహం నివృత్తి చెయ్యటానికి సిద్ధమయ్యాడు రత్నాకరుడు.

తత్త్వము అంటే స్వరూపము, స్వభావము, నిజస్థితి, యదార్థము అని అర్థము. శ్రీచక్రం సామాన్యమైంది కాదు. చరాచరజగత్తును సృష్టించటానికి అవసరమైన వస్తువుల స్వభావాలు అన్నీ శ్రీచక్రంలో ఉన్నాయి. అందుకనే అది చరాచర జగత్తుకూ ప్రతీక. అసలు తత్త్వాలు 96 అనీ, 51 అనీ 36 అనీ రకరకాలుగా చెప్పటం జరిగింది. అయితే శివాదిక్షితి పర్యంతము తత్త్వాలు 36 అనేది ఎక్కువ మంది విశ్వాసము.

**తత్త్వాని శివశ్శక్తిశ్చ సదాశివ మహేశ్వరౌ ॥**
**విద్యేతి పంచశుద్ధాని శుద్ధాశుద్ధాని సప్తచ ।**
**మాయాకలా విద్యారాగః కాలో నియతి రేవచ ॥**

**పురుషశ్చాధా శుద్ధాని ప్రకృతిర్బుద్ధ్యహంకృతీ ।**
**మనశ్చేంద్రియదశకం తన్మాత్ర భూతపంచకం ॥**

ఈ తత్త్వాలు కొన్ని, కొన్ని తత్త్వాలలో కలిపోతున్నాయి. అందుచేత తత్త్వముల సంఖ్య 25 అవుతుంది. అప్పుడు

| | | |
|---|---|---|
| పంచభూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| మనస్సు | - | 1 |
| మాయ, శుద్ధ విద్య | | |
| మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| మొత్తం తత్త్వాలు | | 25 |

ఇదే విషయాన్ని గౌడ పాదులవారు తమ సుభగోదయ స్తుతిలో

పృధివ్యాపస్తేజః పవనగగనే తత్ప్రకృతయః

స్థితా స్తన్మాత్రాస్తా విషయదశకం మానస మితి ।

తతో మాయా విద్యా తదనుచ మహేశ శ్శివ ఇతి

పరం తత్త్వాతీతం మిలిత వపురిందో పరకళా ॥

ఈ తత్త్వాలకు అతీతమైనది 26వ తత్త్వము. అదే పరాకళ.

ఈ ఇరవై ఐదు తత్త్వాల చేతనే సృష్టి జరుగుతోంది. భైరవయామళంలో పరమేశ్వరుడు పరమేశ్వరికి శ్రీచక్రాన్ని వివరిస్తున్నాడు.

శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ ॥

పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవచ ॥

ఇంద్రియాత్మక మేవంచ మనస్త త్త్వాత్మకం తథా ॥

మాయాది తత్త్వరూపంచ తత్త్వాతీతంచ బైందవమ్ ॥

బైందవే జగదుత్పత్తి స్థితి సంహారకారిణీమ్ ॥

సదాశివేన సంపృక్తా తత్త్వా తీతా మహేశ్వరీ ।

ఓ త్రిపురసుందరీ ! శ్రీచక్రము బ్రహ్మాండానికి అంటే చరాచర జగత్తుకూ ప్రతీక. ఇందులో సృష్టికి అవసరమైన పంచభూతాలు, తన్మాత్రలు, దశేంద్రియాలు, మనస్సు, మాయాది తత్త్వాలు నాలుగు, వెరసి ఇరవైఐదు తత్త్వాలుంటాయి. ఈ తత్త్వాలన్నింటికీ అతీతమై బిందువునందు సృష్టిస్థితిలయకారణి అయిన పరమేశ్వరి పరమశివునితో కలిసి ఉంటుంది.

ఈ విషయాన్ని నిశితంగా పరిశీలించినట్లైతే ఈ క్రింది విషయాలు తెలుస్తాయి.

1. శ్రీ చక్రంలో జగత్తును సృష్టించటానికి అవసరమైన తత్త్వములన్నీ ఉన్నాయి. ఆ తత్త్వములే జగత్తు యొక్క స్వరూపం.
2. అందుకనే శ్రీచక్రము చరాచర జగత్తుకూ ప్రతీక.
3. శ్రీచక్రంలో ఉండే పరమేశ్వరి సర్వ తత్త్వాలకూ అతీతమైనది. సృష్టి స్థితిలయకారిణి అయిన ఆమె బిందువునందు ఉంటుంది.

**మానవ దేహము :** పరదేవతారూపమైన శ్రీచక్రము మానవదేహమే. మానవదేహము నవరంధ్రములతో కూడి ఉన్నది. కాగా శ్రీచక్రంలో నవావరణలున్నాయి. మానవ దేహము నవధాతువులతో నిర్మించబడింది. శ్రీచక్రం నవయోని సమన్వితమైనది. ఈ రకంగా చూసినట్లైతే శ్రీచక్రానికీ, మానవదేహానికీ పోలికలున్నాయి. అంతే కాకుండా శ్రీచక్రంలోని నవావరణలూ మానవదేహంలోని వివిధాంగాలతో పోల్చబడ్డాయి.

**బైందవమ్ బ్రహ్మరంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్ ।**
**లలాటే ష్టారపత్రంచ భ్రువోర్మధ్యే దశారకమ్ ।**
**బహిర్దశారం కంఠేతు మన్వశ్రం హృదయం భవేత్ ॥**
**నాభౌచ వసుపత్రంచ కట్యాం షోడశపత్రకమ్ ।**
**వృత్తత్రయంచ ఊరుభ్యాం పద్భ్యాం భూపురత్రయమ్ ॥**

| | | |
|---|---|---|
| బిందువు | - | బ్రహ్మరంధ్రము |
| త్రికోణము | - | తల ముందుభాగము |
| అష్టకోణము | - | లలాటము |
| భ్రూమధ్య భాగము | - | అంతర్దశారము |
| కంఠము | - | బహిర్దశారము |
| హృదయము | - | చతుర్దశారము |
| నాభి | - | అష్ట దళము |
| కటి | - | షోడశ దళము |
| ఊరువులు | - | వృత్త త్రయము |
| పాదములు | - | భూపురత్రయము |

శ్రీవిద్యలో సంప్రదాయ భేదాలున్నాయి. ఇవన్నీ తంత్రాలలో ఉన్న భేదాలే. కొన్ని తంత్రాలలో

**శ్రీచక్రం బ్రహ్మరంధ్రేతు సువృత్తంచ త్రికోణకమ్ ।**
**లలాటే అష్టారకం చక్రం భ్ర్యువోర్మధ్యే దశారకమ్ ।**
**బహిర్దశారం కంఠేతు మన్వస్రం హృదయం భవేత్**
**కుక్షౌతు ప్రథమవృత్తం, నాభ్యా మష్టదళాంబుజమ్ ।**

కట్యాం ద్వితీయం వలయం స్వాధిష్ఠానే కలాస్రకమ్ ।
తస్యా ధస్తాత్ తృతీయం మూలాధారే చతురస్రకం
ద్వితీయం భూపురం జంఘే తృతీయం వామజంఘకే
త్రిపురే శ్రీమహాయంత్రం సృష్టిన్యాస విధి క్రమాత్ ।

| | | |
|---|---|---|
| బిందువు, త్రికోణము | - | బ్రహ్మరంధ్రము |
| అష్టకోణము | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూమధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్దశారము | - | హృదయము |
| ప్రథమవృత్తము | - | కుక్షి |
| అష్టదళము | - | నాభి |
| ద్వితీయ వృత్తము | - | కటి ప్రదేశము |
| షోడశ దళము | - | స్వాధిష్ఠానము |
| తృతీయ వృత్తము | - | స్వాధిష్ఠానము క్రింది భాగము |
| భూపురంలో ప్రథమరేఖ | - | మూలాధారము |
| ద్వితీయ రేఖ | - | కుడి పిక్క |
| తృతీయ రేఖ | - | ఎడమ పిక్క |

ఈ రకంగా శ్రీచక్రం అంతా కూడా మానవ దేహంలోని వివిధ భాగాలతో సమన్వయ పరచబడినాయి. ఈ విషయాలు గనక పరిశీలించినట్టైతే, ఈ క్రింది విషయాలు తెలుస్తాయి.

1. శ్రీచక్రంలో నవావరణలున్నాయి, మానవ దేహంలో నవరంధ్రాలున్నాయి.
2. శ్రీచక్రంలో నవయోనులున్నాయి, మానవ దేహంలో నవధాతువులున్నాయి.
3. శ్రీచక్రంలోని ఆవరణలు, మానవదేహంలోని వివిధ భాగాలతో పోల్చబడ్డాయి.
4. మానవ దేహం సృష్టించటానికి అవసరమైన జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల యొక్క తత్త్వాలు కూడా శ్రీచక్రంలోనే ఉన్నాయి.

అందుచేతనే పైన చెప్పిన ఈశ్వర వచనం.

**"శ్రీచక్రం త్రిపుసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరి" ॥**

ప్రకారం శ్రీచక్రంలో బ్రహ్మాండమే కాదు, విశ్వమానవాళి కూడా ఉన్నది. అందుచేతనే శ్రీచక్రాన్ని గనక అర్చించినట్లైతే చరాచర జగత్తునూ విశ్వమానవాళినీ కూడా పూజించిన ఫలము వస్తుంది  అంటే శ్రీచక్రము చరాచర జగత్తుకే కాకుండా విశ్వమానవాళికి కూడా ప్రతీక. కాబట్టి శ్రీచక్రంలోని దేవత విశ్వమానవాళియేకాదు. చరాచర జగత్తు కూడా అని గుర్తించాలి అన్నాడు రత్నాకరుడు.



# 8. శ్రీచక్రము - పంచదశీ మహామంత్రము

"గురువర్యా! శ్రీచక్రము పంచదశీ మహామంత్రం నుంచే పుట్టింది అన్నారు కదా! అది ఎలా సాధ్యం? శ్రీచక్రంలో పంచభూతాలు ఏ రకంగా ఉన్నాయి ? మంత్రంలో చెప్పిన దేవతయే శ్రీచక్రానికి అధిదేవత అవుతుందా ? నా సందేహాలు తీర్చండి" అని అడిగాడు నారాయణభట్టు. శిష్యుని సందేహం తీర్చటానికి ప్రారంభించాడు గురువైన రత్నాకరుడు.

శ్రీవిద్యలో మహోన్నతమైనది పంచదశీ మహామంత్రము. ఇది కేవలము 15 అక్షరాలు గల మంత్రము. ఇది మొత్తం 3 ఖండాలుగా ఉంటుంది. మొదటి ఖండంలో 4, రెండవ ఖండంలో 5, మూడవ ఖండంలో 3 బీజాక్షరాలుంటాయి. ప్రతిఖండానికీ చివర హ్రీంకారముంటుంది. ఈ రకంగా 12 బీజాక్షరాలు, 3 హ్రీంకారాలు వెరసి 15 బీజాక్షరాలతో పంచదశీ మహామంత్రము అలరారుతున్నది. పంచదశీ మహామంత్రం మీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన **"శ్రీవిద్యా పంచదశి"** చూడండి.

పరదేవత యొక్క యంత్ర రూపము శ్రీచక్రమైతే మంత్ర రూపము పంచదశీ మహామంత్రము కాబట్టి ఈ రెండూ ఒక్కటే కాని వేరుకాదు. పంచదశీ మహామంత్రానికి కౌళికార్థము వివరించేటప్పుడు ఈ విషయం చెప్పటం జరిగింది. భాస్కరరాయల వారు తమ "వరివస్యా రహస్యం"లో ఈ విధంగా అన్నారు.

***కత్రితయాదీ కారాద్బిందుర్జాత స్తదగ్రిమేచక్రే ।***
***హ్రాల్లేఖాభిస్తత్పర చక్ర త్రితయం హకారాభ్యాం ॥***
***ఏకారేణచ తత్పర చక్రే జాతే సకారాభ్యాం ।***
***చతురస్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్ర జని: ॥***

శ్రీచక్రము పంచదశీ మహామంత్రము నందలి బీజాక్షరముల వల్లనే ఉద్భవించింది.

1. 3 క కారములు, ఈ కారము వలన - శ్రీ చక్రంలోని బిందువు
2. 3 హ్రీం కారముల వలన - త్రికోణము, అష్టకోణము
3. 2 హ కారములు, ఏ కారము వలన - అంతర్దశారము
   బహిర్దశారము, చతుర్దశారము
4. 2 స కారముల వలన - అష్టదళము, షోడశదళము
5. 3 ల కారముల వలన - భూపుర త్రయము పుట్టినాయి.

ఈ రకంగా శ్రీచక్రము పంచదశీ మహామంత్రం నుంచే ఉద్భవించింది. శ్రీచక్రం గురించి జ్ఞానార్ణవతంత్రంలో ఈ రకంగా చెప్పటం జరిగింది.

భూమిశ్చంద్ర శివోమాయా శక్తిః కృష్ణమాధ్వనౌ ।
అర్థచంద్రశ్చ బిందుశ్చ నవార్ణోమేరురుచ్యతే ॥
శ్రీచక్రమపి దేవేశి మేరురూపం నసంశయః ।
లకారః పృథివీ బీజం తేన భూబింబముచ్యతే ॥
సకారాశ్చంద్రమారభద్రే కళాషోడశ కాత్మకం ।
తస్మాత్షోడశ పత్రంతు హకారః శివ ఉచ్యతే ॥
అష్టమూర్తిః సదాభద్రే తస్మాద్వసుదళం భవేత్ ।
ఈకారస్తు మహామాయా భువనాని చతుర్దశః ॥
పాలయంతీ పరాతస్మా చ్చక్రకోణం భవేత్ప్రియే ।
శక్తి రేకాదశస్థానే స్థిత్వా సుతే జగత్రయమ్ ॥
విశ్వయోని రితి ఖ్యాతా సా విష్ణు ర్దశ రూపకం ।
రకారత్పరమేశాని చక్రం వ్యాప్య విజృంభతే॥
దశకోణకరీ యస్మా ద్రకారో జ్యోతి రవ్యమై ।
కళాదశాన్వితో వహ్ని ర్దశకోణ ప్రవర్తకః ॥
కకారో మదనో దేవీ శివశ్చాష్ట స్వరూపకః ।
యోసివశ్యం తదా చక్రే వసుయో వ్యంకితం భవేత్ ।
అర్ధమాత్రా గుణాన్ సూతే నాద రూపా యతస్తతః ।
త్రికోణరూప యోనిస్తు బిందునా బైందవం భవేత్ ॥
కామేశ్వర స్వరూపంతు విశ్వాకార స్వరూపకం ।
శ్రీచక్రంతు వరారోహే శ్రీవిద్యా ర్ణవ సంభవం ॥

విశ్వాకారానికి ప్రతీకలైన కామేశ్వరీ కామేశ్వరుల స్వరూపంగా శ్రీచక్రము పంచదశీ మహామంత్రం నుంచి ఉద్భవించింది.

శ్రీవిద్యా మహామంత్రమయిన పంచదశీ మహామంత్రంలోఉండే అక్షరాలు మొత్తం 9 అవి.

1. భూమి - ల
2. చంద్ర - స
3. శివ - హ
4. మాయ - ఈ
5. శక్తి - ఏ
6. కృష్ణమాద్య - రేఫ
7. మదన - క
8. అర్థచంద్ర - నాదము
9. బిందువు - బిందువు

ఈ తొమ్మిది అక్షరాల సముదాయమే పంచదశీ మహామంత్రము.

ఈ మంత్రంలో ఒకసారి వచ్చిన అక్షరాలను ఇంకొకసారి లెక్కించకుండా ఉన్నట్లైతే, మంత్రానికి తొమ్మిది అక్షరాలే అవుతాయి.

ఈ అక్షరాల వల్లనే శ్రీచక్రము ఉద్భవించింది. అది ఏ విధంగా అంటే.

1 ల కారము పృథివీ బీజము. దీని వలన భూపురం పుట్టింది.
2. స కారము చంద్ర బీజము. దీని వల్ల షోడశ దళం పుట్టింది. ఈ షోడశ దళాలలోనూ చంద్రకళలుంటాయి.
3. హ కారము శివ బీజము. అష్టమూర్త్యాత్మకము. దీని వల్ల అష్టదళం పుట్టింది.
4. ఈ కారము మాయా బీజము. అందుచేతనే చతుర్దశ భవనాలకు ప్రతీకగా చతుర్దశారం పుట్టింది.
5. ఏ కారము శక్తి బీజము. దీనవల్ల విష్ణువు యొక్క దశావతారాలకు ప్రతీకగా బహిర్దశారం పుట్టింది.
6. ర కారము అగ్ని బీజము. దీని వలన అగ్ని కళలతోకూడిన అంతర్దశారము పుట్టింది.
7. క కారము మన్మథ బీజము వసుకోణాత్మకము. కాబట్టి అష్ట వసువులకు ప్రతీకగా అష్టకోణము పుట్టింది.

8. అర్ధచంద్రము. త్రిగుణాత్మకమైనది. దీని వలన త్రికోణం పుట్టింది.

9. బిందువు పరబ్రహ్మాత్మకము. దీని వలన తొమ్మిదవ ఆవరణ అయిన బిందువు పుట్టింది. ఈ రకంగా పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రము పుట్టింది.

**పంచదశీ మహామంత్రం పుట్టుక :**

అసలు పంచదశీ మహామంత్రమే పంచభూతాల నుంచి ఉద్భవించింది.

*వ్యోమాది జనక హకరస లార్ణైర్ఘటనేన పంచభూతమయీ ।*
*పంచ చతుస్త్రి ద్వ్యేకగ శబ్దాది గుణాత్మ పంచదశవర్ణా ॥*

నామరూపాత్మకమైనది సృష్టి. అందులో రూపము శబ్దముల యొక్క అర్థరూపమున పరిణమిస్తున్నది. మాతృకల వల్లనే నామరూపాత్మకమైన జగత్తు సృష్టించబడుతున్నది. శబ్ద సృష్టి - పంచదశీ మహామంత్రము. పంచభూతముల యొక్క బీజములైన హ క ర స ల అను అక్షరములతో కూడి ఉండటం చేత పంచదశీ మహా మంత్రము పంచభూతాత్మకమైనది. ఇక పంచభూతాల బీజాలు.

*హకార ద్వ్యోమసంభూతం కకారస్తు ప్రభంజన:*
*రేఫాదగ్ని: స్సకారశ్చ జలతత్త్వ సముద్భవ:*
*లకార త్పృథివీ జాతా తస్మా ద్విశ్వమయీ చ సా ॥*

| | | |
|---|---|---|
| హ కారము | - | ఆకాశ తత్త్వాత్మకము |
| క కారము | - | వాయు తత్త్వాత్మకము |
| ర కారము | - | అగ్ని తత్త్వాత్మకము |
| స కారము | - | జల తత్త్వాత్మకము |
| ల కారము | - | పృథివీతత్త్వాత్మకము |

**మంత్రము :** ఈ పంచభూతముల వల్లనే ఉద్భవించింది. ఏ విధంగా అంటే ? పంచభూతాలలో మొట్టమొదట ఆకాశము ఆవిర్భవించింది. ఆ తరువాత.

*ఆకాశాద్వాయు: వాయోరగ్ని: అగ్నిర్ ఆప: ఆప: పృథివీ*

| | | |
|---|---|---|
| ఆకాశము నుండి | - | వాయుము |
| వాయువు నుండి | - | అగ్ని |
| అగ్ని నుండి | - | నీరు |
| నీటి నుండి | - | జలము ఉద్భవించినాయి. |

వీటన్నింటి యందు మొత్తం పంచదశ (15) తత్త్వాలు ఏర్పాడ్డాయి.

1. ఆకాశము నందు - ఆకాశ తత్త్వము ఒకటే ఉన్నది.
2. వాయువు నందు - ఆకాశ, వాయు తత్త్వాలున్నాయి.
3. అగ్నినందు - ఆకాశ, వాయు, అగ్ని తత్త్వాలున్నాయి.
4. జలమునందు - ఆకాశ, వాయు, అగ్ని, జలతత్త్వాలున్నాయి.
5. భూమి యందు - ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమి తత్త్వాలున్నాయి.

ఈ రకంగా చూసినట్లైతే పంచభూతాలలో

1. ఆకాశము - 5 భాగాలు
2. వాయువు - 4 ''
3. అగ్ని - 3 ''
4. జలము - 2 ''
5. భూమి - 1 భాగము

మొత్తం - 15 భాగములు

*గుణా: పంచదశ ప్రోక్తా భూతానాం త్వయీ శివా*

పంచభూతాల మాదిరిగానే వాటి గుణాలయిన పంచతన్మాత్రలు కూడా పదిహేను భాగాలుగా ఉన్నాయి. పంచభూతాల గుణాలు.

ఆకాశము - శబ్దము
వాయువు - స్పర్శ
అగ్ని - రూపము
జలము - రసము
భూమి - గంధము

ఈ ఐదు గుణాలూ వ్యాప్య, వ్యాపక భావాలచేత పదిహేను అవుతున్నాయి. ఆకాశము సర్వవ్యాపి కాబట్టి, ఆకాశము యొక్క గుణమైన శబ్దము మిగిలిన అన్ని భూతములందురు ఉంటుంది.

ఆకాశము నందు - శబ్దము
వాయువు నందు - శబ్దము, స్పర్శ
అగ్ని యందు - శబ్దము, స్పర్శ, రూపము

| | | |
|---|---|---|
| జలము నందు | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము |
| భూమి యందు | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము ఈ రకంగా |
| శబ్దము | - | 5 భాగములు |
| స్పర్శ | - | 4 భాగములు |
| రూపము | - | 3 భాగములు |
| రసము | - | 2 భాగములు |
| గంధము | - | 1 భాగము |
| మొత్తం | | 15 భాగములు |

మొత్తం పంచభూతాల, తన్మాత్రల భాగాల చేతనే పంచదశీ మహామంత్రం ఉద్భవించింది. పంచభూతాల బీజాక్షరాలు. పైన చెప్పబడ్డాయి. పంచీకరణ చెందేటప్పుడు.

| పంచభూతాలు | బీజము | భాగాలు | బీజాక్షరాలు సంఖ్య |
|---|---|---|---|
| ఆకాశము | హ కార బీజము | 5 భాగాలు | 5 హ కారాలు |
| వాయువు | క కార బీజము | 4 భాగాలు | 4 క కారాలు |
| అగ్ని | ర కార బీజము | 3 భాగాలు | 3 ర కారాలు |
| జలము | స కార బీజము | 2 భాగాలు | 2 స కారాలు |
| భూమి | ల కార బీజము | 1 భాగము | 1 ల కారము |

కాబట్టి పంచదశీ మహామంత్రంలో

| | | | |
|---|---|---|---|
| ఆకాశ బీజమైన | హ కారాలు | - | 5 |
| వాయు బీజమైన | క కారాలు | - | 4 |
| అగ్ని బీజమైన | ర కారములు | - | 3 |
| జల బీజమైన | స కారములు | - | 2 |
| పృథ్వి బీజమైన | ల కారము | - | 1 |

ఈ రకంగా మొత్తం బీజాలు 15 పంచదశీ మహా మంత్రంగా అయినాయి. అయితే మంత్రంలో క కారములు మూడే ఉంటాయి. నాలుగు ఉండవు అందుచేత ఈ కారము వాయు బీజంగా తీసుకోవటం జరిగింది. మూడు హ్రీంకారాలలోనూ ఉన్న ఈ కారాలు మూడు, విడిగా ఉన్న ఈ కారము ఒకటి, మొత్తం నాలుగు ఈ కారాలు. ఇప్పుడు మంత్రం మొత్తం మీద

| | | |
|---|---|---|
| హ కారములు | - | 5 |
| ఈ కారములు | - | 4 |
| ర కారములు | - | 3 |
| స కారములు | - | 2 |
| ల కారము | - | 1 |
| మొత్తం | | 15 |

మంత్రంలో ల కారములు మూడు ఉన్నప్పటికీ శ్రీచక్రంలోని భూపురంలో వాటిని మూడు రేఖలుగా, అంటే, భూలోక భువర్లోక సువర్లోకాలుగా చెప్పటం జరిగింది.

మంత్రంలో ఉన్న క కారములచేత సాధకులను మూడు రకాలుగా విభజించటం జరుగుతోంది.

***క కారత్రయ వాచ్యస్తు సకలాః ప్రళాయాః కళాః ।***
***విజ్ఞాన కేవలశ్చేతి త్రిప్రకారా ఉపాసకా : ॥***

వారు 1) సకలులు, 2) ప్రళయా కలులు 3) విజ్ఞాన కేవలులు.

వీరినే 1) సకలులు 2) సకల నిష్కలులు 3) నిష్కలులు అని కూడా అంటారు. ఈ రకంగా పంచభూతాల, నుంచి ఉద్భవించింది పంచదశీ మహామంత్రము, ఆ మంత్రం నుంచే శ్రీచక్రము ఉద్భవించింది. కాబట్టి శ్రీచక్రము కూడా పంచభూతముల నుంచే ఉద్భవించింది అని కాబట్టి శ్రీచక్రము పంచభూతాత్మకము.

పంచదశీ మహామంత్రార్థాన్ని గనక పరిశీలించినట్లైతే.

***వామేచ్ఛా బ్రహ్మభారత్యా జేష్ఠా జ్ఞాన హరిక్షితీ ।***
***రౌద్రీక్రియా శివాపర్ణే ఇత్యే తన్మిధున త్రయమ్ ॥***

ప్రకాశ విమర్శలు రెండూ కలిసి దంపతులై ఈ జగత్తును సృష్టించారు. అయితే ఇక్కడ ప్రకాశ రూపము పురుషుడు. విమర్శ రూపము స్త్రీ. ప్రకాశ రూపము వ్యష్టిగా అంటే విడివిడిగా వామాజ్యేష్ఠా రౌద్రీ. ఇదే సమిష్టిగా, అంబికా అనబడుతుంది. దీనిలో వామాజ్యేష్ఠారౌద్రీ శక్తులే త్రిమూర్తులు. వారిలో

| | | |
|---|---|---|
| వామ | - | బ్రహ్మ |
| జ్యేష్ఠా | - | విష్ణువు |
| రౌద్రి | - | రుద్రుడు |

అలాగే విమర్శ శక్తి కూడా ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు అని మూడు రకాలు. దీన్ని సమిష్టిగా శాంతా అంటారు - దీనిలో

ఇచ్ఛా శక్తి - భారతి

జ్ఞానశక్తి - పృథ్వి

క్రియా శక్తి - గౌరి

ఇప్పుడు

వామేచ్ఛా - బ్రహ్మ, భారతి

జ్యేష్ఠా జ్ఞాన - హరిక్షితి (లక్ష్మీ నారాయణులు)

రౌద్రీక్రియా - రుద్రుడు, గౌరి

వీరందరూ కలిసి సమిష్టిగా నాల్గవ జంట అవుతున్నారు. అదే శాంతా అంబికల స్వరూపము. వీరిలో

బ్రహ్మ, భారతి - సృష్టి కర్మకూ

హరి క్షితి - స్థితి కర్మకూ

రుద్రుడు గౌరి - సంహార కర్మకూ అధిపతులు

పంచదశీ మమామంత్రము మూడు కూటములుగా ఉన్నది. వీటిలో ప్రథమ కూటమి సృష్టి రూపము. ద్వితీయ కూటమి స్థితి రూపము, తృతీయ కూటమి సంహారకూటమి.

**పంచదశీ మహామంత్రము :**

***క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।***

ఇప్పుడు ప్రథమ కూటమిలో

క కారము - బ్రహ్మ స్వరూపము

ఏ కారము - భారతీ స్వరూపము

ఈ కారము - విష్ణు స్వరూపము

ల కారము - పృథ్వీ స్వరూపము

హ్రీం కారములోని హ కారము - రుద్ర స్వరూపము

రేఫ - రుద్రాణి స్వరూపము

ఈం కారము - శాంతా అంబికల స్వరూపము.

ద్వితీయ కూటమిలో మధ్య నున్న హకారము వదిలెయ్యాలి. అప్పుడు

| | | |
|---|---|---|
| హ కారము | - | బ్రహ్మ స్వరూపము |
| స కారము | - | భారతీ స్వరూపము |
| క కారము | - | విష్ణు స్వరూపము |
| ల కారము | - | పృథ్వీ స్వరూపము |
| హ్రీం కారములోని హ కారము | - | రుద్ర స్వరూపము |
| రేఫ | - | రుద్రాణీ స్వరూపము |
| ఈం కారము | - | శాంతాంబింకల స్వరూపము |

తృతీయ కూటమి ముందు ద్వితీయ కూటమిలో వదలివేసిన హకారము ఉంచాలి. అప్పుడు

| | | |
|---|---|---|
| హ కారము | - | బ్రహ్మ స్వరూపము |
| స కారము | - | భారతీ స్వరూపము |
| క కారము | - | విష్ణు స్వరూపము |
| ల కారము | - | పృథ్వీ స్వరూపము |
| హ్రీం కారములోని హ కారము | - | రుద్ర స్వరూపము |
| రేఫ | - | రుద్రాణి స్వరూపము |
| ఈం కారము | - | శాంతాంబికల స్వరూపము. |

ఈవిధంగా పంచదశీ మహామంత్రంలోని మూడు కూటములకూ సృష్టి స్థితి లయకారములు మిధునముల స్వరూపం చెప్పబడింది. ఇంకో రకంగా చెప్పాలంటే పంచదశీ మహామంత్రము సృష్టిస్థితి లయాల స్వరూపము. మంత్రం యొక్క ప్రతిరూపమే శ్రీచక్రము. కాబట్టి శ్రీచక్రము కూడా సృష్టి స్థితి లయల స్వరూపమే అన్నాడప రత్నాకరుడు



# 9. భగవద్గీత

"మహానుభావా ! మీరు ఇంత వరకు చెప్పినదాన్ని బట్టి శ్రీచక్రంలోని దేవత సృష్టి స్థితి లయాలకతీతమైన పరమేశ్వరి అని తెలుస్తోంది. పరమేశ్వరుడు సర్వాంతర్యామి కదా ! ఆ పరమేశ్వరుని రూపం భగవద్గీతలో ఏ విధంగా చెప్పబడింది." అన్నాడు శిష్యుడైన నారాయణ భట్టు. అతడి కోరిక తీర్చటానికి భగవద్గీతలోని విశ్వరూపాన్ని వర్ణించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

సాక్షాత్తూ భగవానుడే బోధించిన గీత "భగవద్గీత". హైందవ ధర్మానికి ప్రామాణికమైనది.

జూదంలో ఓడిపోయిన పాండవులు అరణ్య వాసము, అజ్ఞాత వాసము పూర్తిచేసి, తమ రాజ్యభాగం తమకిమ్మని రాయబారం పంపారు. సంధి పొసగలేదు. కౌరవులు, పాండవులు యుద్ధానికి సన్నిద్ధమై కురుక్షేత్రం చేరారు. ఉభయ సేనా వాహినిలూ శంఖనాదాలు, భేరీ భాంకారాలు చేస్తున్నాయి. ఆ సమయంలో

**"సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేచ్యుత."**

"అచ్యుతా ! రెండు సేనా సమూహాల మధ్య నారథాన్ని ఒక్కసారి నిలుపవలసినది" అన్నాడు. అర్జునుడు కోరినట్లే చేశాడు కృష్ణుడు. అప్పుడు అర్జునుడు రెండు సేనలలోనూ ఉన్న వారందరినీ చూశాడు. తండ్రులు, తాతలు, గురువులు, ఈ రకంగా బంధువర్గం అంతా కనిపించింది. అర్జునుడికి ఎక్కడలేని దుఃఖము ముంచుకొచ్చింది. "కృష్ణా ! కేవలం రాజ్యం కోసం అయిన వాళ్ళందరిని చంపుకోలేను. నాకు ఈ రాజ్యం వద్దు". అని ఆయుధాలు పారేశాడు. అప్పుడు భగవానుడైన శ్రీకృష్ణుడు అర్జునునికి గీతను ఉపదేశించాడు. భగవద్గీతలో 18 అధ్యాయలు, 700 శ్లోకాలు ఉన్నాయి.

గీతలో పదవ అధ్యాయము విభూతి యోగము. ఇందులో శ్రీకృష్ణ భగవానుడు తన స్వరూప స్థితిగతులు, విశేష శక్తులు వివరించాడు.

"అర్జునా ! దేవతాసమూహాలు, మహర్షులు కూడా నా ప్రభావం ఎరుగరు. దేవతలకు, మహర్షులకు మూలపురుషుడను నేను. నన్ను పుట్టుకలేనివాడుగను, లోక మహేశ్వరుడగను తెలుసుకొన్నవాడు మనుష్యులలో జ్ఞాన శ్రేష్ఠుడు. అటువంటివాడు సర్వపాపముల నుండి విముక్తుడౌతున్నాడు. బుద్ధి, జ్ఞానము, క్షమ, సత్యము, శమదమాదులు, సుఖదుఃఖాలు, చావు పుట్టుకలు, అహింస, సంతృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి మొదలైన వన్నీ నా వల్లనే

జరుగుతున్నాయి. ఈ సృష్టికి మూల పురుషులైన భృగువు మొదలైన మహర్షులు, సనక సనందనాదులు, మనువులు నా సంకల్పము వల్లనే పుట్టారు. చరాచర జగదుత్పత్తి కారణముననే నా వల్లనే ఈ ప్రపంచము ప్రవర్తిల్లుతున్నది." అన్నాడు. అప్పుడు అర్జునుడు "కృష్ణా ! ఏ విభూతులతో నీవు ఈ లోకమందు వ్యాపించి ఉన్నావో, ఆ విషయాలను వివరించవలసినది" అని కోరాడు. దానికి భగవానుడు తన విభూతులు వివరించటం మొదలు పెట్టాడు.

"ఓ అర్జునా ! సర్వ భూతములందు ఆత్మను నేను. వాటి యొక్క ఆది మధ్య అంతము కూడా నేనే. ద్వాదశాదిత్యులలో విష్ణువు అనెడివాడనునేను. ప్రకాశించే వారిలో సూర్యుడను, మరుత్తులలో మరీచిని, నక్షత్రాలలో చంద్రుడను, వేదములలో సామవేదాన్ని, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియాలలో మనస్సును ఏకాదశరుద్రులలో శంకరుడను, యక్షులలో కుబేరుడను. అష్ట వసువులలో అగ్నిని, పర్వతాలలో మేరువును, పురోహితులలో బృహస్పతిని, సేనానులలో కుమారస్వామిని, జలాశయములలో సముద్రుడను, మహర్షులలో భృగుడను, శబ్దాలలో ఓంకారాన్ని, యజ్ఞాలలో జపయజ్ఞాన్ని, స్థావరములలో హిమాలయాన్ని, వృక్షములలో రావిచెట్టును, దేవర్షులలో నారదుడు, గంధర్వులలో చిత్రరధుడు, సిద్ధులలో కపిలుడు, గుర్రములలో ఉచ్చైశ్శ్వరము, ఏనుగులలో ఐరావతము, మానవులందు రాజు, ఆయుధాలలో వజ్రాయుధము, ధేనువులలో కామధేనువు, సర్పాలలో వాసుకి, నాగులలో ఆదిశేషుడు, జలదేవతలలో వరుణుడు, పితృ దేవతలలో ఆర్యముడు, దైత్యులలో ప్రహ్లాదుడు, గణకులలో కాలపురుషుడు, మృగాలలో సింహము, పక్షులలో గరుత్మంతుడు, గమనము గలవారిలో వాయువు, శస్త్రధరులలో రాముడు, ప్రవాహములలో గంగను నేను. అర్జునా ! సృష్టికి ఆద్యంతములు నేను. విద్యలలో బ్రహ్మవిద్యను. అక్షరములలో 'అ'కారమును, నశించని కాలమునేను. నేనే సర్వకర్తను నేనే సర్వభర్తను సర్వభూతముల ప్రాణములు హరించు మృత్యువు నేను. ఛందస్సులలో గాయత్రి, మాసములలో మార్గశీర్షము, ఋతువులలో వసంత రుతువు, మోసాలలో జూదము, యాదవులలో వాసుదేవుడు, పాండవులలో అర్జునుడు, మునులలో వ్యాసుడను నేను. దండించు వారిలో దండాన్ని నేను. జయాభిలాషులలో రాజనీతిని నేను. జ్ఞానవంతులలో జ్ఞానాన్నినేను. అన్ని భూతములకు మూల భూతాన్ని నేను. చరాచర వస్తువులలో నాది కానిది ఏదీ లేదు. పుష్టివంతము, శోభావంతము, కాంతివంతము అయినది ఎక్కడ ఉన్నా, అది నా వల్లనే పుట్టింది." అన్నాడు.

**విరాడ్రూపం :**

ఈ విషయాన్నంతా విన్న అర్జునుడు ఓ మహాపురుషా ! నీ విరాట్స్వరూపాన్ని చూపమని ప్రార్థించాడు. దానికి భగవానుడు "అర్జునా ! అనేక రంగులతో, ఆకారాలతో వందలకొద్దీ, వేలకొద్దీ ఉన్న నా దివ్యరూపాన్ని చూడు. ఆదిత్యుడు, వసువులు, రుద్రులు, అశ్వనీ దేవతలు, మరుత్తులు అందరినీ నాలో చూడు. ఈ చరాచర జగత్తు అంతా నా శరీరంలోని ఒక భాగంలోనే ఉన్నది." అని చెప్పి అర్జునుడికి విరాడ్రూపాన్ని చూపుతూ దాన్ని దర్శించటానికి దివ్య దృష్టి ప్రసాదించాడు. అప్పుడు ఆ రూపం ఎలా ఉందంటే.

అనేక ముఖాలతో, దివ్యాభరణాలతో, అద్భుత దృశ్యాలతో, ఎక్కుపెట్టిన దివ్యాయుధాలతో, దివ్యమైన వస్త్రాలతో, పుష్పమాలలతో, సుగంధాలతో, దేదీప్యమానము, అనంతము, విశ్వతోముఖము అయి విరాజిల్లుతున్నది.

అనేక కోట్ల సూర్యకాంతులతో ఆరూపం ప్రకాశిస్తున్నది. దేహంలో సమస్త దేవతలు, మునులు, చరాచర జగత్తు కనిపిస్తున్నాయి. అనేక బాహువులు, కడుపులు, ముఖాలు, నేత్రాలు గల ఆ రూపం ఆద్యంతములు లేకుండా ఉంది. సూర్యచంద్రులే ఆ రూపానికి కనులు, అగ్నియే ముఖం, భూమి, ఆకాశము, దశదిశలు, అంతా నిండి ఉన్నది. ఎంతో మంది రాజులు, కౌరవులు, పాండవ పక్షం వారు భయంకరమైన ఆ రూపమునోట్లోకి వెళ్ళి పోతున్నారు.

పై విషయాలను పరిశీలించినట్లైతే పరమేశ్వరుడు ఆద్యంత రహితుడు, సర్వవ్యాపి, సృష్టిస్థితి లయకారకుడు. చరాచర జగత్తును సృష్టించింది అతనే. లోకంలోని ప్రతి పనీ అతని ఇచ్ఛానుసారమే జరుగుతున్నది. అన్ని భూతములందు పరమేశ్వరుడు ఆవరించి ఉన్నాడు కాబట్టి చరాచర జగత్తు లోకంలోని ప్రాణి కోటి అంతా పరమేశ్వర మయమని తెలుస్తున్నది' ' అన్నాడు రత్నాకరుడు



# 10. పురాణాలు

"వేదాలలోని విషయాలను సామాన్యులకందించటానికే పురాణాలు ఆవిర్భవించాయి. పురాణాలలో ధర్మాధర్మాలను, చిన్న చిన్న కధల రూపంలో చెప్పారు. భక్తి తత్త్వము, ఉపాసన పరబ్రహ్మ స్వరూపము మొదలైనవన్నీ వివరించారు. అందుకే పురాణాలు జన బాహుళ్యంలోకి చొచ్చుకు పోయినాయి. అటువంటి పురాణాల్లోని పరమేశ్వర తత్త్వాన్ని వివరించండి అన్నాడు కృష్ణశర్మ. పురాణల్లో పరమేశ్వర తత్త్వాన్ని వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వర తత్త్వాన్ని పురాణాల్లో కూడా అనేక చోట్ల వివరించటం జరిగింది. శ్రీమద్భాగవతంలోని గజేంద్రమోక్షంలో పరమేశ్వరుణ్ణి కళ్ళకు కట్టినట్లు చూపించాడు బమ్మెర పోతన.

గజరాజు తన ఆరుగురు భార్యలతో కలసి వన విహారానికి వచ్చాడు. ఆ వనంలో చెట్ల కొమ్మలు విరిచేశాడు. కొన్ని చెట్లను మొదళ్ళతో సహా పెకలించేశాడు. ఒకటేమిటి, అడవిలో వీర విహారం చేసి బాగా అలసిపోయి ఒక పెద్ద నీటి మడుగులో దిగాడు. కడుపారా నీరు త్రాగాడు. అందులోని తామర తూళ్ళను పెకలించి చిందర వందర చేస్తున్నాడు. ఇంతలో ఎక్కడ నుంచి వచ్చిందో ఒక మొసలి వచ్చి గజేంద్రుని పట్టుకుంది. ఆ మొసలి పట్టు విడిపించుకోవటానికి దానితో భీకరమైన యుద్ధం చేశాడు. ఇలా వేయి సంవత్సరాలు గడిచి పోయినాయి. మొసలి పట్టువదల్లేదు. గజేంద్రుడికి శరీరంలో శక్తి సన్నగిల్లుతోంది. అప్పుడు భగవంతుడు గుర్తు వచ్చాడు. ఏ విధంగా దీన్ని గెలుస్తాను ? ఏ దైవాన్ని ప్రార్థించాలి ? నాకు తోడుగా రమ్మని ఎవరిని పిలవను ? దిక్కు తోచక అలమటిస్తున్న నన్ను రక్షించే నాధుడే లేడా? అని విలపిస్తున్నాడు.

ఈ గజేంద్రుడే సాధకుడు. అతని ఆరుగురు భార్యలు అరిషడ్వర్గాలు. వారితో ఉన్నంత వరకూ నాకు ఎదరు లేదని భావించాడు. ఇప్పుడు మొసలి అనే సంచిత కర్మ అతణ్ణి పట్టుకుంది. ఈ కర్మ పరిహారం కావాలంటే కల్పాంతముదాన్ని అనుభవించాలి. అనుభవం లేకుండా కర్మ సమాప్తి కావాలి అంటే భగవంతుడి అనుగ్రహం కావాలి. ఈ విషయం తెలిసిన వాడై పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు గజరాజు.

**ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై**
**యెవ్వని యందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం**

**బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు సర్వముదానెయైన వా**
**డెవ్వడు వాని నాత్మ భవునీశ్వరునేశ్వరునే శరణంబు వేడెదన్ ॥**

ఏ పరమేశ్వరుని వల్ల ఈ జగములు సృష్టింపబడుతున్నాయో, ఎవని యందు లయమవుతున్నాయో, అన్ని వస్తువులకు ప్రభువు ఎవరో, అన్నింటికీ ప్రధాన కారణము ఎవరో, ఆది మధ్య అంతము లేనివాడు, అన్నీ తానే అయినవాడు అయిన ఆ పరమేశ్వరుడు నన్ను కాపాడుగాక"

ఇక్కడ పరమేశ్వరుని లక్షణాలను వివరిస్తున్నాడు-

**ఒక పరిజగముల వెలినిడి**
**యొక పరిలోపలికి గొనుచు ఉభయము గనుచున్**

లోకాలన్నీ కూడా పరమేశ్వరుని ఉదరంలో ఉన్నాయి. ఆ చతుర్దశ భువనాలను ఒకసారి బయటకు పంపి అంటే సృష్టి చేసి, మళ్ళీ లోపలికి గొనుచు అంటే వాటిని లయం చేస్తూ, అనగా సృష్టి సంహారము చేస్తూ అన్నిటికీ సాక్షియైనవాడు.

లోకాలు, లోకపాలకులు అందరూ నశించిన తరువాత, ఈ లోకమంతా గాడాంధకారంలో మునిగి పోతుంది. అట్టి అంధకారంలో ఒకే ఆకారంతో ప్రకాశించేవాడు.

నటుడు నాటకాల్లో వేషాలు మార్చినట్లుగా సకల భూతముల యందు ఉండి నటిస్తుంటాడు.

**ముక్త సంగులైన మునులు దిద్రుక్షులు**
**సర్వభూతహితులు సాధుచిత్తు**
**ల సద్రుశవ్రతాఢ్యులు గొల్తురు**

సంసార సుఖము వర్జించిన మునీశ్వరులు, బ్రహ్మసాక్షాత్కారం కోరే జ్ఞానులు, అన్ని ప్రాణులకు హితము చేసేవారు, సాధువర్తనులు, నియమనిష్టలతో కాలంగడిపే వారు మాత్రమే అతణ్ణి సేవిస్తారు.

పరమాత్మకు పుట్టుక లేదు. పాపము లేదు. నామరూపాలు లేవు. అయినప్పటికీ ఈ జగత్తును సృష్టించటం కోసం నామరూప గుణ, క్రియాదులు గలిగి ఉంటాడు. పరాత్పరుడు తేజోమయుడు, రూప రహితుడు, గొప్ప చరిత్ర గలవాడు. అవాఙ్మానస గోచరుడు, సాత్విక గుణము గలిగి, సంసార బంధనాలు త్రెంచుకున్న వారికి మాత్రమే దర్శనమిస్తాడు. అతడు

శాంతమూర్తి. మోక్షానందం అంటే ఏమిటో తెలిసినవాడు. మోక్షాధికారి, సర్వాతీతుడు, అజ్ఞానులనే పశువులకు భయంకరుడు. అతణ్ణి గురించి తెలుసుకోవటం కడు దుర్లభం. అతడు త్రిగుణాత్మకుడు, సౌమ్యుడు, జ్ఞానరూపి. సర్వలోకలలోనూ జరిగే ఇంద్రియ వ్యాపారానికి ప్రత్యక్షసాక్షి. అందరి శరీరములందూ ఉన్నవాడు. దయామయుడు. జీవులకు ప్రభువు. సకల దుఃఖాలను నాశనం చేసేవాడు. మాయకు అతీతుడు. కాని, మాయకు లోబడ్డట్లు కనిపిస్తాడు. జగత్తు కంతకూ కారణభూతుడు. ఈ జగత్తు అంతా మాయతో నిండి ఉన్నది. అట్టి మాయకు సంబంధించిన పనులన్నిటినీ యోగాగ్నిలో దగ్ధము చేసిన యోగీశ్వరులు, ఆ పరమేశ్వరుణ్ణి తమ మనసులోనే చూడగలుగుతారు.

ఆ పరమేశ్వరుడు సకల వేదాలకు, ఆగమాలకు, నిధి, మోక్ష రూపుడు. సజ్జనుల చేత మాత్రమే సేవించబడుతుంటాడు. సత్వగుణ ప్రధానుడు. మహాజ్ఞాని స్వయం ప్రకాశము గలవాడు. సకల కర్మానుష్టానపరులచే మాత్రమే పొందదగినవాడు. ధర్మార్ధకామములను వదలి పెట్టి సాయుజ్యంకోసము అతణ్ణి ప్రార్థించే వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఆ పన్నులు, యోగులు, మొదలైన వారితో ఉంటాడు సర్వదిక్కులందు వ్యాపించినవాడు. జగత్తులో ఉన్న సమస్త ప్రాణికోటి, వస్తు సముదాయము మొదలైన అన్నింటిలోనూ ఉంటాడు. ఆది మధ్యాంత రహితుడు. భక్త జనులను, దీనులను, ఆర్తత్రాణ పరాయణులను రక్షిస్తుంటాడు.

పై విషయాలను పరిశీలించినట్లైతే పరమేశ్వరుడు సర్వవ్యాపి. ఈ జగత్తును అతడే సృష్టించాడు. అతడే లయం చేస్తాడు. జగత్తులోని ప్రతి వస్తువునందు అంతర్గతంగా ఉన్నాడు. భక్తులను, దీనులను, మోక్షవాదులను సదాకాచి రక్షిస్తుంటాడు. అని తెలుస్తుంది అన్నాడు రత్నాకరుడు.



# 11. వేదాలు

"వేదాలు అపౌరుషేయాలు. హైందవ ధర్మానికి అవే ప్రాతిపదిక. అటువంటి వేదాలలలో పరబ్రహ్మ స్వరూపం ఏమని చెప్పారు?" అని అడిగాడు నారాయణభట్టు. వేదాలలో భాగంగా'పురుషసూక్తం' గురించి వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

ఇష్టప్రాప్తినీ, అనిష్ట పరిహారాన్నీ సాధించటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పే గ్రంథమే వేదము. ఇది సకల దేవతలను, ధర్మాన్నీ పరబ్రహ్మతత్త్వాన్నీ ప్రతిపాదిస్తుంది.

వేదాలు అపౌరుషేయాలు. వాటిలో చెప్పిన అలౌకిక ఆధ్యాత్మిక సిద్ధాంతాలు శాశ్వతాలు. పురుష సూక్తంలో దివ్య ప్రజాపతులు, ఋషులు కలిసి పరమపురుషుడే హవిస్సుగా చేసిన మానవ యజ్ఞం నుంచి వేదాలు ఉద్భవించాయి. పరమాత్మ బ్రహ్మను సృష్టించి అతనికి వేదాలనిచ్చాడు.

వేదాలలో పరబ్రహ్మను గురించి చెప్పబడింది. దానిలో భాగంగా పురుష సూక్తంలో పరబ్రహ్మను గురించి ఏంచెప్పారో చూద్దాం.

## పురుష సూక్తము

ప్రాప్తించిన రోగాలు రాకుండా ఉండటానికి "అరుణ కేతుకము" అనే కర్మను ప్రార్థిస్తున్నాను. అరుణ కేతుకములో చెయ్యబోయే క్రతువు యోగ్యము కావటం కోసం ఈ ప్రార్థన చేస్తున్నాను. నా యజమానికి అనుకూల ఫలప్రాప్తి కోసం ఈ ప్రార్థన చేస్తున్నాను. దేవతల వల్ల మాకు, మా సంతానానికి క్షేమము కలుగుగాక ! సర్వారిష్ట నివారణ పొందుగాక! మా వారికి, పశువులకు శుభము కలుగుగాక ! ఓ పరమాత్మా ఆధ్యాత్మిక తాపముచే మాకు కలుగు విఘ్నముల శాంతించునుగాక! చోర వ్యాఘ్రాదులచే కలుగు విఘ్నములు శాంతించునుగాక ! యక్ష రాక్షసుల వల్ల కలుగు విఘ్నములు శాంతించునుగాక !

చరాచర జగత్తంతా పరమాత్మ యొక్క విరాడ్రూపము. పరమాత్మ జగత్తులోని అన్ని జీవుల యందు ఉన్నాడు. అందుచేత ఆయనకు అనేక శిరస్సులు, నేత్రములు, పాదములు ఉన్నాయి. ఆయన బ్రహ్మాండ మంతా వ్యాపించి ఉన్నాడు. ఆయన తన అవస్థను వదలి జగద వస్థను పొంది ఉన్నాడు. ఆయన త్రికాలము లందు ఉంటాడు. ఆయన ఈ జగదవస్థను పొందిన శక్తి కన్నా ఇంకా ఎక్కువ శక్తి ఆయన దగ్గర ఉన్నది. ఈ విశాల విశ్వం ఆయనలో నాల్గవవంతు మాత్రమే. మిగిలినది స్వయం ప్రకాశ రూపం ద్వారా నాశనము లేకుండా

ఉన్నది. ఆ పరమాత్మకు జనన మరణాలు లేవు. దేహానికి ఉండే గుణ దోషాలు లేవు. ఆయన నాల్గవ భాగము మాయను పొంది సృష్టి, స్థితి, సంహార కార్యక్రమాలు చేస్తున్నది. పరమాత్మ నుంచి విరాడ్రూపుడు పుట్టి భూమిని సృష్టించాడు. భూమి మీద సకల జీవరాసులలోనూ వ్యాపించి ఉన్నాడు. తరువాత  సప్త ధాతువుల దేహములు సృష్టించాడు.

మొట్టమొదట విరాట్పురుషుడు దేవ సృష్టి చేశాడు. అప్పుడు సృష్టి చేసే సామర్థ్యం కోసం దేవతలు ఒక యజ్ఞము మొదలుపెట్టారు. అప్పటికి సృష్టి ఇంకా పూర్తి కాలేదు. కాబట్టి వారికి హవిస్సుదొరక లేదు. అంతట వారు విరాట్స్వరూపుని స్వరూపాన్నే హవిస్సుగా భావించి మానస యజ్ఞం చేశారు. యాగానికి కావలసిన నేతికై వసంత ఋతువును, భావన చేశారు. ఆయా యజ్ఞానికి గాయత్రి మొదలైన ఛందస్సులు ఏడు మేరలుగా, వాటితో ఏర్పడ్డ ఇరవై ఒక్కింటిని సమిధలుగా భావించి పురుష పశువును యూప స్తంభానికి కట్టేశారు.

ఈ రకంగా దేవతలు, ఋషులు సాధ్యులు కలిసి చేసిన మానస యజ్ఞం నుండి "పృషత్" అనే నేయి వచ్చింది. పశువులు, గాయత్రి మొదలైన ఛందస్సులు పుట్టినాయి. ఆ యజ్ఞంలో గుఱ్ఱాలు, నోటిలో దంతాలు గల గాడిదలు, ఆవులు, మేకలు, గొర్రెలు పుట్టాయి. దేవతలు విరాడ్రూపుని సంకల్పం చేసినప్పుడు అనేక విధాలుగా కల్పనలు చేశారు. ఆయన ముఖము నుండి బ్రాహ్మణులు. బాహువుల నుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు, మనసు నుండి చంద్రుడు, కనుల యందు సూర్యుడు, ముఖము నుంచి ఇంద్రుడు, అగ్ని, ప్రాణము నుంచి వాయువు, నాభి నుంచి అంతరిక్షము, శిరస్సు వలన స్వర్గలోకము, పాదముల నుంచి భూమి, చెవుల నుంచి దిశలు, లోకాలు ఉద్భవించినాయి.

సమస్త రూపాలను నిర్మించి, వాటికి పేర్లు పెట్టి, జగమంతటా వ్యాపించి ఉన్న ఆ విరాట్పురుషుడు  మహా అధికుడు. అతడు సూర్యుని కాంతిలా ప్రకాశిస్తాడు. ఈ రకంగా విరాట్పురుషుని తెలుసుకున్నవాడు జ్ఞానవంతుడై ఈ జన్మలోనే మోక్షము పొందుతాడు. దేవతలు మానస యజ్ఞంలో  విరాడ్రూపుని సృష్టించారు. అందుకే ఇతడికి ధర్మాలు ముఖ్యము.

నారాయణుడు నీటి నుంచి పుట్టాడు. ఆ నీటి నుంచే భూమి పుట్టింది. దీనికి కారకుడు పరమాత్మ. జగత్తుకు పరమేశ్వరుని అంశమైన విరాట్పురుషుడు యజమాని. అట్టి విరాట్పురుషునిచే మొదట సమస్త ప్రపంచము సృష్టించబడింది. ఇటువంటి పరమాత్మ

గొప్పవాడని, అజ్ఞానపు చీకట్లను పారద్రోలే వాడని తెలుసుకున్న వారు భూలోకంలోనే మోక్షము పొందుతారు. ప్రజాపతి పుట్టుకలేని వాడైనప్పటికీ, ఈ ప్రపంచంలో అనేక రూపాలుగా ఉద్భవిస్తాడు.

జ్ఞానులు ఆ పరమాత్మను తెలుసుకో గలుగుతున్నారు. దేవతల కోసం ప్రకాశించేవాడు, దేవతల పురోభివృద్ధిని కోరేవాడు, దేవతలకన్న పూర్వమే ఉన్నవాడు అయిన పరమాత్మకు నమస్కారము. "ఓ పరమాత్మా నిన్ను తెలుసుకో గలిగిన వారికి సమస్త దేవతలు వశులౌతున్నారు. లజ్జాదేవి, లక్ష్మీదేవి నీకు భార్యలు, అహోరాత్రులూ నీ పార్శ్వములు నక్షత్రాలు నీ రూపము. అశ్వనీ దేవతలు నీ నోరు. ఓ దేవా ! మేము కోరిన జ్ఞానాన్ని ప్రసాదించు. మాకు ఆత్మ జ్ఞానము కలుగ చెయ్యి. ఇహ పరాలు రెండూ మాకు అనుగ్రహించు' అని ప్రార్థించారు.

"ఈ విషయాన్ని పరిశీలించినట్లైతే నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరమాత్మ సర్వవ్యాపి. అన్ని వస్తువులు యందు ఉన్నాడు. ఈ సృష్టి అంతా పరమేశ్వరా మయమని తెలుస్తోంది" అన్నాడు రత్నాకరుడు



# 12. ఉపనిషత్తులు

ఆర్యా! ఉపనిసత్తులలో పరబ్రహ్మతత్త్వాన్ని వివరించటం జరిగింది కదా. మరి ఆ పరబ్రహ్మతత్త్వము ఏది ? దాని వివరించండి. అన్నాడు కృష్ణశర్మ. శిష్యుని కోరికను మన్నించిన వాడై ఉపనిషత్తుల గురించి చెప్పటానికి ఉపక్రమించాడు. రత్నాకరుడు.

బ్రహ్మవిద్యా పరిశీలకులైన వారికి కర్మ, జన్మ, మరణాలను లేకుండా చేసి ఆ జన్మ మరణాదికరమైన దానిని నశింప చేసేది, బ్రహ్మపదార్థ లాభాన్ని కలుగ చేసేది ఉపనిషత్తు, ఇవి వేదాలలోని చివరి భాగాలు. ఉపనిషత్తులు అనేక మున్నప్పటికీ వీటిలో ప్రసిద్ధమైనవి పది.

***ఈశ కేనకఠ ప్రశ్న ముండక మాండూక్యతిత్తిరి ।***
***ఐతిరేయం చ ఛాంధోగ్యం బృహదారణ్యకం దశ: ॥***

పరమేశ్వరుడు నిరాకారుడు. నిర్గుణ స్వరూపుడు. అతను ఈ రకంగా ఉంటాడని ఎక్కడా చెప్పబడలేదు. కాని దాదాపుగా ప్రతి ఉపనిషత్తులోనూ పరబ్రహ్మతత్త్వం వివరించబడింది. దశోపనిషత్తులలో కొన్నింటిని ఇక్కడ ఉదహరించటం జరిగింది.

## సృష్టి పరమేశ్వరమయం (ముండకోపనిషత్తు)

శునకుని కుమారుడు శౌనకుడు. ఒకరోజు అంగిరసుని వద్దకు వచ్చి "ఆర్యా ! ఏ విషయాన్ని తెలుసుకున్నట్లైతే అన్ని విషయాల గురించి తెలుస్తుందో, దాన్ని నాకు వివరించండి అన్నాడు. అప్పుడు అంగిరసుడు వేదంలోని పర, అపర అనే రెండు విద్యల గురించి శౌనకునకు విపులంగా చెప్పాడు. పరా విద్యలో భాగంగా బ్రహ్మనుండే చరాచర జగత్తు అంతా పుట్టింది. అని చెబుతూ.

శౌనకా । ప్రజ్వరిల్లిన అగ్ని నుండి అదే విధమైన ఆకారము, గుణము కల వేలకొలది నిప్పురవ్వలు వెలువడుతున్నట్లే, పరబ్రహ్మ నుండి అనేకమైన శరీరాలు, రూపాలు వెలవడి మళ్ళీ అందులోనే లీనమైపోతున్నాయి. పరబ్రహ్మ స్వయం ప్రకాశంకలవాడు నిరాకారుడు. బాహ్యాభ్యంతరాల్లో ఉండే వాడు. పుట్టుక, ప్రాణము, మనస్సు, లేనివాడు పరిశుద్ధమైనవాడు. మాయకు అతీతుడు. అతడి నుండే ప్రాణము, మనస్సు, సమస్త ఇంద్రియాలు, పంచభూతాలు పుడుతున్నాయి. ఈ పరబ్రహ్మకు అగ్ని శిరస్సు, సూర్యచంద్రులు నేత్రాలు దిక్కులే చెవులు. వేదాలు వాక్కు, వాయువు ప్రాణం, జగత్తే అతని హృదయం. అతని పాదాల నుండి భూమి

పుట్టింది. అతడే సమస్త భూతాల్లోనూ ఉండే అంతరాత్మ. ఆ పరబ్రహ్మ నుంచే అగ్నిపుడుతోంది. ఆ అగ్నికి సూర్యుడు సమిధ. చంద్రుని వల్ల మేఘాలు, మేఘాల వల్ల ఓషధులు, అన్నం పుడుతున్నాయి. అన్నం వల్ల పుట్టిన వీర్యాన్ని పురుషుడు స్త్రీలో ఉంచుతున్నాడు. ఈ విధంగా విశ్వమంతా ఆ పరమేశ్వరుని నుంచే పుడుతోంది.

ఆ పరమేశ్వరుని నుంచే చతుర్వేద మంత్రాలు పుట్టినాయి. మౌంజీ బంధనాది దీక్షలు, అగ్ని హోత్రాది యజ్ఞాలు, దక్షిణలు, యజ్ఞాలకు కాలప్రమాణము, సూర్య చంద్ర లోకాలు, ఉత్తరాయణ, దక్షిణాయన మార్గాలు పుట్టాయి. అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు పుట్టారు. కర్మాధికారం గల మానవులు పుట్టారు. పశువులు, పక్షులు, ఉఛ్వాసనిశ్వాసలు, ధాన్యాలు, పురుషార్థాలు సాధించటానికి వీలైన తపస్సు, శ్రద్ధ, మితభాషణ, హితభాషణ, అష్టవిధ మైధునాలను త్యజించటం ద్వారా ఆచరించే బ్రహ్మచర్యం పుట్టాయి.

పరబ్రహ్మ నుండే సప్తప్రాణాలు (కళ్ళు - 2, ముక్కులు - 2,చెవులు - 2, నోరు - 1) పుట్టినాయి. శరీరంలో సంచరిస్తూ వాటికి విషయాలైన ఏడు జ్వాలలు, ఇంద్రియ విషయాలరూపంలో ఉండే ఏడు సమిధలు, విషయ జ్ఞాన స్వరూపమైన ఏడు ఆహుతులు, ఏడు ప్రాణాలు సంచరించే ఆస్థానాలు, ఇవన్నీ పరమేశ్వరుని నుంచే పుట్టాయి. సప్తసముద్రాలు, పర్వతాలు, నదులు, వివిధ రకాల ధాన్యాలు. షడ్రుచులు, పుట్టాయి.

సమస్త ప్రపంచము, అగ్నిహోత్రాది కర్మలు, జ్ఞాన రూపమైన తపస్సు అన్నీ అతని రూపమే. వీటన్నింటిలోనూ పరమేశ్వరుడున్నాడు. సమస్త ప్రాణుల హృదయాల్లోనూ ఉన్నాడు. సూర్యాది గ్రహాలను ప్రకాశింప చేసేది ఆ పరబ్రహ్మమే. అదే ప్రాణం, అదే వాక్కు, అదే మనస్సు, అదే సత్యము నిత్యము అమృత మయమై ఉన్నది.

పై విషయాలను పరిశీలించినట్లైతే చరాచర జగత్తు అంతా పరమేశ్వరుని వల్లనే సృష్టించబడింది. పరమేశ్వరుడు అన్ని వస్తువుల యందు వ్యాపించి ఉన్నాడు. సృష్టి అంతా పరమేశ్వర మయము అని తెలుస్తోంది.

## సృష్టి (ఐతరేయోపనిషత్తు)

జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే. మరణానంతరము మానవుని జీవాత్మ పరమాత్మలో లీనమైపోతుంది. ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తు అంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమిలేదు. దాన్నే ఆత్మ అనికూడా అంటారు. ఆ ఆత్మయే లోకాలను

సృష్టించాలనుకుంది. కొంత కాలానికి ఆత్మ అంభస్సు, మరీచి, ఆపః, మర అనే పేర్లు గల లోకాలను సృష్టించింది. ద్యులోకానికి అవతల ఉన్నది అంభస్సు. దానికి ఆశ్రయము స్వర్గము. అదే సువర్లోకము. దాని కింద భువర్లోకమున్నది. దాని కింద భూలోకమున్నది. ఇది మరము. అంటే మరణము గుణముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిప్రాణీ మరణిస్తుంది. భూలోకానికి క్రింద జలలోకమున్నది. అది క్రిందనున్న లోకాలచే పొందబడుచున్నది కాబట్టి ఆపోలోక మనబడుతుంది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించేబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత "ఈ లోకాలను రక్షించే వాళ్ళు లేకపోతే అవి నాశనమై పోతాయి. కాబట్టి లోపాలకులను సృష్టించాలి" అని ఆలోచించి, పంచభూతాలలోనూ ప్రధానమైన దైన జలాన్ని తీసుకుని దానితో అవయవాలు గల ఒక మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే "విరాట్స్వరూపము". ఇక ఇంద్రియాధిష్టాన దేవతా సృష్టి ఏవిధంగా జరిగింది అంటే....

పరమాత్మ ఈ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగా విరాట్స్వరూపానికి నోరు వచ్చింది. ఆ నోటి నుండి మాట, మాట నుండి వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటి నుండి ప్రాణం ఉత్పన్నమైంది. అనగా వాసన చూసే శక్తి పుట్టింది. ఆ ఘ్రాణశక్తి నుండి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు ఏర్పడ్డాయి. వాటి నుండి సూర్యుడు ఉద్భవించాడు.

తరువాత చెవులు, వాటి నుండి దిక్కులు ఏర్పడ్డాయి. ఆ తరువాత చర్మం, దాని నుండి స్పర్శకు కారణమైన రోమాలు ఏర్పడ్డాయి. చర్మము నుండే ఓషధులు, వనస్పతులు పుట్టినాయి. ఆ తరువాత హృదయం, దాని నుండి మనస్సు, దాని నుండి చంద్రుడు పుట్టారు. తరువాత నాభి, దాని నుండి అపానము, దాని నుండి మృత్యువు ఉద్భవించాయి. ఆ తరువాత పురుష జననేంద్రియము, దాని నుంచి వీర్యము, దానికి అధిష్ఠానమైన జలము పుట్టాయి. ఈ రకంగా విరాట్స్వరూపుని అవయవాల నుండి ఇంద్రియాలు వాటి నుండి అభిమాన దేవతలు పుట్టారు.

ఈ విధంగా పరమేశ్వరునిచే లోకపాలకులుగా సృష్టించబడ్డ అగ్ని మొదలైన ఇంద్రియాభిమానులైన దేవతలు అవిద్యతో కూడిన మహా సముద్రంలో పడ్డారు, దానికి అంతం లేదు. అది ఇంద్రియాల వల్ల కలిగే క్షణిక సుఖాలతో కూడి ఉంటుంది.

పరమేశ్వరుడు ఆ విరాట్స్వరూపానికి ఆకలి దప్పికలు కలిగేలా చేశాడు. అప్పుడు ఇంద్రియాభిమానులైన దేవతలందరూ "మేము కూర్చుని భుజించేటందుకు వీలుగా, మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని" వేడుకున్నారు. ఆకలి తీరాలంటే ఆహారం కావాలి. అన్ని ఇంద్రియాలకూ ఆహారం అన్నమే కాదు. వాటి ఆహారము వేరు వేరుగా ఉంటుంది.

అప్పుడు దేవతల కోసం పరమేశ్వరుడు ఆవును సృష్టించాడు. దేవతలు ఇది మాకు సరిపోదు అన్నారు. గుర్రాన్ని సృష్టించాడు. అదీ చాలదన్నారు. అప్పుడు విరాట్ స్వరూపాన్ని పోలిన పురుష శరీరాన్ని సృష్టించాడు. దాన్ని చూసిన దేవతలు ఇది చాలా బాగుంది అని సంతసించారు. భగవంతుని ఆజ్ఞానుసారం దేవతలంతా వారి వారి స్థానాల్లో ప్రవేశించారు. అంటే అగ్ని వాగ్రూపం ధరించి ఆ పురుషుని నోటిలో ప్రవేశించాడు. వాయువు ప్రాణరూపంతో ముక్కునందు, సూర్యుడు దృష్టి రూపంతో నేత్రాలలో, దిక్కులు చెవులయందు, ఓషధులు, వనస్పతులు చర్మమునందు, చంద్రుడు మనోరూపం దాల్చి హృదయంలోను, మృత్యువు అపాన రూపం దాల్చి నాభియందు, జలం వీర్య రూపం దాల్చి జననేంద్రియమందు ప్రవేశించాయి. ఈ రకంగా దేవతలందరూ వెళ్ళిపోగా ఇంకా మిగిలినవి ఆకలి దప్పికలు. వీరిద్దరినీ పరమేశ్వరుడు దేవతలందరిలోనూ భాగస్వాములుగా చేశాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా వాటిలో ఆకలి దప్పికలకు కూడా భాగం కలుగుతుంది. కంటికి ఆకలి దప్పికలంటే చూడాలనే కోరిక చెవులకు వినాలనే కోరిక.

ఈ రకంగా ఇంద్రియాలను, వాటి అధిష్ఠాన దేవతలను సృష్టించిన తరువాత అన్నము సృష్టించవలసిన అవసరం వచ్చింది. అప్పుడు జలం నుంచి ఆహారం సృష్టించాడు. అదే అన్నము.

ఆ విధంగా దేవతల కోసము సృష్టించబడ్డ అన్నము దేవతలను చూసి వారు తన పాలిట మృత్యుదేవతలని తలపోసి పారిపోసాగింది. అప్పుడు ఆ ఆది పురుషుడు అన్నాన్ని తన ఇంద్రియాలైన వాక్కు, చక్షువు మొదలై వాటితో పట్టుకోవాలనుకున్నాడు. కాని వీలుకాలేదు. చివరకు అన్నాన్ని అపానంతో గ్రహించగలిగాడు. నోటితో లోపలికి పీల్చబడే వాయువే అపానము. ఇదే అన్నాన్ని గ్రహిస్తుంది.

ఇప్పుడు పరమేశ్వరుడు ఇంద్రియాలతో కూడిన మానవ శరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. దానికి రెండు మార్గాలున్నాయి. 1) పాదాల చివర నుంచి 2) శిరస్సు నుంచి. సృష్టికర్త అయిన పరమేశ్వరుడు శిరస్సులోని బ్రహ్మరంధ్రం ద్వారా మానవ దేహంలో

ప్రవేశించాడు. ఈ మార్గం ద్వారానే పరమేశ్వర దర్శనం కూడా కలుగుతుంది. అందుకే ఇది ఆనందకరమైనది.

పై విషయాలను పరిశీలించినట్లైతే పరమాత్మయే చరాచర జగత్తునూ సృష్టించాడు. అతడే మానవులను కూడా సృష్టించి, బ్రహ్మరంధ్రం గుండా మానవ శరీరంలో ప్రవేశించి విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు . కాబట్టి చరాచర జగత్తు, విశ్వమానవాళి అంతా కుడా పరబ్రహ్మ స్వరూపమే అని తెలుస్తోంది.

## వెలుగుల కవ్వలి వెలుగు (బృహదారణ్యకోపనిషత్తు)

యాజ్ఞవల్క్య మహర్షి ఒకనాడు జనక మహారాజు ఆస్థానానికి వచ్చాడు. జనక మహారాజుకు ఎప్పుడు ఎలాంటి అనుమానం వచ్చినా, తీరుస్తానని గతంలో యాజ్ఞవల్క్యుడు మాట ఇచ్చాడు. మహర్షికి సాదర సత్కారాలు చేసి జనక మహారాజు ఈ విధంగా అడుగుతున్నాడు.

"మహాత్మా ! మానవులు ఏ వెలుగు సహాయంతో నిత్య కృత్యాలు నెరవేర్చుకుంటున్నారు?"

"జనక రాజా! మానవులంతా సూర్యుని వెలుగు వల్ల పనిపాటలు చేసుకుంటారు. దూర తీరాలకు వెడుతుంటారు. దగ్గరకు వస్తుంటారు. సూర్యకాంతిలో చెయ్యాలనుకున్న పనిచేస్తారు. వెళ్ళాలనుకున్న చోటికి వెడతారు. తిరిగి రావలసినచోటికి చేరతారు. ఈ విధంగా పనులన్నీ సూర్యుని కాంతిలో జరుగుతాయి."

"మహర్షీ ! సూర్యాస్తమయం జరిగినప్పుడు ఏమవుతుంది."?

"సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రుని కాంతులలో మానవులు తమపనులు చేసుకుంటారు.

"గురువర్యా ! మరి చంద్రుడు కూడా లేనప్పుడు ఏమవుతుంది ?"

"రాజా ! అగ్నివల్ల, దీపం వల్ల అన్ని వ్యవహారాలునడుస్తాయి."

"మహానుభావా ! సూర్యుడు అస్తమించాడు. చంద్రుడు అదృశ్యుడైనాడు. అగ్నిచల్లారి పోతుంది. దీపం ఆరిపోతుంది. అప్పుడు వ్యవహారాలు ఏవిధంగా జరుగుతాయి?"

"రాజా ! వెలుగు స్థానంలో వాక్కు వ్యవహారానికి సహకరిస్తుంది. కళ్ళు కనిపించని చిమ్మ చీకటిలో, ఏదైనా ధ్వని వినిపిస్తే, అటువైపుకు సాగిపోతాడు మానవుడు."

"మహర్షీ ! మరి వాక్కు కూడా స్తంభించి పోయినట్లైతే ఏం జరుగుతుంది ?"

"జనక మహారాజా। శబ్దం కూడా సద్దుమణిగిన తరువాత స్థితిని గురించి అడుగుతున్నావు. ఈ వెలుగు లన్నిటికీ అవతల ఆత్మజ్యోతి ప్రకాశిస్తుంటుంది. అదే అన్ని వెలుగులకూ వెలుగు." అన్నాడు యాజ్ఞవల్క్యుడు. జనకమహారాజు సందేహం కూడా తీరిపోయింది.

పై విషయాలు గనక పరిశీలించినట్లైతే జగత్తులోని వెలుగుల కన్నింటికీ వెలుగును ప్రసాదించేది ఆత్మ. అదే పరమాత్మ స్వరూపం, ఆ పరమాత్మ వల్లనే ఈ జగత్తులోని కార్యకలాపాలన్నీ జరుగుతున్నాయి.

## అన్నం నుంచి ఆనందానికి (తైత్తిరీయం)

వరుణ మహర్షి కుమారుడు భృగు మహర్షి. విద్యాభ్యాసం పూర్తి చేసి బ్రహ్మ జ్ఞానం పొందాలనే కోరికతో తండ్రి దగ్గరకు వెళ్ళి బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి తండ్రి "కుమారా ! అన్నము, ప్రాణము, నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు మొదలైనవన్నీ పరబ్రహ్మ సాధనకు మార్గాలే. వీటన్నింటిలోనూ బ్రహ్మతత్త్వము ఇమిడి ఉంది. అది దేనిలోంచి ఉత్పన్నమైందో, దేనితో పోషింపబడుతున్నదో, దేని యందు లయమవుతున్నదో, అన్నింటికీ మూల వస్తువు ఏదో తెలుసుకోవాలి. దాన్ని తపస్సు ద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

తండ్రి ఉపదేశాన్ని అనుసరించి దీక్ష తీసుకుని నియమ నిష్ఠలతో తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు భృగుమహర్షి. ఇలా కొంత కాలం జరిగింది. ఆ తరువాత అన్నమే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. అన్నం మూలంగానే అన్ని ప్రాణులూ ఉత్పత్తి అవుతున్నాయి. పుట్టిన ప్రాణులన్నీ అన్నం వల్లనే పోషింపబడుతున్నాయి. అన్నం భూమి నుంచే ఉత్పత్తి అవుతోంది. మరణించిన తరువాత కూడా ప్రాణులన్నీ ఈ భూమిలోనే కలిసి పోతున్నాయి. కాబట్టి అన్నమే పరబ్రహ్మ స్వరూపం. ఈ విషయాన్ని తండ్రికి తెలియ చేశాడు భృగువు. దానికి వరుణ మహర్షి "నాయనా ! బ్రహ్మతత్త్వ సాధనలో నీవు మొదటి మెట్టు మీదనే ఉన్నావు. ఇంకా సాధన చెయ్యాలి" అన్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యటం మొదలు పెట్టాడు భృగువు. ఇంకొంత కాలం గడిచింది. ప్రాణమే బ్రహ్మ అనే విషయాన్ని అర్థం చేసుకున్నాడు. లోకంలోని సమస్త జీవరాసులు ప్రాణం వల్లనే జీవిస్తున్నాయి. ఇవన్నీ ప్రాణం వల్లనే రక్షించబడుతున్నాయి. ఆ ప్రాణం పోయినప్పుడు మృత్యువులో లయమై పోతున్నాయి. అందుచేత ప్రాణమే సర్వసృష్టికీ మూలాధారము అని భావించాడు. ఇదే విషయాన్ని తండ్రికి

వివరించాడు. "నాయనా ! ఇది వరకటి కన్న కొంచెం ముందుకు వెళ్ళావు. అంతేకాని ప్రాణమే బ్రహ్మకాదు. ఇంకా తపస్సు చెయ్యి వెళ్ళు." అన్నాడు వరుణ మహర్షి.

భృగువు మళ్ళీ తపస్సు చెయ్యటం ఆరంభించాడు. కొంత కాలం జరిగింది. మనస్సు వల్లనే ప్రాణులు ఉత్పన్నమవుతున్నాయి. స్త్రీ పురుషులు మనసు చేతనే ఆకర్షితులౌతున్నారు. అందువల్లనే ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. జన్మించిన తరువాత కూడా ఇంద్రియాల సాయంతోనే జీవనం సాగుతున్నది అదే విధంగా చనిపోయిన తరువాత కూడా ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి పోతుంది. అవన్నీ మనస్సులో లీనమవుతాయి. కాబట్టి మనస్సే బ్రహ్మ అనుకున్నాడు భృగువు. అదే విషయాన్ని తండ్రికి తెలియ చేశాడు. కాదన్నాడు తండ్రి. ఇంకా తపస్సు చెయ్యమన్నాడు.

మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు అతడికి అర్థమయింది విజ్ఞానమే బ్రహ్మస్వరూపము అని తండ్రికి తెలియచేశాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. అప్పుడు తెలిసిందతడికి ఆనందమే పరబ్రహ్మ స్వరూపము అని, సర్వమూ ఆనందం నుంచే జనిస్తుంది. ఆనందంలోనే లయం అవుతుంది. ఈ విషయం తండ్రికి తెలియ చేశాడు. మహదానందం చెందాడు వరుణ మహర్షి. అప్పుడు చెప్పాడు. "కుమారా ! అన్నింటి కన్నా ఉత్తమంగా పరమాత్మ తత్త్వాన్ని స్పష్టం చేసే తత్త్వం ఆనందం. అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము కూడా బ్రహ్మ స్వరూపాలే. కాని, ఇవి ఒకదాని కన్న మరకొటి ఇంకా సూక్ష్మమైనవి. అన్నింటినీ మించినది ఆనందము. ఈ ఆనందము క్షణికమైనది కాదు. శాశ్వతమైనది. పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. అంటే ఒక్కొక్క మెట్టు పైకి వెళ్ళాలి. అందుకే అన్నాన్ని ఎప్పుడూ నిందించరాదు. ప్రాణము, మనస్సు అన్నీ అన్నం మీదనే ఆధారపడి ఉన్నాయి. అందుకే అన్నాన్ని నిర్లక్ష్యం చెయ్యరాదు. అయితే మానవుడు తినటం కోసమే జీవించరాదు. జీవించటం కోసం మాత్రమే తినాలి. అన్నాన్ని నియమ ప్రకారమే స్వీకరించాలి. అన్నాన్ని పూజిస్తే తరువాత వన్నీ లభిస్తాయి. అందుకని ఆహారాన్ని వదలకుండా, ప్రాణాన్ని నిలుపుకుంటూ, మనసును వికసింప చేసుకుని, విజ్ఞానానుభవం నుండి బ్రహ్మానందం పొందాలి". అని బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశించాడు.

పై విషయాన్ని పరిశీలించినట్లైతే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాల మధ్య ఆనందమయ కోశమందు పరబ్రహ్మ ఉంటుంది. శాశ్వతమైన ఆనందమే బ్రహ్మతత్త్వము అని తెలుస్తుంది.

# బ్రహ్మచారి (ఛాందోగ్యోపనిషత్తు)

పూర్వకాలంలో వేదవేదాంగ వేత్తలు, సర్వశాస్త్ర కోవిదులు అయిన శౌనకుడు, అభిప్రతారి అని ఇద్దరు ఋషులుండే వారు. వాయుదేవుడు, వీరి ఆరాధ్యదేవత. వీరు విధి విధానంగా, శాస్త్ర సమ్మతంగా నియమ నిష్టలతో వాయుదేవుణ్ణి ఆరాధించే వాళ్ళు. ఒకరోజు దైనందికార్యక్రమాలు ముగించుకుని అపరాహ్ణం వేళకు భోజనానికి కూర్చున్నారు. ఆ సమయంలో బయట తలుపు ఎవరో తట్టిన శబ్దమయింది. తలుపు దగ్గర ఒక బ్రహ్మచారి నిలబడి ఉన్నాడు. తలుపు తియ్యగానే "భవతీ బిక్షాం దేహి", అన్నాడు. "భోజనం చెయ్యబోతున్నాము. బిక్షకు ఇది సమయం కాదు. వెళ్ళు" అన్నారు లోపలి ఋషులు. బ్రహ్మచారి పది ఇళ్ళలో భిక్షాటన చేస్తుంటాడు. ఒకచోట భిక్షవేస్తారు. ఇంకొక చోట వెయ్యరు. కాబట్టి భిక్షపెట్టక పోవటం అతనికి కొత్త ఏమీకాదు. కాని ఋష్యాశ్రమంలో ఇలా జరగటమే అతడికి వింత అనిపించింది. అంత తేలికగా ఆ ఆశ్రమాన్ని విడిచి వెళ్ళదలుచుకోలేదు బ్రహ్మచారి వెంటనే అతడు ఋషులను ఉద్దేశించి."ఆర్యా ! తమ ఉపాసనా దేవత ఎవరు ?" అన్నాడు. అప్పుడు శౌనకుడు "నువ్వు పొమ్మంటే పోవటం లేదు. చాలా మొండి వాడిలా ఉన్నావు సరే అడిగావు కాబట్టి చెబుతున్నాను. మా ఉపాసనా దైవం వాయువు. ఆయనకు ఇంకొక పేరు ప్రాణం" అన్నాడు. దానికి ఆ వటువు

"స్వామీ ! ఈ ప్రపంచం యావత్తూ ప్రాణం వల్లనే రూపుదాల్చింది. తిరిగి సృష్టి అంతా ప్రాణంలోనే లయమవుతున్నది. కంటికి కనిపించే వాటిలోనూ, కనిపించని వాటిలోనూ కూడా ప్రాణమున్నదనే సంగతి మీకు తెలుసు గదా" అన్నాడు. దానికి శౌనకుడు.

"ఎందుకు తెలియదు . ఇప్పుడు నువు చెప్పినదంతా మాకు తెలిసినదే. అంతే కాని క్రొత్త విషయం ఏమీ కాదు" అన్నాడు. అప్పుడు బ్రహ్మచారి.

"ఆర్యా! ప్రస్తుతం మీరు అన్నం తినబోతున్నారు కదా ! మరి ఈ అన్నం ఎవరి కోసమని వండారు ? ఎవరికి నివేదన చెయ్యటానికి దీన్ని తయారు చేశారు ?" అన్నాడు.

"మేము ఆరాధించే వాయుదేవుడికి సమర్పించటానికి" అని టక్కున సమాధానమిచ్చాడు అభిప్రతారి.

"ప్రాణమనేది విశ్వమంతా వ్యాపించింది అని మీరు అంగీకరించారు. అదే మీరు ఆరాధించే దైవం. దానికి నివేదన చేసేందుకే అన్నం వండారు. విశాలమైన విశ్వంలో నేనూ

ఒక భాగమే కదా! నాలో కూడా ప్రాణం ఉన్నది కదా ! ఆకలిగొన్న ఈ బ్రహ్మచారి రూపంలో మీ ఆరాధనా దైవమైన వాయు దేవుడు భిక్ష మడుగుతున్నాడు. మీరు నాకు భిక్ష ఇవ్వటానికి తిరస్కరించటం వల్ల నాలో ఉన్న మీ ఆరాధనాదైవమైన ప్రాణాన్ని తిరస్కరించినట్లే కదా। అంటే మీరు ఎవరి కోసం అన్నం వండారో, ఆ దేవునికే ఆహారం సమర్పించటానికి వెనకాడుతున్నారు. మీలో ఉన్న పరమేశ్వరుడే నాలోనూ, ఈ అన్నంలోనూ కూడా ఉన్నాడు. పరబ్రహ్మ స్వరూపమైన అన్నం పెట్టమని పరబ్రహ్మ రూపమైన నేను, పరబ్రహ్మ రూపమైన మిమ్మల్ని అడుగుతుండగా మీరు ఎందుకు సందేహిస్తున్నారు?" అన్నాడు బ్రహ్మచారి.

అతడి మాటలు విని సిగ్గు చెందిన వారై ఋషులు బ్రహ్మచారిని సాదరంగా లోపలికి ఆహ్వానించి భోజనం పెట్టారు.

పై విషయాన్ని పరిశీలించినట్లైతే విశాలమైన ఈ విశ్వంలో ప్రాణము లేనివి, కంటికి కనిపించేవి, కంటికి కనిపించనివి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని అర్థమవుతుంది.

## సత్యకాముడు (ఛాందోగ్యోపనిషత్తు)

'జాబాలి' అనే పేరు గల స్త్రీ ఒక దాసి. యవ్వనంలో ఉండగా అనేక గృహాలలో పనిచేసింది. అప్పుడు ఆమెకు ఒక కుమారుడు కూడా కలిగాడు. కాలక్రమేణా జాబాలి కుమారుడు పెరిగి పెద్ద వాడయ్యాడు. కుమారుడు విద్యాభ్యాసం పూర్తి వేసి బ్రహ్మజ్ఞానము సముపార్జన చెయ్యాలనుకున్నాడు. ఆ రోజుల్లో గౌతమ మహర్షి వేదవేదాంగ విదుడు. బ్రహ్మ జ్ఞాన వేత్త. జాబాలి కుమారుడు మహర్షి వద్దకు వెళ్ళి నమస్కరించి విద్యను బోధించమని అడిగాడు. ఆ మాట విన్న గౌతముడు విద్యార్థిని చూసి, నీ తండ్రి ఎవరు ? గోత్రము ఏమిటి ? అనిగాడు. ఆ విషయాలు తనకు తెలియవని, తనతల్లిని అడిగి తెలుసుకుని వస్తానని చెప్పి ఇంటికి వెళ్ళి అమ్మా! నేను బ్రహ్మ చర్య దీక్ష తీసుకోవాలనుకుంటున్నాను. మన గోత్రం ఏమిటి ? నా తండ్రి ఎవరు ? ఈ వివరాలు నాకు తెలియ చెయ్యవలసింది.' ' అన్నాడు. అందు జాబాలి "నాయనా ! నేను యవ్వనంలో ఉండగా అనేక ఇళ్ళలో దాసిగా పనిచేశాను. అనేక చోట్ల తిరిగాను అనేక మందిని సేవించాను. నిన్నుకన్నాను. కాని నీ తండ్రి ఎవరో నాకు తెలియదు. అలాగే గోత్రం కూడా తెలియదు. కాని ఒక్కటి మాత్రం నిజం. నీ పేరు సత్యకాముడు. నా పేరు జాబాలి గురువర్యులకు ఇదే మాట చెప్పు" అన్నది.

ఆ మాటలు వన్ని సత్యకాముడు గౌతముడి దగ్గరకు వెళ్ళి తల్లి చెప్పిన మాటలు యధాతథంగా వివరించాడు. ఆ మాటలు విన్న గౌతముడు చాలా ఆనందించాడు. ఉన్నది

ఉన్నట్లుగా చెప్పినందుకు సత్యకాముణ్ణి, జాబిలిని కూడా పరిపరి విధాల ప్రశంశించి, సంప్రదాయ బద్ధంగా సత్యకాముడుకి బ్రహ్మ చర్య దీక్ష, ఇచ్చాడు, సత్యకాముడు బ్రహ్మచర్య దీక్ష స్వీకరించి ఆశ్రమవాసి అయ్యాడు.

ఆశ్రమంలో చాలా రోజులు గడిపాడు సత్యకాముడు. ఒక రోజు గౌతమ మహర్షి సత్యకాముణ్ణి పిలిచి నాలుగు వందలు చిక్కిపోయిన, వట్టి పోయిన ఆవులను ఆబోతులను వొప్పచెప్పి "సత్యకామా ! వీటిన్నింటినీ తోలుకు వెళ్ళి జాగ్రత్తగా కాపాడు. వీటి సంఖ్య వేయి అయ్యేవరకూ తిరిగిరాకు" అన్నాడు.

గురువు దగ్గర విద్యనభ్యసించటానికి మూడు మార్గాలున్నాయి. అవి.

***గురు: శుశ్రూషయా విద్యా, పుష్కలేన ధనేనవా।***
***అథవావిద్యయా విద్యా, చతుర్థో నో పలభ్యతే॥***

1. గురువకు సేవచేసి విద్యను నేర్చుకోవటము.

2. గురువుకు తగినంత ధనమిచ్చి విద్యను నేర్చుకోవటము.

3. తనకు వచ్చిన విద్యను గురువుకు నేర్పి, అతని దగ్గర నుండి విద్యను పొందటము.

వీటిలో మొదటి మార్గాన్ని అనుసరిస్తున్నాడు సత్యకాముడు. గురువుగారు చెప్పిన పని ఎంత కష్టమైనదైనా సరే చేసి, గురువును తృప్తి పరచటం. దీని ప్రకారం సత్యకాముడు గురువుగారి ఆజ్ఞప్రకారము గొల్లవాని వలె పశువులను తోలుకుని అరణ్యానికి వెళ్ళాడు. ఆవులను మేపుతూ అరణ్యంలోనే కాలం వెళ్ళ బుచ్చుతున్నాడు.

ఇలా చాలా ఏళ్ళు గడిచినాయి. సత్యకాముడు బ్రహ్మజ్ఞానం కోసం పరితపిస్తూనే ఉన్నాడు. అరణ్యంలో కనిపించే ప్రతి వస్తువూ, ప్రతి దృశ్యమూ అతడికి ఏదో ఒక పాఠం చెబుతూనే ఉంది. పశువుల సంఖ్య గణనీయంగా పెరిగింది. ఒకనాడు సత్యకాముడు అరణ్యంలో చెట్టుక్రింద దీర్ఘాలోచనలో నిమగ్నుడై ఉన్న సమయంలో ఒక ముసలి ఆబోతు అతడి దగ్గరకు వచ్చి సత్యకామా ! నీవు గురువు గారి దగ్గరకు తిరిగి వెళ్ళే సమయం ఆసన్నమైంది. నీ కర్మ కూడా పరిపక్వమైంది. బ్రహ్మజ్ఞానాన్ని గురించి చెబుతాను వినవలసినది. బ్రహ్మతత్త్వ విజ్ఞానము, నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో ఒక పాదాన్ని నీకు వినిపిస్తాను" అంది. సరే అన్నాడు సత్యకాముడు.

ముసలి ఆబోతు మళ్ళీ చెప్పటం మొదలు పెట్టింది." సత్యకామా ! ఈ విశాల విశ్వంలో నాలుగు దిక్కులూ, బ్రహ్మతత్త్వంలో ఒక భాగము. రెండవ భాగాన్ని అగ్ని దేవుడు ఉపదేశిస్తాడు.

సత్యకాముడు గౌతముని ఆశ్రమానికి తిరిగి ప్రయాణం కట్టాడు. త్రోవలో సంధ్యా సమయం అయింది. చీకట్లు ఆవరిస్తున్నాయి. సత్యకాముడు నిప్పు అంటించి దాని ఎదురుగా కూర్చున్నాడు. అప్పుడు ఆ అగ్ని నుంచి సందేశం విన వచ్చింది. "ఓ సత్యకామా! బ్రహ్మతత్త్వాన్ని గురించిన రెండో పాదం వివరిస్తున్నాను. భూమి, ఆకాశము సముద్రాలు, నదులు, సర్వతాలు అన్ని బ్రహ్మ పదార్థంలోని అంతర్భాగాలే. మూడవ పాదాన్ని ఒక హంస వివరిస్తుంది.

ఈ మాటలు విన్న సత్యకాముడు బ్రహ్మతత్త్వాన్ని గురించి ఆలోచిస్తూ ముందుకు సాగిపోతున్నాడు. మూడవ నాడు సాయంత్రం మళ్ళీ నిప్పు అంటించాడు. ఆ సమయంలో ఒక హంస ఎగిరి వచ్చి అతని సమీపంలో వాలి ఇలా చెప్పటం మొదలు పెట్టింది. "కుమారా । బ్రహ్మతత్త్వంలో మూడో పాదాన్ని నీకు వివరిస్తున్నాను. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలోని భాగాలే. నాల్గవ రోజు సాయంత్రం ప్రార్థనా సమయంలో ఒక నీటి పక్షి వచ్చి సత్యకాముడి దగ్గర వాలి, తన సందేశాన్ని వినిపించటం మొదలుపెట్టింది. సత్యకామా ! బ్రహ్మతత్త్వాన్ని గురించిన నాల్గవ పాదాన్ని నీకు వివరిస్తున్నాను. జాగ్రత్తగా వినవలసినది. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ."

సత్యకాముడు గౌతమ మహర్షి ఆశ్రమం చేరుకొని మహర్షికి నమస్కరించాడు. గౌతముడు శిష్యుని ముఖం చూడగానే ఆనందంతో "సత్యకామా ! నీ ముఖం బ్రహ్మ జ్ఞాని వలె వర్చస్సుతో ప్రకాశిస్తున్నది. నీకు బ్రహ్మతత్త్వం ఎవరు చెప్పారు ? అన్నాడు. దానికి సత్యకాముడు "స్వామీ ! మానవేతరములైన జీవరాశుల వల్ల బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోగలిగాను. మీరు కూడా అనుగ్రహించండి. గురువర్యా । గురూపదేశం లేకపోతే విద్య ఫలించదు. అన్నాడు. ఆ మాటలకు గౌతముడు చాలా సంతోషించి సత్యకాముడికి సర్వ విజ్ఞానాన్నీ ఉపదేశించాడు.

పైన చెప్పిన విషయాలను బట్టి చూస్తే నాలుగు దిక్కులు, భూమి, ఆకాశము, నదులు,పర్వతాలు, సముద్రాలు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, విద్యుల్లతలు, ప్రాణము, దృష్టి, శ్రవణము, మనస్సు అన్నీ బ్రహ్మ మయమే అంటే, చరాచర జగత్తే పరబ్రహ్మ. విశ్వమానవాళి అంతా బ్రహ్మమయమే అని తెలుస్తుంది.

## ఉపకోశలుడు (ఛాందోగ్యోపనిషత్తు)

సత్యకామ జాబాలి విద్యాభ్యాసం పూర్తి చేసుకుని గృహస్థాశ్రమం స్వీకరించి గురుకులాన్ని స్థాపించి వేదవేదాంగ వేత్త, బ్రహ్మవిదుడు అని పేరు పొందాడు. అతడి దగ్గర ఉపకోశలుడు శిష్యరికం చేస్తున్నాడు. ఈ రకంగా పన్నెండు సంవత్సరాలు గడిచినాయి. దీక్షతో గురువుగారికి సపర్యలు చేసుకున్నాడు. అయినా గురువు గారి కటాక్ష వీక్షణాలు అతడి మీద ప్రసరించ లేదు. ఉపకోశలుడితో పాటు అనేక మంది శిష్యులు సత్యకాముడి దగ్గరకు వచ్చారు. వారి అర్హతలను బట్టి వారందరికీ ఉపదేశం చేసి పంపించేశాడు సత్యకాముడు. కాని ఉపకోశలుణ్ణి మాత్రం పట్టించుకోలేదు. అతడు ఆశ్రమం వదలి వెళ్ళటానికి గురువు గారి దగ్గర నుంచి అంగీకారం ఇంకా రాలేదు. గురుపత్ని కూడా ఉపకోశలుణ్ణి కనికరించమని గురువు గారిని వేడుకుంది. మౌనం వహించాడు, కాని మాట్లాడలేదు గురువుగారు.

ఒకరోజు ఏదో పని మీద గ్రామాంతరం వెడుతూ ఉపకోశలుణ్ణి పిలిచి ఆశ్రమ ప్రాంగణంలోని అగ్నులను జాగ్రత్తగా చూస్తుండమని చెప్పాడు. ఉపకోశలుడు విచారంలో మునిగి పోయాడు. ఆహార పానీయాలు కూడా విసర్జించాడు. చివరకు రోగగ్రస్తుడు కూడా అయినాడు. అది చూసి గురుపత్ని చాలా బాధ పడింది. పుత్రవాత్సల్యంతో ఆహారం తీసుకోమని బ్రతిమాలింది. దానికి ఉపకోశలుడు "తల్లీ । నా హృదయం ఇంకా పవిత్రం కాలేదు. అందుకే గురువుగారు నన్ను ఇంకా పరీక్షిస్తున్నారు. నా హృదయంలో ఇంకా అనేకమైన దుఃసంకల్పాలుండి ఉంటాయి. నేను అన్నం ముట్టను" అన్నాడు. అతని బాధకు ఆశ్రమంలోని అగ్నులు కూడా చలించి పోయాయి. ఆ తరువాత తమలో తాము" ఈ బ్రహ్మచారి అనేక సంవత్సరాలుగా దీక్షని అవలంచిస్తున్నాడు. తపస్సు ఆచరిస్తున్నాడు. మనలను ఆరాధిస్తున్నాడు. శాస్త్రోక్తంగా తృప్తిపరుస్తున్నారు. గురువుగారు అతడికి ఉపదేశం చెయ్యటం లేదు. పదండి మనమే ఉపదేశం చేద్దాం" ఇలా అనుకుని ఉపకోశలుని దగ్గరకు బయలుదేరి ఉపకోశలుడికి ఒక సందేశమిచ్చాయి. "ఉపకోశలా ! ప్రాణమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ, ఆనందమే బ్రహ్మ". అది విన్న ఉపకోశలుడు "నాకు గతంలో ప్రాణమే బ్రహ్మ అని తెలుసు. కాని ఆనందము, ఆకాశము బ్రహ్మమయమని తెలియదు" అన్నాడు. అప్పుడు అగ్నులు హృదయాకాశాన్ని గురించి వివరిస్తూ హృదయ మందే బ్రహ్మతత్త్వముంటుంది. ఆనందము ఆ తత్త్వము యొక్క నిజస్వరూపము. అన్నాయి. అప్పుడు వాటిలో ఒక అగ్ని "భూమి, సూర్యుడు చంద్రుడు, ఆ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే సూర్యునిలో ఉన్న

బ్రహ్మతత్త్వం, నీలో ఉన్న బ్రహ్మతత్త్వం ఒక్కటే తూర్పు, పడమర, ఉత్తర దక్షిణాలు, నక్షత్రాలు, నీరు, నింగిలలో ఉన్న తత్త్వం, నీలో ఉన్న బ్రహ్మతత్త్వ ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నాలోనూ ఉన్నది. చరాచర జగత్తు అంతా వ్యాపించింది ఆ తత్త్వమే. అదే బ్రహ్మతత్త్వము. ఈ తత్త్వాన్ని అర్థం చేసుకుని బాధలను దూరం చేసుకో' ' అన్నది.

ఆ తరువాత గృహస్థులు ఆరాధించే గార్హ్యపత్యాగ్ని ఒక రూపాన్ని పొంది అంతటా వ్యాపించి బ్రహ్మతత్త్వాన్ని పొంది అతనికి కనిపించింది. ఆ సమయంలో సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, నక్షత్రాలు, విద్యుల్లతలు ఒకటేమిటి ? జగత్తు అంతా అతడికి అగ్నిరూపమై బ్రహ్మరూపమై, సాక్షాత్కరించింది.

గ్రామాంతరం వెళ్ళిన సత్యకాముడు తిరిగి ఆశ్రమానికి వచ్చి అలవాటు ప్రకారం ఉపకోశలుణ్ణి పిలిచాడు. చెంతకు చేరిన శిష్యుని ముఖం చూడగానే ఆశ్చర్యపోయాడు. అతడి ముఖం బ్రహ్మతేజస్సు వెదజల్లుతున్నది. అప్పుడు "ఉపకోశలా నీ ముఖం బ్రహ్మనుభూతిని పొందిన వాడిలాగా ప్రకాశవంతంగా ఉన్నది. బ్రహ్మతత్త్వాన్ని గురించి నీకెవరు చెప్పారు ?" అన్నాడు. జరిగిన విషయమంతా వివరించాడు ఉపకోశలుడు. పరమానందభరితుడైన సత్యకాముడు తనకు తెలిసిన బ్రహ్మజ్ఞానం అంతా ఉపకోశలుడికి వివరించి అతణ్ణి ధన్యుణ్ణి చేశాడు.

ఇంతవరకూ చెప్పి దాన్ని బట్టి చూస్తే ప్రాణమే బ్రహ్మ. ఆకాశమే బ్రహ్మ భూమి, సూర్యుడు, చంద్రుడు, అందరూ పరబ్రహ్మరూపాలే. సూర్యునిలో ఉన్న తత్త్వము, అగ్నిలో ఉన్న తత్త్వము ఒక్కటే. నాలుగు దిక్కులు, నక్షత్రాలు, నేల, నీరు, నింగి వీటిలో ఉన్న తత్త్వము అగ్నిలో ఉన్న తత్త్వమూ ఒకటే. మెరుపులో ఉన్న తత్త్వమే సూర్యునిలోనూ ఉంది. అదే అగ్నిలోనూ ఉంది. చరాచర జగత్తు అంతా వ్యాపించి ఉన్నది. చరాచర జగత్తు అంతా పరబ్రహ్మ రూపమే.

## ఉమాదేవి (కేనోపనిషత్)

ఒకసారి దేవదానవులకు భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాక్షసులను నిర్జించి దేవతలు విజయం సాధించారు. అయితే ఆ విజయం తమ శక్తి యుక్తుల వల్లనే సాధ్యపడింది అని బాగా గర్వించి తమ విజయానికి నిజంగా కారణమైన పరబ్రహ్మ తత్త్వాన్ని

మరచి పోయారు. అహంకారంతో ఈ విజయం తమదిగా భావించారు. "శత్రువులను సమూలంగా నాశనం చేసింది మేమే. ఈ విజయం మాదే" అని విర్రవీగారు. అగ్ని దేవుడు తన వీరవిహారాన్ని వివరిస్తూ "నేను ఉవ్వెత్తున అగ్ని శిఖలు వ్యాపింప చేస్తుంటే, వాటి తాకిడికి రాక్షసులు భస్మీపటలం అయిపోయారు" అన్నాడు. వాయువు "నేను చండ ప్రచండమైన వేగంతో సుడిగాలులు వీస్తుంటే, రాక్షసులు ఆ గాలికి ఎగిరిపోయారు" అన్నాడు. ఈ రకంగా దేవతలు తమ విజయగాధలు వివరిస్తున్నారు.

బ్రహ్మతత్త్వం వారి గర్వాన్ని గమనించింది. వారి అహంకారాన్ని అంతం చెయ్యాలనే కోరికతో వారి ఎదుట ప్రత్యక్షమైంది. కాని ఆ తత్త్వం ఏమిటో తెలుసుకోలేక పోయారు దేవతలు. ఒక్క క్షణం ఆలోచించి అగ్ని దేవుని సమీపించి "ఓ అగ్ని దేవా ! మాకు అంతుబట్ట నిది, మా బుద్ధికి అర్థం కానిది అయిన తత్త్వం ఏదో ఒకటి ఇక్కడ ప్రత్యక్షమైంది. మాయందు దయ ఉంచి అది ఏమిటో తెలుసుకుని రావలసింది" అన్నారు. "సరే" అన్నాడు అగ్ని దేవుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. అది ఒక పెద్ద భూతం లాగా కనిపిస్తోంది. భయంకరంగా ఉంది. ఆ శక్తి అగ్ని దేవుణ్ణి చూసి "ఎవరు నువ్వు" అన్నది. "నేను అగ్ని దేవుడను. పుట్టిన ప్రతిజీవి యందు ఉంటాను. జాత వేదుడని పేరు గడించాను." అన్నాడు అగ్ని.

"అయితే నీ గొప్పతనం, శక్తి సామర్థ్యాలు ఏమిటి ?"

"చరాచర జగత్తులోని ఏ వస్తువునైనా నా అగ్ని కీలలతో క్షణంలో భస్మీపటలం చేస్తాను" అన్నాడు.

అప్పుడు ఆ భయంకర రూపంలో ఉన్న తత్త్వం ఒక గడ్డిపోచను అగ్ని దేవుని ముందుంచి "దీన్ని దగ్ధం చెయ్యి. నీ శక్తి సామర్థ్యాలేమిటో ఒకసారి చూస్తాను"? అంది. అగ్ని హోత్రుడు తన శక్తి సామర్థ్యాలు వినియోగించి భయంకరమైన మంటలు వ్యాపింపచేశాడు. గడ్డి పోచ భస్మం కాదు కదా, కసి కూడా కందలేదు. అవమాన భారంతో తలదించుకుని వెనక్కి తిరిగి వెళ్ళి దేవతలతో "ఆ తత్త్వం ఏమిటో నాకూ బోధపడలేదు". అన్నాడు అగ్ని.

తరువాత దేవతలంతా వాయువును సమీపించి "ఓ వాయుదేవా ! దేవాసుర యుద్ధంలో భయంకరంగా యుద్ధం చేసి దేవతల విజయానికి కారణమైనావు. కాబట్టి నీవు వెళ్ళి ఆ తత్త్వమేమిటో తెలుసుకోవటానికి ప్రయత్నించు" అన్నారు. దేవతల అభ్యర్ధన మేరకు వాయుదేవుడు బ్రహ్మతత్త్వాన్ని సమీపించాడు. దగ్గరకు వచ్చిన వాయువును చూసి ఆ తత్త్వం అడిగింది.

"ఎవరు నువ్వు"?

"నేను వాయుదేవుడను, ఆకాశంలో వృద్ధిపొందుతాను. అందుచేత నన్ను మాతరిశ్వుడు అంటారు."

"నీ శక్తి ఏమిటి ?"

"ఈ భూమండలంలో ఏ వస్తువునైనా సరే నా గాలులతో ఇట్టే ఎగరగొట్టగలను.

ఆ మాట విన్న భూతం, మునుపటిలాగానే గడ్డిపోచను అతని ముందుంచి "ఏదీ, దీన్ని ఎగరగొట్టు" అన్నది. తన శక్తినంతా కూడా తీసుకుని బలమైన గాలులు వ్యాపింపచేశాడు. వాయుదేవుడు. గడ్డిపోచ ఎగిరి పోవటం కాదుకదా కించిత్తు కూడా కదల లేదు. అవమాన భారంతో వచ్చిన త్రోవనే వెళ్ళి పోయాడు వాయువు.

"ఆ తత్త్వం ఏమిటో నాకూ బోధ పడలేదు" అని దేవతలతో చెప్పాడు.

అప్పుడు దేవతలంతా కలిసి ఇంద్రుడి దగ్గరకుపోయి జరిగిన విషయమంతా వివరించి "దేవరాజా ! విచిత్రమైన ఆ తత్త్వం ఏమిటో నువ్వే కనుక్కో." అన్నారు. దేవతల ప్రార్థన మన్నించి ఆ తత్త్వం దగ్గరకు వెళ్ళాడు ఇంద్రుడు. ఆ తత్త్వం కాస్తా మాయమైపోయింది. ఆ స్థానంలో గొప్ప సౌందర్య రాశి అయిన స్త్రీ మూర్తి కనిపించింది. ఆమె హిమవంతుని కుమార్తె ఉమాదేవి. ఆమెను చూసి ఇంద్రుడు "ఇంతవరకు దేవతలను భయభ్రాంతులను చేసిన తత్త్వము ఏది ? దాని పేరేమిటి ? " అన్నాడు. అప్పుడు ఉమాదేవి" ఆ తత్త్వమే బ్రహ్మము. ఇంద్రా ! అల్పబుద్ధి వల్ల ఇంతవరకూ కనిపించిన తత్త్వాన్ని బ్రహ్మని గుర్తించలేకపోయారు దేవతలు. ఆ తత్త్వమే మీ అందరిలోనూ వ్యాపించి ఉన్నది. మీకు శక్తిని ప్రసాదిస్తున్నది. పిపీలికాది బ్రహ్మపర్యంతము, సకల జీవులయందు అంతరాత్మగా వ్యాపించి ఉన్న సచ్చిదానంద లక్షణమైనది బ్రహ్మతత్త్వము. దాని సహాయం చేతనే మీరు రాక్షసులను జయించ గలిగారు. ఇక ముందెన్నడూ ఇలా గర్వించకండి. యదార్థమూ, జీవిత పరమార్థమూ అయిన ఆత్మజ్ఞానాన్ని దూరం చేసుకోకండి". అని చెప్పి అదృశ్యమైంది.

పై విషయాలను పరిశీలించినట్లైతే పరమాత్మ సర్వాంతర్యామి. పిపీలికాది బ్రహ్మ పర్యంతమూ అన్నింటా వ్యాపించి ఉన్నాడు. అంటే జగత్తు అంతా పరమేశ్వర మయము. అని తెలుస్తున్నది అన్నాడు రత్నాకరుడు.



# 13. ప్రసిద్ధ మతాలు

"గురువర్యా ! ప్రపంచంలో అనేక మతాలున్నాయి. ప్రతి మతంలోనూ పరమేశ్వరుణ్ణి చెప్పటం జరిగింది. ప్రపంచ ప్రసిద్ధి పొందిన మతాలలో పరబ్రహ్మను గురించి ఏం చెప్పబడిందో నాకు వివరించండి" అన్నాడు నారాయణభట్టు, చెప్పటానికి ఉపక్రమించాడు రత్నాకరుడు.

ప్రపంచంలో అనేక మతాలున్నాయి. వీటిన్నింటిలోనూ ఆధ్యాత్మిక చింతన ఉన్నది. అన్ని మతాలు పరమేశ్వరుణ్ణి గురించి వివరిస్తున్నాయి. ఏ మతం దృష్టిలో అయినా పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ. అతనే ఈ లోకాలను సృష్టించాడు. మానవులందరిలోనూ అతనే ఉన్నాడు.

ప్రపంచంలో ప్రసిద్ధ మతాలు రెండు 1) క్రైస్తవ మతము, 2) ఇస్లాం మతము.

## క్రైస్తవ మతము

క్రైస్తవమతంలో ముఖ్యమైనది త్రిపుటి దీన్నే వీరు "త్రీత్వము" అంటారు. ఈ మతంలో పిత, పుత్రుడు, పవిత్రాత్మ అని ముగ్గురు కనిపిస్తారు. ఇదే త్రీత్వము. మానవ రక్షణకు భగవంతుడు ఒక ప్రణాళిక ఏర్పాటు చేశాడు. అది మూడు దశలలో సాగింది. ఈ మూడు దశల లోనూ మానవుడు భగవంతుణ్ణి మూడు రకాలుగా అర్థం చేసుకున్నాడు. భగవంతునితో త్రివిధ అనుబంధాలను ఏర్పరచుకున్నాడు. ఆ అనుబంధాల ప్రతి రూపమే పిత, పుత్రుడు, పవిత్రాత్మ.

**పిత:** ఇది మొదటి దశ. భగవంతుడు తన పోలికలతో మానవుని సృష్టించి, ప్రాణం పోశాడు. కాబట్టి సృష్టి కర్తగా తండ్రి స్థానాన్ని అలంకరించాడు. మానవ జీవనానికి మూలము ఆయనే కాబట్టి ఆయనే తండ్రి. ఈ లోకంలో కన్న తండ్రి కన్న మన రక్షణ భారాన్ని ఎక్కువగా ఆయనే వహిస్తాడు.

ఈ రకంగా మానవులను సృష్టించిన తరువాత స్వయంగా భగవంతుడే మానవ రక్షణ భారాన్ని వహిస్తూ ప్రవక్తల ద్వారా, దూతల ద్వారా తన సందేశాన్ని మానవుడికి అందించాడు. అయినా మానవ స్వభావంలో ఏ మార్పు రాలేదు. తాను అదృశ్యంగా ఉండి ప్రవక్తల ద్వారా చేసే బోధలు మానవుడు పెడ చెవిన పెడుతున్నాడు. కాబట్టి, స్వయంగా తానే మనిషితో

మాట్లాడాలని సంకల్పించుకున్నాడు. ఈ సంకల్పంతోనే మానవ రక్షణ ప్రణాళికలో రెండవ దశ ప్రారంభమయింది.

**పుత్రుడు :** ఇది రెండవ దశ. మనిషితో స్వయంగా తాను మాట్లాడాలి అంటే తాను కూడా మానవ భాష మాట్లాడాలి. మానవుడుగా సంచరించాలి. మిగిలిన మనుషులతో కలిసి తినాలి. తిరగాలి. వారి కష్టాలు, సుఖాలు తాను కూడా పంచుకోవాలి. అంటే తాను కూడా మానవుడుగా జన్మించాలి. ఆయన దేవుడై ఉండి కూడా మనుష్య గర్భాన జన్మించాడు. "మనుష్య కుమారుడు" గా పిలువబడ్డాడు.

"నీవు గర్భము ధరించి కుమారుని కనెదవు ......... ఆ పవిత్ర శిశువు "దేవుని కుమారుడు" అని పిలువబడును" (లూకా 1 : 31 - 36)

యేసుగా పిలువబడుతున్న మానవ కుమారుడు పూర్తిగా భగవంతుడే. ఆయన తన తండ్రితో ఏకమై ఉన్నాడు. "నేను తండ్రి యందు, తండ్రి నాయందు ఉన్నాము." (యోహా 10 : 38) "నేను, నా తండ్రి ఏకమై ఉన్నాము" (యోహా 1 : 13) మానవ ప్రాణం మీద అధికారం దేవునికే ఉంది. మన ప్రాణాన్ని మనం పొగొట్టు కోగలం. కాని ప్రాణం పొయ్యలేము. ఈశక్తి భగవంతునికి మాత్రమే ఉన్నది. "నా ప్రాణము నాయంతట నేనే ధార పోయుటకును, దానిని మరల తీసుకొనుటకును నాకు అధికారము కలదు. (యోహా 10 : 18). అలాంటి అధికారము యేసుకు ఉన్నది. అందుచేతనే ఆయన దైవ సమానుడు. యేసు తనలోని దైవత్వాన్ని ప్రస్ఫుటం చేస్తూ "నేను పునరుద్ధానమును, జీవమును, నిన్ను విశ్వశించు వాడు మరణించిననూ జీవించును" (యోహా 5 : 47) అన్నాడు. ఈ రకంగా భగవంతుడు, యేసు ఇద్దరూ నిత్య జీవన విషయంలో సమాన స్థాయిలోనే ఉన్నారు. "నిన్నును, నీవు పంపిన క్రీస్తును తెలిసికొనుటయే నిత్య జీవనము" (యోహా 17 : 3)

ఈ రకంగా రెండవ దశలో దేవుడు మనుష్య కుమారుడుగా జన్మించాడు. మానవుడు తన బలహీనతలను ఏ రకంగా జయించాలో, ఏ రకంగా జీవించాలో ఆచరించి చూపాడు. చివరకు సిలువ కూడా ఎక్కాడు.

**పవిత్రాత్మ :** ఇది మూడవ దశ, భగవంతుడు ఇంత చేసినా మానవునిలో మార్పు రాలేదు. యేసు చూపిన మార్గాన్ని మానవుడు నిరాకరించాడు. కాబట్టి తానే ఆత్మ రూపంలో మనిషిలో కలిసి పోయి మానవ శరీరము ద్వారా ఆ జీవన విధానాన్ని అవలంబించి రక్షణ

పొందగలిగేటట్లు చెయ్యాలను కున్నాడు. అందుకే పవిత్రాత్మ అయ్యాడు. తన రక్తము, మాంసము అందరికీ పంచి, అందరిలోకీ ప్రవేశించాడు. మానవ కుమారుడు, పవిత్రాత్మ రెండూ ఒక్కటే, అని పలుసార్లు తెలియ చేశాడు. 'నేను వెళ్ళనిచో ఆదరకర్త మీ వద్దకు రాడు' (యోహ 16 : 1) మానవునిలో కలిపోయిన ఆత్మను యేసు మీద నమ్మకమున్న వారు మాత్రమే చూడగలరు. కొద్ది కాలము పిదప లోకం చూడలేదు ...... మీరు చూచెదరు'' (యోహా 14 : 19) ఈ ఆత్మ మనలో కలిసి పోయి, దైవాత్మ మనము ఒకటైతే తప్ప మనము ప్రభువు చూపిన మార్గంలో పయనించలేము. సత్య స్వరూపి అయిన ఆత్మ మిమ్ము సంపూర్ణ సత్యమునకు నడిపిస్తుంది. ఈ ఆత్మను అనుగ్రహించటమంటే దేవుడే మనలో ఉండటం. అందుచేతనే మనలో పూర్తిగా ఐక్యము చెందటానికి యేసు తన శరీరాన్ని రక్తాన్ని ఆహారంగా ఇచ్చాడు. యేసు శరీర, రక్తాలను స్వీకరించటం ద్వారా మనిషి కూడా క్రీస్తు యొక్క దైవత్వంలో భాగం పొందుతున్నాడు.

ఈ రకంగా ఒకే భగవంతుడు "త్రీత్వము'' గా మారి తండ్రి, కుమారుడు, పవిత్రాత్మ అయినాడు. ఈ ముగ్గురూ వేరుకాదు. ఒకటే. అతడే సర్వేశ్వరుడు.

151. పిత సర్వేశ్వరుడా ? సర్వేశ్వరుడు

152. పుత్రుడు సర్వేశ్వరుడా ? సర్వేశ్వరుడు

153. పవిత్రాత్మ సర్వేశ్వరుడా? సర్వేశ్వరుడు

154. ఈ ముగ్గురు వ్యక్తులూ ముగ్గురు సర్వేశ్వరులా ? లేక ఒకే సర్వేశ్వరుడా ? ఒకే సర్వేశ్వరుడు. (సత్యోపదేశ వ్యాఖ్యానము, పేజి 99)

వీరిలో శక్తి, మహిమ, మొదలైన లక్షణములలో కూడాభేదము లేదు. వీరు అన్నింటిలోనూ సరి సమానులు.

**పరమేశ్వరుడు :** దేవుడు నిరాకారుడు. అశరీరి. అదృశ్యుడు. అనగా దేవుడు కేవలము ఆత్మ స్వరూపి. (సత్యోపదేశ వ్యాఖ్యానము, పేజి 99) అయితే భగవంతుణ్ణి మనం ప్రత్యక్షంగా దర్శించలేము. ఆయనకున్న లక్షణాల ద్వారా ఆయన దర్శనం చేసుకోవచ్చు.

పరమేశ్వరుని ముఖ్య లక్షణాలు ఆరు. అవి :

1. సర్వేశ్వరుడు తనంతట తానై ఉన్నాడు.
2. ఆరంభము లేక ఉన్నాడు.
3. శరీరము లేక ఉన్నాడు.

4. మితిలేని సకల మేలుల స్వభావము కలిగి ఉన్నాడు.

5. అంతట ఉన్నాడు.

6. పరలోకమునకు, భూలోకమునకు మూలకారణమై ఉన్నాడు.

(సత్యోపదేశ వ్యాఖ్యానము . పేజి 103)

సర్వేశ్వరుడు తనంతట తానై ఉన్నాడు. అంటే అతడు ఎవరి వల్లా సృష్టించబడలేదు. అతనే ఇంకొకరిని సృష్టిస్తున్నాడు.అతడు స్వయంభువు. పరమేశ్వరుడు తప్ప ఈ రకంగా తనంత తానుగా ఎవ్వరూ లేరు. అతడికి ఆరంభములేదు. అనాదిగా ఉన్నాడు. అతడికి ప్రాణము లేదు. ఎందుకంటే భూత భవిష్యద్వర్త మానాలన్నీ అతడికి మనమే. అతడికి శరీరము లేదు. జ్ఞానస్వరూపి. ఆత్మస్వరూపి. ఆరంభము, ముగింపు లేనివాడు. మరి భగవత్సరూపుడైన యేసుకు శరీరమున్నది కదా ? అంటే దైవత్వంలో శరీరమండదు. మానవుడికి శరీరముంటుంది. యేసు మానవుడిగా జన్మించాడు. అందకే శరీరాన్ని ధరించవలసివచ్చింది. పరమేశ్వరుడు మితిలేని మేలు స్వభావములు కలిగి ఉన్నాడు. అనగా మితిలేని నీతి, దయ, జ్ఞానము, మహిమ, సంతోషము, కలిగి ఉన్నాడు. మన మాటలు చేతలు అన్నీ భగవంతునికి తెలుసు. ఆయనకు తెలియని విషయములు లేవు. అతని శక్తికి మించిన కార్యములేదు. ఏ కార్యమైన అవలీలగా చేయయగలడు. అతడు అంతట ఉన్నాడు. అంటే తన జ్ఞానము చేత, శక్తి చేత, కారణము చేత అన్ని స్థలములలోనున్నాడు. పరలోక భూలోకాలను, వాటిలోని సమస్త వస్తువులను సృష్టించి కాపాడుట వలన సర్వమునకు మూలకారణమై ఉన్నాడు. అతడు పరిశుద్ధుడు, న్యాయవంతుడు, దయాపరుడు, సత్య స్వరూపి, ఓర్పుగల స్వరూపియై ఉన్నాడు. (సత్యోపదేశము 162 నుండి 175 ప్రశ్నలు)

**సృష్టి:** అసలు సృష్టి అంటే ఏమిటి ? భగవంతుడు తన ఇష్టానుసారము వస్తువులను ఉత్పత్తి చేయటం. ఈ ఉత్పత్తి ఏమిలేని చోటు నుండి జరుగుతుంది. అంటే శూన్యంలో నుండి వస్తువులను పుట్టించటాన్నే 'సృష్టి' అంటారు. ఈ రకంగా భగవంతుడు వస్తువులను, ప్రాణులను, మనుషులను కూడా సృష్టించాడు. సృష్టి చేయుట మనేది భగవంతుడి చేత మాత్రమే అవుతుంది. మానవుడి వల్లకాదు. దేవుడు సృష్టించిన వస్తువులను మానవుడు తన అవసరానికి అనుగుణంగా మార్చుకోగలడు. ఉదా॥ కమ్మరి, కుమ్మరి, కంసాలి, వడ్రంగి, మొ॥వారు. అంతేకాని గడ్డి పోచను కూడా మానవుడు సృష్టించలేడు. అయితే భగవంతుడు

సృష్టించిన వస్తువుల సహాయంతో క్రొత్త రూపాలు గల వస్తువులు తయారు చేయగలడు. అంతేకాని అసలు సృష్టి మాత్రం చెయ్యలేదు. ఈ సృష్టి కార్యక్రమం భగవంతుడే చెయ్యగలడు.

సర్వేశ్వరుడు భూలోకము నెటుల సృష్టించెను ? "అవును గాక" (ఆది. కాం. 1, 3, 6, 9, 11, 14.) అను మాటచేత సర్వేశ్వరుడు సర్వమును ఆరు దినములలో సృష్టించెను. (185 సత్యోపదేశ వ్యాఖ్యానము పేజీ 113).

పరమేశ్వరుడికి చాలా కాలంగా పరలోక భూలోకాలను సృష్టించాలనే కోరిక ఉన్నది. తాను నిర్ణయించుకున్నకాలం రాగానే పరలోక భూలోకాలు సృష్టించాడు. అప్పుడు భూలోకమంతా చిమ్మ చీకట్లు క్రమ్ముకొని ఉన్నది. సర్వేశ్వరుడు "ప్రకాశము కలుగుగాక" అనగానే మొదటి రోజున భూలోకమంతా ప్రకాశము కలిగినది. రెండవ రోజున దేవుడు గగనమును కలుగచేసెను. మూడవ దినమున నీళ్ళన్నీ ఒక స్థలములో ఏకముగాచేర్చి నడుమ "నిర్జలమైన గడ్డ కనబడుగాక" అనగానే నిర్జలమైన గడ్డ కనపడింది. దీనికి భూమి అని, జలానికి సముద్రము అని పేరు పెట్టాడు. ఆ తరువాత పచ్చిక, కూరలు, వివిధ రకాల చెట్లు సృష్టించాడు. నాల్గవ రోజున ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలను సృష్టించాడు. ఐదవ రోజున నీటిలో తిరిగే చేపలు, ఆకాశంలో ఎగిరే పక్షులను సృష్టించాడు. ఆరవ రోజున భూమిమీద తిరగే జంతువులను, మృగాలను, ప్రాకే జంతువులను, తన పోలిక కలిగిన స్త్రీ పురుషులను సృష్టించాడు. ఇక్కడ దినము అనగా ఇరవై నాలుగు గంటల కాలము కాదు. ఇవి దీర్ఘకాలము గలిగిన గొప్ప దినములు. ఏడవ రోజున క్రొత్త వస్తువులను సృష్టించటం మానివేసి విశ్రాంతి తీసుకున్నాడు. కాబట్టి మనం కూడా ఆరు దినములు పనిచేసి, ఏడవ దినమున పనుల నుండి విరమించుకుని సర్వేశ్వరుని ధ్యానించి ఆరాధించాలి.

పై విషయాలను గనక పరిశీలించినట్లైతే సర్వేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. ఆది అంతములు లేనివాడు, దయామయుడు, మహాజ్ఞాని, సర్వవ్యాపి, అంతటా తానే అయి ఉన్నాడు. భూలోకాన్ని ఆయనే సృష్టించాడు. మానవులను సత్కార్యాలు చెయ్యమని దేవదూతల ద్వారా వర్తమానము పంపాడు. మానవులు వినలేదు. అందుచేత లోకంలోని పాపులను రక్షించటానికి మానవుడిగా యేసు రూపంలో పవిత్ర గర్భాన జన్మించాడు. అప్పుడు కూడా మానవుడు మారలేదు. అందుచేత తన రక్తాన్ని, శరీరాన్ని మానవులకిచ్చి వారి యందు పవిత్రాత్మగా ప్రవేశించాడు. ఈ విధంగా జగత్తును సృష్టించిన సర్వేశ్వరుడు భూలోకంలోని మానవులందరిలోనూ నివసించి ఉన్నాడు.

# ఇస్లాం మతము

ఇక 'ఇస్లాం' మతం గురించి చెబుతాను వినండి.

'ఇస్లాం' అంటే శాంతి, సమర్పణ, విధేయత అని అర్థం. మానవుడు తన సృష్టికర్త, ప్రభువు అయిన దేవునికి తననుతాను పూర్తిగా సమర్పించుకొని, ఆయనకు విధేయుడై, జీవితంలోని అన్ని రంగాలలోను ఆయన ఆజ్ఞలు పాటించాలని, తద్వారా మాత్రమే అతను సుఖ సంతోషాలు పొందగలడని ఇస్లాం బోధిస్తోంది. ఆది మానవులైన ఆదాము, అవ్వలు ఏనాడైతే ఈ భూమండలంపై కాలు మోపారో, ఆనాటి నుండే ఇస్లాం ప్రారంభమైంది. అన్ని కాలాల్లో, అన్ని ప్రాంతాలకు, లక్షా ఎనభైవేల మంది ప్రవక్తలు వచ్చి ఉపదేసించిన ధర్మమే 'ఇస్లాం'. వారిలో చివరి ప్రవక్త మహమ్మద్. అతని కాలంలో ఇస్లాం ధర్మం పరిపూర్ణమయింది. ఇస్లాం కేవలం ఒక మతం మాత్రమే కాదు, ఒక సమగ్రమైన జీవన విధానం. అది ఒక జాతికి, ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితం కాదు. అది సార్వజనీనం. సార్వకాలికం.

**దేవుని ఏకత్వం :**

ఇస్లాం ధర్మానికి మూలస్థంభం "దేవుని ఏకత్వం" సమస్త జీవన రంగాలను సమన్వయ పరచి, వాటిలో సమతూకాన్ని నెలకొల్పి, మనిషిని మానవత్వపు హద్దులో ఉంచగల బలమైన కేంద్రీయశక్తి దేవుని ఏకత్వము. ఇస్లాం మతంలో దేవుని దైవత్వం అవిభాజ్యమైనది. అందువల్ల దేవుడు ఒక్కడే అని, ఆయన మాత్రమే నిత్యుడని విశ్వశించటంతోపాటు, ఆ దేవుడు మన అందరి సృష్టికర్త, స్వామి, ప్రభువు, పోషకుడు, విధాత, యజమాని, సంరక్షకుడు శాసన ప్రదాత, జననమరణాలకు కారకుడు, కష్ట సుఖాలకు కారణభూతుడు, సర్వజ్ఞాని. ఇటువంటి పరిపూర్ణ దైవత్వం గల దేవుణ్ణి అరబ్బీ భాషలో 'అల్లాహ్' అంటారు. అల్లా యొక్క దైవత్వంలో, శక్తి సామర్థ్యాల్లో గుణగణాల్లో, శక్తి యుక్తుల్లో, ఇతరులెవ్వరికి భాగస్వామ్యం ఉండదు. అలా చెయ్యటం మహాపాపమని ఇస్లాం చెబుతోంది.

"అల్లా తప్ప ఆరాధ్యదైవం ఎవ్వడూ లేడు. సకల చరాచర సృష్టికి మూలాధారమైన ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు. ఆయన నిద్దురపోడు. ఆయనకు కునుకురాదు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనదే" (ఖురాన్ 2-254)

అల్లా తప్ప మరొక దేవుడు లేడు. అతడు శాశ్వతుడు. సర్వమును కాపాడువాడు. అతనికి తూగు గాని, నిద్రగాని పట్టదు. ఆకాశములోను, భూమిలోను ఉన్న సమస్తము

అతనిదే. అతని సెలవు లేక ఎవరు అతని యొద్ద సిఫారుసు చేయగలరు? అతడు మానవులకు ముందు రానున్నదియు, వారికి పూర్వము గడచినదియు సమస్త మెరుంగును. దేవునికి దెలియు విషయములలో తాను కోరి తెలిపినది తప్ప నితరము గ్రహింపజాలరు. ఆ రెంటినీ కాపాడుట దేవునికి కష్టము కాదు. మరియు నాతడే సర్వాధికుడు గొప్పవాడు.

(ఖురాన్ కాండము - 3. సూరయే బఖర - ఆయత్ 255 పేజి : 112.)

ఓ ప్రవక్త అల్లా గురించి ఈ విధంగా చెప్పాడు.

1) దేవుడు అద్వితీయుడు 2) దేవుడు అక్కరలేనివాడు 3) అతడు బిడ్డలను కనలేదు మరియు జన్మించినవాడుకాదు. 4) అతనికి సమానుడు ఎవరూలేరు.

(ఖురాన్ కాండము -30, సూరయే ఇఖ్లాస్ పేజి : 519)

ఒకసారి విగ్రహారాధకులైన మక్కా వారు హజ్రత్ మహమ్మదువారితో "నీవు దేవుని గూర్చి మాకు తెల్పుము" అన్నారు. అందుకు దేవుడు ఈ సూరాను పంపాడు. ఇక్కడ దేవుని ఏకత్వాన్ని గూర్చి సంపూర్ణముగా తెలుపబడింది. ఖురానులో వివరింపబడే ముఖ్యమైన విషయాలలో ఇది ఒకటి. ఇక్కడ దేవుని గూర్చి ప్రజలకు గల అపనమ్మకాన్ని, దేవుడు లేడనే నాస్తికులను, విగ్రహారాధన చేసే వారిని ఖండించటం జరిగింది. దేవుడు ఒక్కడే. అతనితో సమానులుగాని, అధికులుగాని ఎవరూలేరు. అతడు ఏ విధమైన అక్కర (అవసరము/కోరిక) లేనివాడు. కాబట్టి దేవుడు ఏవిధమైన కొరతలేనివాడు. సర్వము అతడి మీదనే ఆధారపడి ఉన్నది. లోకమంతటికీ అతనితో అవసరమున్నది. కాబట్టి అతడే సర్వాన్ని సృష్టించి, పోషించి అందరి అవసరాలు, కోరికలు తీర్చగల సమర్థుడు. అతడికి అన్ని విషయాలు తెలుసు. కాని తన ఇష్టానుసారము చేస్తుంటాడు. ఆదిమధ్యాంతములు లేనివాడు. ఆకలి, దాహము, తొందరలు లేనివాడు. ఏరకమైన లోపములు కొరతలు లేనివాడు. పరిపూర్ణుడు. దేవునికి భార్యా బిడ్డలు లేరు. కొందరు క్రీస్తు, ఉజైరను దేవుని కుమారులని, దేవదూతలు దేవుని కుమార్తెలని అంటారు. ఇది నిజంకాదు. దేవుడు ఎవరింటా పుట్టలేదు. అతనికి తల్లి తండ్రులు లేరు. కొందరు మానవులను దేవుడు అంటారు. మరివారు తల్లి తండ్రులకు పుట్టారు కదా! కాబట్టి దేవుడుకాదు. క్రీస్తుకూడా బీబీ మరియమ్మకు పుట్టాడు కాబట్టి దేవుడుకాదు. దేవునికి ఏ విషయంలోనూ సమానమైన వారు లేరు. లోకాన్ని అందులోని సర్వప్రాణికోటిని, వస్తుసముదాయాన్ని దేవుడే సృష్టించాడు. కాబట్టి సర్వము అతడికి లోబడి ఉంటుంది. అతనికి సరిసమానమైనవాడులేడు. కాబట్టి దేవుడు సాటిలేనివాడు.

**దైవప్రవక్తలు :** దేవుణ్ణి ఎలా ఆరాధించాలి ? ఆయన అభీష్టము, అధికారాలు ఏమిటి? ఏ పనులు చేస్తే మానవుని జీవితం సార్థకమవుతుంది ? అనే విషయాలను దేవుడు మానవులకు వదలిపెట్టలేదు. వీటికోసం ఆయన మానవుల్లో కొందరు సజ్జనులను ఎన్నుకొని, వారి ద్వారా మానవాళికి తన ఆజ్ఞలను, హితవులను అందజేస్తూ వచ్చాడు. ఇలాంటి సత్పురుషులనే ఇస్లాం దైవ ప్రవక్తలంటోంది. మానవులు అజ్ఞానంతో సమస్యల సుడిగుండంలో చిక్కుకున్నప్పుడల్లా దయామయుడైన దేవుడు వారికి రుజుమార్గం చూపటానికి దైవప్రవక్తలను పంపాడు. ఇస్లాం ప్రకారం ప్రతి దేశంలోనూ, ప్రతి జాతిలోనూ ప్రవక్తలను ఉద్భవింపచేశాడు. వారందరూ ఇస్లాం ధర్మము అంటే దైవ విధేయ మార్గాన్ని బోధించారు. ప్రవక్తలు మరణించిన తరువాత వారు తెచ్చిన గ్రంథాలను కొందరు స్వార్థపరులు తారుమారు చేశారు. అందుకని దేవుడు ఇంకొక ప్రవక్తను పంపేవాడు. ఈ ప్రవక్తలలో చివరివాడు మహమ్మద్. ఈయన ప్రత్యేకజాతి, కాలం, దేశం కోసం కాక ప్రళయం వరకు పుట్టబోయే యావత్తు మానవాళి కోసం వచ్చాడు. కాబట్టి ఏ దేశంలోని వారికైనా మహమ్మదు ప్రవక్త తెచ్చిన ఖురాన్ సూక్తులను పఠించటం, ఆచరించటం తమ విధి. దీని వల్ల మాత్రమే మానవుడు మోక్షానికి అర్హుడౌతాడు.

**పరలోక విశ్వాసము :**

ఇస్లాం మౌలిక విశ్వాసాలలో దేవుని ఏకత్వము, ప్రవక్త దౌత్యము, పరలోక విశ్వాసము అత్యంత ముఖ్యమైనవి. ఈ ప్రపంచం ఒక పరీక్షా స్థలం మానవుని సుదీర్ఘ ప్రయాణంలో ఇది ఒక మజలీ. మానవుడు తాను చేసిన కర్మలన్నింటికీ దేవుని ముందు బాధ్యుడు. ఈ ప్రపంచం ఎప్పుడో ఒకసారి అంత మవుతుంది. దాని తరువాత దేవుడు ఇంకొక ప్రపంచాన్ని సృష్టిస్తాడు. అందులో మానవ జాతిని ఒకే సమయంలో మళ్ళీ బ్రతికిస్తాడు. అందర్నీ సమావేశ పరచి వారి కర్మలను విచారిస్తాడు. ఇందులో పుణ్యాత్ములు స్వర్గానికి, పాపాత్ములు నరకానికి పోతారు. వారు అక్కడే శాశ్వతంగా ఉంటారు. వాస్తవానికి అల్లాహ్ చేసిన తుది నిర్ణయంలో సాఫల్యం పొందినవాడే కృతార్థుడు. పొందనివాడు విఫలుడు.

"నిస్సందేహంగా తీర్పు దినం ఒక నిర్ణీత సమయం. ఏ రోజైతే శంఖం పూరించబుతోందో, ఆ రోజున మీరంతా గుంపులు గుంపులుగా లేచి వస్తారు. ఆకాశం తెరువబడుతుంది. అది ద్వారాలు, ద్వారాలుగా మారిపోతుంది. పర్వతాలు నడిపించబడతాయి. అవి ఎండ మావులుగా మారిపోతాయి." (ఖురాన్ - 78 - 17 - 20)

**దైవరాధన :**

ఇస్లాంలో దైవారాధనకు ఎంతో విస్తృత భావం ఉన్నది. మానవుడు దేవునికి, ఆయన ప్రవక్తకు పూర్తిగా విధేయుడు. జీవితంలోని అన్ని రంగాలలోనూ వారి ఆజ్ఞలను, హితవులను తు చ తప్పకుండా పాటించటమే దైవారాధన. ఇస్లాం అనేది ఒక సంపూర్ణ జీవనవ్యవస్థ. అది అన్ని రంగాల్లోనూ మానవులకు మార్గదర్శకమవుతుంది.

పై విషయాలను కూలంకషంగా పరిశీలించినట్లైతే "ఇస్లాం అనేది ఒక మతం కాదు. అది ఒక జీవన వ్యవస్థ. భగవంతుడైన 'అల్లాహ్' నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు, మానవజాతి నుద్ధరించటానికి సందేశాలను ప్రవక్తల ద్వారా పంపాడు. ఆ ప్రవక్తలలో చివరివాడు మహమ్మదు. అల్లా అద్వితీయుడు. అతనికి జనన మరణాలు లేవు. ఆద్యంతాలు లేవు. అతనితో సమానమైనవారుగాని, అతనికన్న అధికులు గాని ఎవరూలేరు. అతడే ఈ లోకాన్ని సృష్టించాడు. లోకంలో మానవులు ఏవిధంగా జీవించాలో ప్రవక్తల ద్వారా బోధింపచేసి మానవ సుఖ జీవనానికి పునాదులు వేశాడు'' అంటూఇస్లాం మతాన్ని గురించి తన శిష్యులకు వివరించాడు. రత్నాకరుడు.



# 14. విశ్వ కల్యాణం

సృష్టి ప్రారంభం కాక పూర్వం అంతా శూన్యంగా ఉండేది. అప్పుడు పరబ్రహ్మ బిందు రూపంలో ఉండేవాడు. కొంతా కాలానికి అతడికి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగింది.

ప్రళయం సంభవించినప్పుడు పంచభూతాలతో సహా అన్నీ పరబ్రహ్మలో లీనమవుతాయి. ఆ సమయంలో జీవరాశి అంతా నాశనమై పోతుంది. ఈ జీవులన్నీ ముక్తి పొందవు. కొన్నింటికి సంచితకర్మ ఇంకా మిగిలి ఉంటుంది. కాబట్టి ఆ జీవులు తమ ప్రారబ్దకర్మతో సహా విమర్శశక్తి యందు లీనమౌతాయి. అలాగే తన్మాత్రలు పంచభూతాలు కలిసి పోతాయి. ఇప్పుడు

| | | |
|---|---|---|
| భూమి | - | జలమునందు |
| జలము | - | అగ్ని యందు |
| అగ్ని | - | వాయువునందు |
| వాయువు | - | ఆకాశమునందు |
| ఆకాశము | - | విమర్శ శక్తి యందు లీనమౌతాయి. |

ఈ రకంగా జగత్తులోని జీవరాశిని, వస్తు సముదాయాన్ని తనలో కలుపుకున్న విమర్శ శక్తి వాటన్నింటితో కలిసి పరబ్రహ్మలో లీనమవుతుంది. అంటే ఇప్పుడు పరబ్రహ్మలో జగత్తు అంతా ఇమిడి ఉన్నది. ఈ రకంగా ప్రారబ్దకర్మ నశించకుండా ఉన్న జీవులకు మోక్షం కలిగించాలనే కోరికతోనే పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పిస్తున్నాడు. అంతేకాని సృష్టి చెయ్యాలనే కోరక అతనికి ఏమాత్రమూ లేదు. అతడు ఇచ్ఛారహితుడు. జ్ఞాన స్వరూపుడు. స్వయంప్రకాశము గలవాడు.

బిందు స్వరూపుడగా ఉన్న పరబ్రహ్మ సృష్టి చేయాలని సంకల్పించిన వాడై, తనలోని కొంత భాగాన్ని (విమర్శ శక్తిని) బయటకు పాంపాడు. ఆ వివమర్శశక్తియే త్రికోణము. బిందువు అంటే తేజోమయమైన కాంతి పుంజము. దాని నుండి శక్తి ఉద్భవించి ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులుగా ఏర్పడి త్రికోణమయింది. త్రికోణము, బిందువు రెండూ వేరు వేరు కాదు. బిందువు యొక్క ప్రతిరూపమే త్రికోణము. దీని నుంచే నామ రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. పరబ్రహ్మ విమర్శాంశను తననుండి బయటకు పంపిన తరువాత స్ఫురణతో ఈసృష్టి జరుగుతున్నది. శివాది క్షితిపర్యంతము ముప్పై ఆరుతత్త్వములతో కూడిన

విమర్శాంశను, ప్రకాశాంశ అయిన పరబ్రహ్మ ఒకసారి వీక్షించిటాన్నే 'స్ఫురణ' అంటారు. శివాదిక్షితి పర్యంతము తత్త్వాలు ముప్ఫైఆరు. వీటిలో మొదటిదయిన శివతత్త్వము శూన్యాకారము. అదే బిందువు. అది అవ్యక్తము, నిర్గుణము. అంటే పరబ్రహ్మకు రూపంలేదు, గుణం లేదు, ధర్మాధర్మాలకు, పాపపుణ్యాలకు, సృష్టి స్థితి లయాలకూ అతీతమైనది పరబ్రహ్మ. అది తేజోమయమయిన కాంతిపుంజము. అహంకారము మమకారాలు వీడి అరిషడ్వర్గాలను జయించి, జగత్తులోని ప్రతిజీవినీ తనయందు చూడగలిగిన వాడే మహాజ్ఞాని! అట్టి వానికే పరబ్రహ్మ సాక్షాత్కారం జరిగి మోక్షం లభిస్తుంది.

బిందువే ప్రకాశాంశ. పరబ్రహ్మ స్వరూపము. కాగా త్రికోణము విమర్శాంశ, పరమేశ్వరి. ఈ రెండింటికీ తేడాలేదు. నిరాకారుడైన పరబ్రహ్మ సాకారమే పరమేశ్వరి. పైన చెప్పినట్లుగా త్రికోణంనుంచే నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. అంటే ఒక వైపు నుంచి

వాటి లక్షణాలైన తన్మాత్రలు

| | | |
|---|---|---|
| ఆకాశము లక్షణము | - | శబ్దము |
| వాయువు లక్షణము | - | స్పర్శ |
| అగ్ని లక్షణము | - | రూపము |
| జలము లక్షణము | - | రసము |
| భూమి లక్షణము | - | గంధము ఏర్పడ్డాయి. |

ముందుగా ఆకాశము వచ్చింది.

| | | |
|---|---|---|
| ఆకాశము నుండి | - | వాయువు |
| వాయువు నుండి | - | అగ్ని |
| అగ్ని నుండి | - | జలము |
| జలము నుండి | - | భూమి |

ఈ రకంగా పంచభూతాలు ఏర్పడ్డాయి.

ఈ తరువాత మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు వచ్చిన తరువాత ఆహారము, ఆ తరువాత జీవకోటి ఏర్పడ్డాయి. ఈ విధంగా రూపాత్మక జగత్తు ఏర్పడింది. అలాగే త్రికోణం నుంచి ముందుగా ఓం కారమేర్పడింది. దాని నుంచి అక్షరాలు, పదాలు,

వాక్యాలు, వచ్చినాయి. వీటి నుంచి వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, సాహిత్యం, సంగీతం అన్నీ ఏర్పడ్డాయి. ఇది నామాత్మక జగత్తు. ఈ రకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఈ సృష్టిలో చలనము, జీవము లేని కొండలు, జీవమున్నా చలనము లేని వృక్షాలు, విహంగాలు, క్రిమికీటకాదులు, పశువులు, ఇలా అనేక జన్మలు ఎత్తిన తరువాత కర్మఫలాన్ని బట్టి జీవుడు మానవజన్మ ఎత్తుతున్నాడు. అందుకే మానవజన్మ కడు దుర్లభమైనది. అందులోనూ బ్రాహ్మణ జన్మ మహా ఉత్తమమైనది. అందుకనే మానవ జన్మ ఎత్తినందుకు దాన్ని సఫలం చేసుకోవాలి.

హకార సంజ్ఞ కలిగిన పరమాత్మ, సకార సంజ్ఞ కలిగిన ప్రకృతితో కలిసి హంస రూపమైన శబళబ్రహ్మమై బ్రహ్మరంధ్రం ద్వారా, తొమ్మిది ద్వారాలు గల దేహమందు ప్రవేశించి ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడినవాడై సర్వ సుఖాలూ అనుభవిస్తూ, బయటకు వచ్చే మార్గం తెలియక, పంజరంలో బంధించబడిన పక్షిలాగా, ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస అనబడే జీవుడికి,

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్ర మండలాలే | - | రెక్కలు |
| ఓంకారమే | - | శిరస్సు |
| జ్ఞాననేత్రము | - | ముఖము |
| హ కార స కారములు | - | పాదాలు |

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యి లాగా సమస్త ప్రాణి కోటినీ ఆశ్రయించి ఉన్నాడు. మానవ శరీరంలో 72000 నాడులున్నాయి. ఇవన్నీ నవరంధ్రాలను కలుపుతుంటాయి. అవసాన కాలంలో జీవుడు నవరంధ్రాలలోని ఏదో ఒక మార్గం గుండా బయటకు పోతాడు. అలాకాక వచ్చిన త్రోవనే గనక బయటకు పంపగలిగితే, అంటే బ్రహ్మరంధ్రం ద్వారానే బయటకు పంపగలిగితే జీవాత్మ పరమాత్మలో లీనమౌతుంది. ఇదే సాయుజ్యం.

ఈ రకంగా పరమేశ్వరుని వల్లనే చరాచర జగత్తు ఏర్పడుతున్నది. ప్రతి జీవియందు పరమేశ్వరుడున్నాడు. అంటే విశాలమైన విశ్వము, విశ్వమానవాళి కూడా పరబ్రహ్మ స్వరూపమే.

2. పరబ్రహ్మ స్వయం ప్రకాశం గలవాడు, జ్ఞానస్వరూపుడు, ఇచ్ఛారహితుడు. తన యందు కలిసిపోయి విడదీయటానికి వీలులేనటువంటి విమర్శ శక్తితోను, ప్రళయకాలంలో

తనలో కలిసిపోయి ఇంకా ప్రారబ్దం తీరనటువంటి జీవుల కోరికలవల్ల, మళ్ళీ సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అందులో భాగంగానే విమర్శాంశ అయిన శక్తిని బయటకు పంపాడు. పరబ్రహ్మమే బిందువు త్రికోణమేశక్తి. ఈ రెండూ వేరుకావు. ఒక్కటే ! ఈ రెండూ ఎప్పుడూ కలిసే ఉంటాయి. అందుచేతనే....

## త్రికోణే బైందవమ్‌శ్లిష్టమ్

అని చెప్పబడుతోంది. దీనిలో త్రికోణమే శక్తి. బిందువే పరమేశ్వరుడు.

***త్రికోణరూపిణీ శక్తిః । బిందురూపపరశ్శివః ॥***

సృష్టికి ముందుకాలంలో అంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యంలో నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందు రూపంలో ఉండేవాడు. ఆ బిందువే ఇప్పుడు శ్రీచక్రంలో ఉన్న బిందువు. అదే పరమేశ్వర స్వరూపం.

పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించినప్పుడు అందులో తను పాలుపంచుకోకుండా తన ప్రతిరూపమైన విమర్శరూపిణి, మాయా స్వరూపిణి అయిన శక్తి ద్వారా సృష్టి కార్యక్రమం చేయిస్తున్నాడు. బిందువు అనేది తేజోమయమైన కాంతి పుంజము. దాని కాంతుల వల్లనే త్రికోణం ఏర్పడింది. ఆ త్రికోణము వల్లనే నామరూపత్మకమైన జగత్తు సృష్టించబడింది. జగత్తును సృష్టించటానికి కావలసినవి పంచభూతాలు, తన్మాత్రలు. ఇవన్నీ శ్రీచక్రం నుండే ఆవిర్భవించాయి. పంచభూతాలలో ముందుగా ఆకాశము ఆవిర్భవించింది. అవకాశం కల్పించేది ఆకాశము. సృష్టిలోని జీవరాశులు ఎదగటానికి ఇది అవకాశం కల్పిస్తుంది. ఆకాశం అంటే శూన్యం. ఇది శూన్యం కాకుండా, ఏదైనా పదార్థంతో గనక నిండి ఉన్నట్లైతే జీవరాశి వృద్ధి చెందటానికి అవకాశం ఉండదు. ఆకాశము తరువాత వాయువు ఉద్భవించింది. ప్రాణి జీవించటానికి ముఖ్యమైనది ప్రాణవాయువు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములని వాయువు ఐదు రకాలుగా ఉంటుంది. అలాగే నాగ, కూర్మ, కృకర, ధనుంజయ, దేవదత్తములని ఉపవాయువులు ఐదు. ఈ మొత్తం వాయువులోనే ఉన్నాయి. తరువాత అగ్ని ఉద్భవించింది. అగ్ని అంటే కాంతి. దీపము, తేజస్సు, ప్రాణులు తమ కార్యకలాపాలు కొనసాగించాలంటే వెలుగు కావాలి. చీకటిలో పనిచెయ్యటం కష్టం. అందుచేతనే పగలు సూర్యుడు, రాత్రి వేళల యందు చంద్రుడు, సంధ్య వేళల యందు అగ్ని తమ కాంతులతో ఈ జగత్తును ప్రకాశింప చేస్తున్నారు. తరువాత ఉద్భవించింది జలము. ఈ

జలమే వీర్యరూపం దాల్చి జననేంద్రియాల యందు ప్రవేశించి సంతానాభివృద్ధికి తోడ్పడుతుంది. తరువాత ఆఖరిదైన భూమి ఉద్భవించింది. ఈ భూమి నుంచే జీవికి అవసరమైన ఆహారము లభిస్తుంది. ఈ ఆహారం తీసుకోవటం వల్లనే ప్రాణము నిలుస్తుంది. ఈ రకంగా జగస్సృష్టికి పంచభూతాలు అత్యావశ్యకాలు. వాటి లక్షణాలు లేక గుణాలే తన్మాత్రలు.

పంచభూతాలు, తన్మాత్రలతో జగత్తు సృష్టించబడింది. ఇక జీవరాశిరావాలి. దీనికి కావలసినది ఇంద్రియాలు. ఇవి రెండు రకాలు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. ఈ రకంగా ఇంద్రియాలు సృష్టించబడిన తరువాత జీవరాశులు ఏర్పడ్డాయి. ఇప్పుడు మానవుడు సృష్టించబడాలి. జగత్తులోని జీవరాశులన్నింటికీ ఆహార నిద్రామైధునాలు సహజమైన గుణాలు. వీటితోపాటు ఆలోచనాశక్తి గలవాడు మానవుడు. కాబట్టి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనసు అనబడే పదకొండు ఇంద్రియాలతో మానవుడు ఉద్భవించాడు. ఈ రకంగా జగన్నిర్మాణం జరిగింది. దీనికి కావలసినవన్నీ ఆ శ్రీచక్రంలోనే ఉన్నాయి.

**పంచభూతాత్మకంచైవ । తన్మాత్రాత్మకమేవచ ।**
**ఇంద్రియాత్మక మేవంచ । మనస్త త్వాత్మకం తథా ॥**

పంచభూతాలు, తన్మాత్రలు, దశేంద్రియాలు, మనస్సు అన్నీ శ్రీచక్రంలోనే ఉన్నాయి.

**మాయాది తత్త్వరూపంచ । తత్త్వాతీతంచ బైందవమ్ ।**
**బైందవే జగదుత్పత్తి । స్థితి సంహారకారిణీమ్ ॥**
**సదాశివేన సంపృక్తా తత్త్వాతీతా మహేశ్వరీ ।**

మాయాది తత్త్వముల రూపమున్నది. అన్ని తత్త్వములకు అతీతమైనది బిందువు. ఆ బిందువునందే సృష్టి స్థితి సంహారకారిణి అయిన పరమేశ్వరి ఉన్నది. సదాశివునితో కూడి సకల తత్త్వా తీతమైన మహేశ్వరి జ్యోతి రూపంగా ప్రకాశిస్తున్నది.

ఈ రకంగా శ్రీచక్రము, దాని నుండి సకల జగత్తు, ప్రాణికోటి ఆవిర్భవించగా, శ్రీచక్రములోని బిందువు నందు సకల తత్త్వాలకూ అతీతమైన పరమేశ్వరి, సృష్టిస్థితి లయకారిణి ఉన్నది. ఆమె పాదపద్మముల నుండి వచ్చే కాంతి పుంజము వల్లనే 360 రోజులు గల సంవత్సరము ఏర్పడుతున్నది.

3. శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలున్నాయి. వీటిలో ప్రథమావరణ భూపురము. పృథివీ తత్త్వాత్మకము. ఇందులో మూడు రేఖలుంటాయి. అవి భూలోక భువర్లోక సువర్లోకాలకు ప్రతీక.

రెండవ ఆవరణ షోడశదళము. చంద్రకళా స్వరూపము. దీనిలోని పదహారు దళాలలోనూ చంద్రకళలు ఉంటాయి.

మూడవ ఆవరణ అష్టదళము. అష్టమూర్త్యాత్మకము. దీని ఎనిమిది దళాలలోనూ అష్టమూర్తులుంటారు.

నాల్గవ ఆవరణ చతుర్దశ కోణము. చతుర్దశ భువనాత్మకము. దీని పధ్నాలుగు కోణాలలోనూ పధ్నాలుగు భువనాలు ఉంటాయి.

ఐదవ ఆవరణ బహిర్దశారము. దశావతారాత్మకము. దీని పది కోణాల యందు దశావతారాలుంటాయి.

ఆరవ ఆవరణ అంతర్దశారము. ఇది అగ్ని కళాత్మకము. దీని పదికోణాల యందు అగ్ని యొక్క పది కళలు ఉంటాయి.

ఏడవ ఆవరణ అష్టకోణము వాగ్దేవతాస్వరూపము. దీని కోణాలలో అష్టవసువులు వాగ్దేవతల రూపంలో ఉంటారు.

ఎనిమిదవ ఆవరణ త్రికోణము. త్రిగుణాత్మకము. దీని మూడు కోణాల యందు చంద్ర సూర్యాగ్ని మండలాలు, వాగ్భవకామరాజ శక్తి బీజాలు, సత్వరజస్తమో గుణాలు, ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు, సృష్టి స్థితిలయాలు, త్రిమూర్తులు భాషకు ఉన్న అక్షరాలు, కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని, కామరాజ, పూర్ణగిరి, జాలంధర పీఠాలు జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాలు ఈ రకంగా త్రిపుటి ఉంటుంది.

తొమ్మిదవ ఆవరణ పరబ్రహ్మాత్మకమైన బిందుమండలము. ఇక్కడ ఓడ్యాణ పీఠమున్నది. ఈ బిందువునందు అన్ని తత్త్వాలకు అతీతమైన పరమేశ్వరి ఉంటుంది.

త్రికోణంలోని మూడు రేఖల యందు ఒక్కొక్క రేఖకు ఐదు చొప్పున పదిహేను మంది నిత్యాదేవతలు కామేశ్వరి నుండి చిత్ర వరకు ఉండగా మహానిత్య అనబడే మహాత్రిపురసుందరి బిందువునందుంటుంది. ఈ నిత్యలు తిథుల స్వరూపాలని, వీటివల్లనే కాల చక్రము ఆవిర్భవించిందనీ గతంలో వివరించటం జరిగింది. అదే రకంగా అక్షరములు కూడా ఉంటాయి.

ఈ విధంగా శ్రీచక్రంలోని ఆవరణలలో ముల్లోకాలు, చంద్రకళలు అష్టమూర్తులు, చతుర్దశభువనాలు, దశావతారాలు, అగ్ని కళలు, వాగ్దేవతలు, త్రిగుణాలు, త్రిమూర్తులు,

తిధులు, నిత్యాదేవతలు, సృష్టిస్థితిలయాలు, త్రిశక్తులు - అంటే చరాచర జగత్తు అంతా ఉంటుంది. అందుచేతనే శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ। పరమేశ్వరుడు పరమేశ్వరికి శ్రీచక్రాన్ని గురించి ఉపదేశిస్తూ శ్రీచక్రం బ్రహ్మాండానికి ప్రతీక'' అన్నాడు. శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణలో శ్రీచక్రాది దేవత ఉంటుంది. ఆమె సృష్టి స్థితి లయాలకు, సర్వతత్త్వాలకు అతీతమైన పరబ్రహ్మ స్వరూపము.

4. శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోనూ తొమ్మిది రసాలున్నాయి. ఇవే నవరసాలు. వీటిలో సృష్టికి అవసరమైన శృంగార రసము భూపురమందుండగా అన్నింటికీ అతీతమైన శాంతరసము బిందువు నందుంటుంది. జగన్నిర్వాహణకు ఉపకరించే వీర, కరుణ, భయానక, రౌద్ర, భీభత్స, హాస్య, అద్భుత రసాలు మిగిలిన ఏడు ఆవరణల యందు ఉన్నాయి.

5. మనకు కావలసిన ప్రతివస్తువూ ఈ సృష్టిలోనే ఉంది. కాని మనకు అందుబాటులో ఉండదు. ఈ రకంగా అందుబాటులో లేనటువంటి వస్తువులను మన అందుబాటులోకి తెమ్మని, మనసొంతం చెయ్యని, వాటి మీద అధికారం, హక్కు మనకు ఇప్పించమనీ భగవంతుణ్ణి వేడుకుంటాము. అదే భగవంతుడికి మనం చేసే అర్చన. ఐహికమైన కోర్కెల సాధనకు నియమ నిష్టలు అవసరం. ఏదైనా ఒక పని సాధించాలంటే, ఒక పద్ధతి ప్రకారం చెయ్యాలి కదా. అందుకే నియమాలు, ఆచారాలు ఉంటాయి. అదే మోక్షసాధనకు నియమ నిష్టలతో పనిలేదు. అక్కడ కర్మాచరణ అవసరం లేదు. జ్ఞానమే ప్రధానము. అందుకనే-

**బాహ్య పూజరతాః కౌలా వామకాస్తంత్ర వాదినః।**
**అంతరారాధన పరావైదికాబ్రహ్మవాదినః॥**

కౌళాచార సంప్రదాయులు, వామాచారులు, తంత్రవాదులు మాత్రమే శ్రీచక్రానికి బాహ్యపూజ చేస్తారు. వైదికులు, మోక్షవాదులు కర్మలనాచరించరు. అంతరారాధన మాత్రమే చేస్తారు.

బాహ్య పూజచేసేవారు శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలను విడివిడిగా అర్చిస్తారు. దీన్నే ఆవరణ పూజ అంటారు. దీనిలోని ఒక్కొక్క ఆవరణను అర్చించినప్పుడు ఒక్కొక్క రకమైన సిద్ధి కలుగుతుంది.

ప్రథమావరణ భూపురము. దీన్ని గనుక అర్చించినట్లైతే సాధకుడు ముల్లోకాలను సమ్మోహనం చెయ్యగలుగుతాడు.

ద్వితీయావరణను అర్చించినప్పుడు సాధకుని కోరికలన్నీ పరిపూరితమౌతాయి.

తృతీయావరణను అర్చిస్తే సర్వసంక్షోభాలు తొలగిపోయి, సుఖ జీవనం సాగిస్తాడు.

చతుర్ధావరణను అర్చిస్తే సర్వసౌభాగ్యాలు ఒనగూడతాయి.

పంచమావరణ అర్చన సర్వరక్షాకరము. సాధకునికి రక్షణ కలుగుతుంది.

షష్ఠావరణార్చన సర్వార్ధ సాధకము. సాధకుని కోరికలు తీరతాయి.

సప్తమావరణార్చన సర్వరోగహరము. సాధకుడికి ఆరోగ్యం చేకూరుతుంది.

అష్టమావరణ సర్వసిద్ధి ప్రదము. సాధకుని కోర్కెలు అన్నీ తీరిపోతాయి.

నవమావరణార్చన సర్వానందమయము. సాధకుడు తనకు కావలసిన ఆనందాన్ని తాను పొందగలుగుతాడు. ఈ ఆవరణలు శరీరంలో ఎక్కడ ఉన్నాయో గతంలో వివరించటం జరిగింది. అయితే అతడు క్షణికానందము కాకుండా శాశ్వతానందము కోరటము సమాజ శ్రేయస్సుకు దోహదం చేస్తుంది. ఈ రకంగా సాధకునికి కావలసినవన్నీ శ్రీచక్రంలో ఉన్నాయి. శ్రీచక్రం నుండే వస్తాయి. అందుకే శ్రీచక్రము బ్రహ్మాండానికి ప్రతీక.

6. శ్రీచక్రము అంటే ఎక్కడో విడిగాలేదు. సాధకుని దేహమే శ్రీచక్రం. దేహంలోని

| | | |
|---|---|---|
| నవరంధ్రాలే | - | శ్రీచక్రంలోని నవావరణలు |
| చతుర్విధ పురుషార్ధాలే | - | సప్త సముద్రాలు |
| దేహమే | - | నవరత్న ద్వీపము |
| సంకల్పాలే | - | కల్ప వృక్షాలు |
| షడ్రుచులే | - | షడ్రుతువులు |
| క్రియాశక్తి | - | పీఠము |
| జ్ఞానశక్తి | - | మందిరము |
| ఇచ్ఛాశక్తి | - | విశ్వరూపము (దేవి స్వరూపము) |

ఈ రకంగా మానవ శరీరమే శ్రీచక్రము. జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే. దేహంలోని జీవాత్మయే ఆ పరబ్రహ్మ స్వరూపము.

మానవ శరీరంలోని వివిధాంగాలూ శ్రీచక్రంలోని ఆవరణలు

| | | |
|---|---|---|
| బిందువు | - | బ్రహ్మరంధ్రము |
| త్రికోణము | - | మస్తకము |
| అష్టకోణము | - | లలాటము |
| అంతర్దశారము | - | భృకుటి |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్దశారము | - | హృదయము |
| అష్టదళము | - | నాభి |
| షోడశ దళము | - | కటి |
| వృత్తాలు | - | ఊరువులు |
| భూపురము | - | పాదములు |

అంతేకాదు. మానవ శరీరంలోని షట్చక్రాలు కూడా శ్రీచక్రంలోని నవావరణలే.

| | | |
|---|---|---|
| ఆధార చక్రము | - | త్రికోణం |
| స్వాధిష్ఠానము | - | అష్టకోణము |
| మణిపూరము | - | అంతర్దశారము |
| అనాహతము | - | బహిర్దశారము |
| విశుద్ధిచక్రము | - | చతుర్దశారము |
| ఆజ్ఞా చక్రము | - | అష్టదళము, షోడశదళము |
| సహస్రారము | - | బిందువు |

ఇక్కడ త్రికోణము మస్తకమని ఒకచోట, ఆధార చక్రమని ఒక చోట చెప్పబడింది. ఇది సంప్రదాయ భేదముగా గ్రహించగలరు.

మోక్షవాదులకు కర్మకాండలేదు. వారికి జ్ఞానమే ప్రధానము. వారు శ్రీచక్రాన్ని తమ దేహంలోనే తలచుకుని భగవంతుణ్ణి భావనా మాత్రం గానే అర్చిస్తారు. ఇదే అంతర్యాగము.

శ్రీచక్రంలోని ప్రతి ఆవరణలోనూ వివిధ దేవతలున్నారు. వారందరూ మానవ శరీరంలోని నవరసాలు, మనోవికారాలు, చక్రాలు, పంచభూతాలు ఇంద్రియాలు, ఇంద్రియ

ధర్మాలు, నాడులు, వాయువులు ఉపవాయువులు, వాయువుల గుణములు, శరీరంలోని లక్షణాలు. కాగా సాధకుని ఆత్మ కామేశ్వరుడు, బుద్ధి కామేశ్వరి. ఈ రెంటి సమ్మేళనే పరబ్రహ్మ కాబట్టి ఆత్మ, పరదేవత రెండూ ఒక్కటే. ఎప్పుడైతే ఆత్మ పరమేశ్వర స్వరూపమైందో, అప్పుడు సాధకుడు పరబ్రహ్మ అవుతాడు. ఇదే బ్రహ్మైక్యానుసంధానము. జీవన్ముక్తి.

సాధకుడి స్థూల దేహము మాయతో కూడినది. సూక్ష్మ దేహము జ్ఞాన స్వరూపము. సాధకుడు తాను జ్ఞాన స్వరూపుడు కాబట్టి జీవాత్మను పరమాత్మ యందు లీనం చేసినట్లుగా భావించాలి. పరమేశ్వరి పాదపద్మముల నుండి వచ్చే తేజస్సులో తానుకూడా ఒకభాగమే అని, సర్వము పరబ్రహ్మ స్వరూపమని భావించటమే పరిపూర్ణ ధ్యానము. ఈ రకంగా దేవి యందు మనసు లగ్నంచేసిన సాధకుడికి బ్రహ్మత్వం సిద్ధిస్తుంది. అతడే శివయోగి అనబడతాడు. అంటే తన శరీరమే శ్రీచక్రము, పరమేశ్వరుడు తనలోనే ఉన్నాడు, అని నమ్మి భావనోపనిషత్తులో చెప్పినట్లుగా పరిపూర్ణ ధ్యానము చేసిన సాధకుడు తానే పరబ్రహ్మ అవుతాడు. పరబ్రహ్మ స్వరూపమైన చరాచర జగత్తు అతనిలోనే కనిపిస్తుంది.

7. శ్రీవిద్యలో ప్రధానమైనది పంచదశీ మహామంత్రం. ఇది శ్రీవిద్యకు గాయత్రివంటిది. పంచదశీ మహామంత్రం పంచభూతాల నుండి వచ్చింది. అంటే పంచభూతాల బీజాలయిన హ క ర స ల అనే ఐదు అక్షరములచేతనే ఈ మంత్రం ఉద్భవించింది. వీటిలో

| | | |
|---|---|---|
| హ కారము | - | ఆకాశ తత్త్వాత్మకము |
| క కారము | - | వాయు తత్త్వాత్మకము |
| ర కారము | - | అగ్ని తత్త్వాత్మకము |
| స కారము | - | జల తత్త్వాత్మకము |
| ల కారము | - | పృథివీ తత్త్వాత్మకము |

సృష్ట్యాదిలో పంచభూతాలు పంచీకరణం చెందగా మొత్తం పదిహేను తత్త్వాలు ఏర్పడ్డాయి. వాటిలో

| | | |
|---|---|---|
| ఆకాశము | - | 5 భాగాలు |
| వాయువు | - | 4 భాగాలు |
| అగ్ని | - | 3 భాగాలు |
| జలము | - | 2 భాగాలు |
| భూమి | - | 1 భాగము |
| వెరసి | - | 15 భాగాలు |

ఈ 15 భాగాలే పంచదశీ మహామంత్రంలోని 15 బీజాక్షరాలు

హ కారము ఆకాశ బీజము. ఇది 5 భాగాలు కలది. కాబట్టి మంత్రంలో 5 హకారాలున్నాయి.

ర కారమైన అగ్ని బీజము, 3 భాగాలు కాబట్టి మంత్రంలో 3 రకాలున్నాయి.

స కారము జలబీజము, 2 భాగాలు కాబట్టి మంత్రంలో 2 స కారాలున్నాయి.

ల కారము పృథివీ బీజము, 1 భాగము మంత్రంలో 3 ల కారాలున్నాయి. ఆ మూడు భూలోక భువర్లోక సువర్లోకాలకు సంకేతాలు కాబట్టి దాన్ని ఒకటిగానే పరిగణించాలి.

క కారము వాయు బీజము 4 భాగాలుంది. కాని పంచదశీ మహామంత్రంలో నాలుగు క కారాలు లేవు. అంచేత క కారము బదులుగా ఈ కారము తీసుకోవాలి.

ఇప్పుడు క కారము ఉపాసకులను తెల్పుతుంది. 3 క కారాలు. సాధకులు మూడు రకాలు.

ఇక ఏ కారము పరబ్రహ్మ స్వరూపము. ఈ రకంగా పంచదశీ మహామంత్రం పంచభూతాల నుంచే పుట్టింది. విశ్వాకారానికి ప్రతీకలైన కామేశ్వరీ కామేశ్వరుల స్వరూపమైన శ్రీచక్రము పంచదశీ మహామంత్రం నుంచే ఉద్భవించింది. పునరుక్తి దోషం లేకుండా లెక్క పెట్టినట్లైతే పంచదశీ మహామంత్రంలోని అక్షరాలు కేవలం తొమ్మిది మాత్రమే అవి ల, స, హ, ఈ, ఏ, రేప, క, నాదము, బిందువు. ఈ తొమ్మిది అక్షరాల సముదాయమే శ్రీచక్రము

| | | |
|---|---|---|
| ల కారము వలన | - | భూపురము |
| స కారము వలన | - | షోడశ దళము |
| హ కారము వలన | - | అష్ట దళము |
| ఈ కారము వలన | - | చతుర్దశారము |
| ఏ కారము వలన | - | బహిర్దశారము |
| ర కారము వలన | - | అంతర్దశారము |
| క కారము వలన | - | అష్టకోణము |
| నాదము వలన | - | త్రికోణము |
| బిందువు వలన | - | బిందువు |

అంతే కాకుండా ఈ మంత్రం ఉపాసించే దేవత వ్యష్టిగా త్రిమూర్తి ద్వంద్వము. సమిష్టిగా శాంతి అంబికల స్వరూపము. అంటే సృష్టి స్థితి లయాలకు అతీతమైనటువంటి దేవత ఏ పంచదశీ మహామంత్రంలో ఉపాసించబడుతున్నది.

ఈ రకంగా పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రం పుట్టింది. ఆ మంత్రానికి మూలం పంచభూతాలు అంటే చరాచర జగత్తు. అందులో ఉపాసించే దేవత సృష్టి స్థితి లయాలకతీతమైన పరమేశ్వరి. అలాటప్పుడు పంచదశీ మహామంత్రం నుంచే పుట్టిన శ్రీచక్రానికి అవే లక్షణాలుంటాయి కదా అందుచేత శ్రీచక్రమంటే చరాచర జగత్తేననీ, దాని అధిదేవత సృష్టి స్థితి లయాల కతీతమైన పరమేశ్వరుడు అని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.

**8.** పరమేశ్వరి అనుగ్రహంతో బ్రహ్మ సృష్టికర్త అయినాడు. అతడి కుమారుడైన మొదటి మనువు స్వాయంభువు. స్వాయంభువు మనువు కుమారుడు ప్రియవ్రతుడు. తన పాలనలో భూగోళం మీది అసమానతలను సహించలేక తన దివ్య రథంతో భూమిమీద ఏడుసార్లు రాపాడించేశాడు. దాంతో భూమి సప్తద్వీపాలుగా, సప్తసముద్రాలుగా విడిపోయింది. ఆ సప్త ద్వీపాలే ఏడుఖండాలు. ఆసియా ఖండమే జంబూద్వీపము. ఈ రకంగా పరమేశ్వరి అనుజ్ఞతోనే భూమి ఏడుఖండాలయింది.

**9.** చరాచర జగత్తంతా పరమేశ్వరుని రూపమే అదే ఆయన విరాడ్రూపము లేదా విశ్వరూపము. మహాభారత సంగ్రామం జరగటానికి నిశ్చయమైంది. ఉభయ సేనలూ కురుక్షేత్రంలో యుద్ధానికి సిద్ధంగా ఉన్నాయి. అప్పుడు కౌరవ సేనలోని బంధువులను చూసి రాజ్యంకోసమని వారిని సంహరించననీ, తనకా రాజ్యం అక్కర్లేదనీ స్పష్టం చేశాడు అర్జునుడు. అప్పుడు భగవానుడైన శ్రీకృష్ణుడు, అర్జునినికి గీతోపదేశం చేస్తూ "అర్జునా బుద్ధి, జ్ఞానము, సుఖము, దుఃఖము, చావుపుట్టుక, కీర్తి అపకీర్తి, మొ॥వన్నీనావలనే జరుగుతున్నాయి. సృష్టికి మూలపురుషులను సృష్టించినది నేనే. సర్వభూతములలోని ఆత్మను నెనే ఆది మధ్య అంతము నేనే. ప్రతిజాతిలోనూ, సమూహంలోనూ ప్రసిద్ధి చెందిన వాడను నేనే. ఐరావతము, కామధేనువు, వజ్రాయుధము, వాసుకి, ఆదిశేషుడు, సింహము, గరుత్మంతుడు ఈ రకంగా శ్రేష్ఠమైనవన్నీ నేనే. సర్వకర్త, సర్వభర్తనేనే. చరాచర జగత్తంతా నేనే ఆవరించి ఉన్నాను. చంపేది నేనే చచ్చేది నేనే, సృష్టిస్థితి లయకారకుడను నేనే" అంటూ తన విరాడ్రూపాన్ని చూపాడు. అందులో ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు, అష్టవసువులు, మరుత్తులు,

అందరూ కనిపించారు. సూర్యచంద్రులే కనులుగా, అగ్ని ముఖముగా, సకల జగత్తు దేహంగా అనేక శిరస్సులతో, అనేక బాహువులతో ఆవిరాడ్రూపం కోటి సూర్యుల కాంతితో ప్రకాశించింది.

ఈ విధంగా పరమేశ్వరుడంటే విశాల విశ్వానికీ ప్రతిరూపమే అని నిరూపించబడింది.

10. పురాణాల్లో చెప్పిన పరమేశ్వరుని విశ్వరూపమే. భాగవతంలోని గజేంద్ర మోక్షంలో పరమాత్మ ఆద్యంతములు లేనివాడు, సృష్టి స్థితి లయకారకుడు, మాయకు అతీతుడు, జ్ఞాన రూపి, మోక్ష ప్రదాత. సర్వలోక రక్షకుడు సర్వాంతర్యామి అని చెప్పబడింది. వామనావతార ఘట్టంలో వామనుడు ముల్లోకాలను ఆక్రమించినప్పుడు కూడా ఇదే రూపం వర్ణించబడింది. కాబట్టి పరమాత్మ అంటే విశాలవిశ్వానికి ప్రతిరూపమేకాని వేరుకాదు.

11. వేదాలలో కూడా విరాడ్రూపాన్ని వర్ణించటం జరిగింది. పురుష సూక్తంలో ఈ జగత్తంతా పరమాత్మ యొక్క విరాడ్రూపము. జగత్తులోని అన్ని ప్రాణులయందు పరమాత్మ ఉన్నాడు. బ్రహ్మాండమంతా వ్యాపించి ఉన్నాడు. అతనికి జననమరణాలు లేవు. అతని చేతనే మాయ సృష్టించబడి సృష్టి స్థితి లయాలు చేస్తున్నది. ఆ దేహంలో నాల్గవంతు మాత్రమే ఈ జగత్తు. మిగిలినదంతా తేజస్సు, అతని కనుల నుంచి సూర్యుడు, మనస్సు నుంచి చంద్రుడు, ముఖము నుంచి అగ్ని, ప్రాణము నుంచి వాయువు, నాభి నుంచి అంతరిక్షం. పాదము నుంచి భూమి ఉద్భవించాయి. ఈ రకంగా జగత్తంతా ఆ విరాడ్రూపం నుంచే పుట్టింది. అందుచేత జగత్తే పరమేశ్వరస్వరూపం. అదే విశ్వరూపం.

12. దాదాపుగా ప్రతి ఉపనిషత్తులోనూ పరబ్రహ్మ తత్త్వాన్ని చెప్పటం జరిగింది. ముండకోపనిషత్తులో ఈ సృష్టి అంతా పరమేశ్వరమయం అని వివరిస్తూ "పరబ్రహ్మ నుంచి అనేకమైన శరీరాలు, రూపాలు వెలువడి, మళ్ళీ అందులోనే లీనమైపోతున్నాయి. పరబ్రహ్మ నిరాకారుడు. ఆద్యంతములు లేనివాడు. మాయకు అతీతుడు. అతడి నుండే జగత్తు అంతా ఉద్భవించింది. సమస్త ప్రపంచము, అగ్ని హోత్రాది కర్మలు, జ్ఞానరూపమైన తపస్సు అతని రూపమే" అని చెప్పబడింది.

ఐతరేయో పనిషత్తులో చెప్పినట్లుగా పరమాత్మయే చరాచర జగత్తునూ నిర్మించాడు. మానవులను సృష్టించి, బ్రహ్మ రంధ్రం గుండా మానవ శరీరంలో ప్రవేశించాడు. ఈ రకంగా పరమేశ్వరుడు సర్వాంతర్యామి. కాబట్టి చరాచర జగత్తు, విశ్వమానవాళి అంతా పరమేశ్వర మయం. బృహదారణ్యకోపనిషత్తులోచరాచరజగత్తునూ పరమేశ్వరుడు తన తేజస్సుతోనే ప్రకాశింప చేస్తున్నాడు అని, సృష్టికి మూలకారకుడు అతనేనని చెప్పబడింది.

తైత్తిరీయోపనిషత్తులో చెప్పినట్లుగా కుమారుడైన భృగుమహర్షికి వరుణమహర్షి బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తూ, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాల మధ్య ఆనందమయ కోశమందు పరబ్రహ్మమున్నది. శాశ్వతమైన ఆనందమే పరబ్రహ్మ, అంటాడు. అందుచేతనే సర్వానందమయమైన బిందు స్థానమందు పరమేశ్వరి ఉన్నది.

ఛాందోగ్యోపనిషత్తులో శౌనక అభిప్రతారి మహర్షులతో వాదిస్తూ వారు ఆరాధించే పరమేశ్వరుడే వారిలోనూ, తనలోనూ, అన్నమునందు, సకల చరాచర జగత్తు నందు ఉన్నాడు. అని బోధిస్తాడు. అంటే పరబ్రహ్మ సర్వాంతర్యామి.

సత్యకామ జాబాలికి ఆబోతు, అగ్నిదేవుడు, హంస, నీటిపక్షి పరబ్రహ్మ తత్త్వాన్ని వివరిస్తూ, "జగత్తులోని నాలుగు దిక్కులూ, భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, పర్వతాలు, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు, ప్రాణము, దృష్టి శ్రవణము, మనస్సు అన్నీ బ్రహ్మమయాలే" అని చెబుతాయి.

ఉపకోశలుడికి అగ్నులు పరబ్రహ్మతత్త్వాన్ని వివరిస్తూ ప్రాణమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ, ఆనందమే బ్రహ్మ . సూర్యుడు, చంద్రుడు, అగ్ని అన్నీ బ్రహ్మమయాలే. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, నేల, నింగి, వీటిన్నటిలోనూ ఒకే తత్త్వమున్నది అని బోధిస్తాయి. అంటే చరాచర జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. కేనోపనిషత్తులో ఇంద్రాది దేవతలకు బ్రహ్మతత్త్వం కనిపించి "బ్రహ్మతత్త్వము సకల జీవులయందు అంతరాత్మగా వ్యాపించి జీవరాశికి శక్తిని ప్రసాదిస్తున్నది. అని చెబుతుంది.

**13.** క్రైస్తవ మతంలో సర్వేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపి. ఆద్యంతములు లేనివాడు. దయామయుడు, మహాజ్ఞాని, సర్వవ్యాపి. భూలోకపరలోకాలను ఆయనే సృష్టించాడు. లోకంలోని పాపులను రక్షించటానికి వారి శరీరంలో ఆత్మగా ప్రవేశించాడు. కాబట్టి జగత్తంతా సర్వేశ్వరునిచే సృష్టించ బడింది. అతడు మానవులందరి యందు ఉన్నాడు. అతడే సర్వేశ్వరుడు. ఇస్లాం మతంలో కూడా అల్లాయే ఈ జగత్తుకు సృష్టి కర్త రక్షకుడు.

**14.** భగవంతుణ్ణి ఆరాధించే వారిని మూడురకాలుగా విభజించవచ్చు 1) సకలులు 2) ప్రళయాకలులు, 3) నిష్కలులు. సకలులు ద్వైత భావం కలిగి ఉంటారు. వీరి దృష్టిలో భగవంతుడు వేరు, భక్తుడు వేరు. వీరికి కావలసింది ఐహిక సుఖాలు మాత్రమే. అందుచేత వీరు బాహ్య పూజచేస్తారు. భగవంతుడి స్థూల రూపాన్ని అర్చిస్తారు. లోకంలో ఇలాంటి వారి సంఖ్యే ఎక్కువగా ఉంటుంది. జాతి మతాలతో తేడా లేకుండా వీరు ఐహిక లంపటంలో

కూరుకుపోతూ ఉంటారు. చతుర్విధ పురుషార్థాలలో అర్థకామాలే వీరికి కావలసినవి. వీరి దృష్టిలో శ్రీచక్రంలో ఉండే దేవత చతుర్భుజగా ఉంటుంది. ఆమె చేతుల యందు పాశము, అంకుశము, ధనుర్బాణాలు ఉంటాయి. ఆ రూపం ఎలా ఉంటుందో గతంలో వివరించటం జరిగింది. ప్రళయాకలులు మిశ్రమ దృష్టి కలిగి కర్మలను ఆచరిస్తూ జ్ఞాన దృష్టి కలిగి దేవి సూక్ష్మ రూపాన్ని ఆరాధిస్తారు. నిష్కలులు కేవలము జ్ఞాన స్వరూపులు జగత్తునందు భేద దృష్టి లేకుండా ఆత్మానందాన్ని అనుభవిస్తూ అన్నింటిలోనూ భగవంతుణ్ణే చూస్తూ పరా స్వరూపాన్ని ఆరాధిస్తుంటారు. వీరి దృష్టిలో జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే.

వేదాలు, వేదాంగాలు, పురాణాలు, ఉపనిషత్తులలో పరబ్రహ్మని గురించి ఇవ్వబడింది. పరబ్రహ్మకు రూపం లేదు. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. చరాచర జగత్తుకు మూలకారణం అతనే. సృష్టికి ముందు అంతా శూన్యంగా ఉండేది ఆ శూన్యంలో పరబ్రహ్మ బిందు రూపంలో ఉండేవాడు. పరబ్రహ్మకు రూపం లేదు కదా? మరి బిందు రూపమని ఎందుకంటున్నాము? అతడు నిరాకారుడు అయినప్పటికీ మన గుర్తు కోసం బిందువు అంటున్నాము. పైగా బిందువు అనంతమైనది. విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. దానికి ఏ రకమైన కొలతలూ లేవు. చిన్నది అణువు, విస్ఫోటం చెందితే బ్రహ్మాండం, ఈ రకంగా శూన్యంలో కూడా పరబ్రహ్మ అంతటా వ్యాపించి ఉన్నాడు అని చెప్పటానికే అతను బిందురూపుడు అంటున్నాము.

కొంత కాలానికి పరబ్రహ్మకు సృష్టిచెయ్యాలనే సంకల్పం కలిగింది. గతంలో ప్రళయం సంభవించినప్పుడు ప్రారబ్ద కర్మతో కలిసి తన యందు లీనమై పోయిన జీవుల కర్మను క్షయం చేసి వారికి మోక్షం ప్రసాదించాలనే కోరిక తోనే సృష్టి చెయ్యాలనే సంకల్పం చేశాడు. అంతే కాని, అతడికి ఇతరమైన కోరికలు ఏవీ లేవు. శుద్ధజ్ఞానస్వరూపుడు సర్వానికీ అతీతుడు. అతడికి రాగద్వేషాలు ఉండవు. ధర్మాధర్మాలు ఉండవు. అతడు ఏకాకి. ఆద్యంతములు లేనివాడు. సృష్టి చెయ్యాలని సంకల్పించినప్పుడు తనలోని విమర్శశక్తిని బయటకు పంపాడు. ఆ శక్తి ద్వారా సృష్టి జరిగింది. అంతేకాని పరమాత్మకూ, సృష్టికీ ఏ రకమైన సంబంధం లేదు. కాని సృష్టిలోని ప్రతి అణువు నందు తాను ఉన్నాడు.

ఈ జగత్తులోని తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాలుగు దిక్కులూ పరబ్రహ్మ స్వరూపమే. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, చెట్లు, చేమలు, పశువులు, పక్షులు, సముద్రాలు, లోయలు, పరబ్రహ్మ స్వరూపమే.

అగ్నిలో ఏ తత్త్వమైతే ఉన్నదో ఆ తత్త్వము సూర్యునిలో ఉన్నది. అదే చంద్రునిలోనూ, నక్షత్రాలలోనూ, మనలోనూ కూడా ఉన్నది. ఈ రకంగా జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమై ఉన్నది.

శ్రీచక్రంలోని బిందువునందు పరమేశ్వరుడున్నాడు. అసలు శ్రీచక్రమే జగత్తు జగత్తుకు అధిదేవత పరమేశ్వరుడు కాబట్టి బిందువునందు శ్రీచక్రాది దేవత అయిన పరమేశ్వరుడు ఉన్నాడు. పరమేశ్వరుడు బిందు స్వరూపుడు శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ బిందువు. అక్కడ ఉండేది పరమేశ్వరుడని వేరే చెప్పనవసరం లేదు. ఆ బిందువే శివశక్తుల స్వరూపం. ప్రకృతి పురుషుల రూపం. సృష్టి చెయ్యటానికి బిందువు నుంచే శక్తి బయటకు వచ్చింది. బిందువు ప్రకాశాంశ, శక్తి విమర్శాంశ. వీరే శివశక్తులు ప్రకృతి పురుషులు, కామేశ్వరీ కామేశ్వరులు. విమర్శశక్తి మాయా స్వరూపిణి. పరమేశ్వరుణ్ణి మాయ ఆవరించి ఉంటుంది. ఆ శక్తి త్రికోణ రూపంలో ఉంటుంది. త్రికోణాన్ని అర్చించినప్పుడు సాధకునికి సర్వ సిద్ధులు ఒనగూడతాయి. అప్పుడు స్వయంగా తానే సాక్షాత్తూ పరబ్రహ్మ అవుతాడు. అందుకనే బిందువును అర్చించేటప్పుడు ప్రకృతి పురుషులనిద్దరినీ కామేశ్వరులని చెప్పటం జరుగుతుంది. ఇది సకలులకు అంటే అర్థకామాల కోసం భగవంతుని అర్చించే వారికి ఇక్కడ దేవత స్థూల రూపంతో ఉంటుంది. అంతకన్న ఉన్నత స్థితిలో ఉన్న మోక్షగాములు బిందువునందు కేవలము పరమాత్మనే చూడగలుగుతారు. ఆ పరమాత్మయే చరాచర జగత్తు, విశ్వమానవాళి. అందుచేతనే వారు ఈ జగత్తునంతా తమలో చూడగలుగుతారు. లోకంలోని ప్రాణులన్నింటినీ సమానంగా చూడగలుగుతారు. వారే మహాజ్ఞానులు. వారి దృష్టిలో శ్రీచక్రాది దేవత చరాచర జగత్తు, విశ్వమానవాళి.

లోకంలోని అన్ని జాతులవారు, మతాల వారుకూడా పరమాత్మ నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అనే చెబుతున్నారు. అతడే ఈ జగత్తును సృష్టించాడని, అన్ని ప్రాణాలయందు ఉన్నాడని అంటున్నారు. ఆ పరమాత్మయే శ్రీచక్రాది దేవత అయినప్పుడు, ఆ దేవత అందరికీ వందనీయయే.

ఆ పరమేశ్వరుడు సృష్టించిన చరాచర జగత్తు, విశ్వమానవాళియే శ్రీచక్రాదిదేవత అయినప్పుడు, ఆ దేవతకు నమస్కరించటానికి ఎవరికి మాత్రం అభ్యంతరముంటుంది ?

శ్రీచక్రంలోని దేవతకు స్థూల రూపం మాత్రమే ఉన్నది. అంటే ఇతరులు దాన్ని దేవతగా అంగీకరించక పోవచ్చు. కాని చరాచర జగత్తే అక్కడి దేవత. విశ్వమానవాళియే

అక్కడి దేవత కాబట్టి లోకంలో ఉన్న ప్రాణాలన్నింటినీ, పూజించండి గౌరవించండి. మానవులందర్నీ సమానంగా చూడండి. అందరూ పరమాత్మ స్వరూపులే అంటే ఎవరికి మాత్రం అభ్యంతరముంటుంది? అలా అని, అన్ని మతాల వారు శ్రీచక్రాన్ని పూజించాలి అనటం లేదు. ఎవరి నమ్మకం వారిది. వారు చెప్పే భగవంతుడు కూడా ఇదే రూపంలో ఉన్నప్పుడు, వారు శ్రీచక్రాన్ని పూజించనవసరంలేదు. కాని శ్రీచక్రంలో ఉన్న దేవత మాత్రం ఏ ఒక్క మతానికీ, జాతికీ సంబంధించిందికాదు. విశాలమైన విశ్వానికి సంబంధించింది. చరాచర జగత్తుకు సంబంధించినది.

శ్రీచక్రంలో దేవతకు పరిమితమైన పరిధి కాదు. శ్రీచక్రాన్ని కొంతమంది మాత్రమే పూజిస్తే దాని పరిధి పరిమితమై పోతుంది. అందులోని దేవత పరబ్రహ్మ అయినప్పుడు ఇంక దానికి పరిధులుండవు. యోగశాస్త్రం కూడా సహస్రారంలో జ్ఞానికి ఆత్మసాక్షాత్కారమౌతుంది అని చెబుతోంది. ఈ లోకమంతా తనలోనే ఉన్నది. తాను పరబ్రహ్మస్వరూపము అనే జ్ఞానం కలుగుతుంది. అంతేకాని అక్కడ స్థూలరూపం ఉండదు.

కాబట్టి శ్రీచక్రంలో ఉండే దేవత సామాన్య దృష్టితో చూసేవారికి స్థూల రూపంలో ఉన్నప్పటికీ, సూక్ష్మదృష్టితో పరిశీలించినట్లైతే పరబ్రహ్మ అని తెలుస్తుంది. ఈ జగత్తంతా పరమేశ్వరమయం, పరబ్రహ్మ అంటే చరాచర జగత్తే. అందుచేత అన్ని మతాల వారికి, జాతుల వారికి, కులాల వారికి కూడా శ్రీచక్రం నమస్కరింప దగినది. మతం కన్నా మానవత్వం గొప్పదనే సూత్రాన్ని గుర్తు చేస్తూ దాని పరిధి పరిమితం కాకుండా ప్రపంచమంతా వ్యాపించి ఉన్నది.

ఈ రకంగా సర్వమత సమానత్వాన్ని, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని తద్వారా ప్రపంచశాంతిని ప్రబోధిస్తూ సర్వ మతాలకు, సర్వ సిద్ధాంతాలకు అతీతంగా విశ్వరూపమై, విశ్వాత్ముని విశదం చేసేదే శ్రీచక్రము. దీన్ని అనుష్ఠించటం ద్వారా విశ్వమానవ కల్యాణము సిద్ధిస్తుంది. అంటూ 'శ్రీచక్ర సర్వస్వాన్ని' ముగించాడు రత్నాకరుడు.

హరితస గోత్రీకుడు, శ్రీమతి సత్యపర్వత వర్ధనమ్మ శ్రీకృష్ణమూర్తిగారల

జ్యేష్ఠపుత్రుడు అయిన **క్రోవిపార్థసారథి**

సర్వజనామోదము పొందునట్లుగా సులభశైలిలో వ్రాసిన

**"శ్రీచక్ర సర్వస్వము"** అను గ్రంథము సమాప్తము.

ఓం తత్సత్